శ్రీరస్తు

శ్రీనందికేశ్వరప్రోక్తం

# అభినయదర్పణమ్

A compacted BHARATARNAVAM

Same author, NANDIKESWARA.



compacted "Bharatarnavam 'A Guide' & Kuchipudi

చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

ఇత్యేతైః, ప్రకటితం.

1934.

# పీఠిక.

శ్రీమత్సకలభువనకర్తయైన శ్రీయఃపతికిం బ్రియతమంబై నిఖిలరసికజనాహ్లాదభాజనంబై సర్వలోకవ్యాపకంబై విలసిల్లెడి భరతశాస్త్రము.—

> "శంభుర్గౌరీ తథా బ్రహ్మా మాధవో నందికేశ్వరః,
> దత్తిలో కోహళశ్చైవ యాజ్ఞవల్క్యశ్చ నారదః.
> హనూమాన్విఘ్నరాజశ్చ షణ్ముఖోథబృహస్పతిః,
> అర్జునో రావణశ్చైవ కన్యాబాణసుతాతథా.
> ఏతే భరతకర్తారో భువనేషు ప్రకీర్తితాః."

అనఁగా, శివుఁడు, పార్వతి, బ్రహ్మ, విష్ణువు, నందికేశ్వరుఁడు, దత్తిలుఁడు, కోహళుఁడు, యాజ్ఞవల్క్యుఁడు, నారదుఁడు, ఆంజనేయుఁడు, విఘ్నేశ్వరుఁడు, సుబ్రహ్మణ్యుఁడు, బృహస్పతి, అర్జునుఁడు, రావణుఁడు, ఉషాకన్యక అనువారు భరతశాస్త్రకర్తలు అని లోకములయందు కొనియాడఁబడుచున్నారు అను నీయర్థముగల ప్రమాణశ్లోకములచేత వన్నెకెక్కియున్నది. అట్టుండియు ప్రకృతమునందు మనవారందరును అభినయవిద్యను సాధారణవిద్యలలో నొకటిగా నెంచి యాదరింపకపోవుటయే గాక, అది కేవల పామరరంజకవిద్య

యనియు, శిష్టులకు పరిగ్రహణీయము కాదనియు, నాట్య
ప్రవర్తకులకే యభ్యసనీయమనియు నుల్లంఘించి యున్నా
రనుట యెల్లవారికిని తెల్లమే కదా? మోక్షసాధకమగు
యోగశాస్త్రమును బోలిన యీశాస్త్రము ఇట్టివారికి నచ్చు
టకు నాయికానాయకవ్యాపారములను సాంగములయిన
యితరవిషయములనుజూపి ధర్మమునందు ప్రవృత్తిఁ గలుగఁ
జేయుటయే గాక గూఢార్థప్రవర్తకములై, ఆంగికాభినయ
ములవలన రసికులగు నభిజ్ఞులకు నానందప్రదములై యుట్టి
రసికాగ్రగణ్యులచే నాయభినయవిద్యాప్రవీణులు ప్రస్తావింపఁ
బడునవియును కేవల నటీప్రత్యములుగా నెన్నఁబడుటయు,
జనులమనసులందు దోఁచు విషయములను అంగచలనాదులచే
తెలిసికొనుటవలన కామవికారము కలుగునను భ్రాంతియును
కారణములగుచున్నవి. అట్లుగాక సూక్ష్మదృష్టిని చక్కఁగా
విచారించునెడల ఈశాస్త్రము శృంగారరసాధిష్ఠానదేవతయు
లోకజనకుఁడు నగు శ్రీకృష్ణదేవుని లీలావినోదములను ఆయా
రసానుభవములతోడ నూహించి తెలిసికొనుటవలన బ్రహ్మ
జ్ఞానమును, ఆజ్ఞానమువలన మోహముఁబాసి యున్నయెడ అస్థిర
ములయిన వ్యాపారములు అనుత్పాద్యములును, ఆనాత్మవ్య
ములైన అట్టివ్యాపారములందు విరక్తియు, శాంతిదాంత్యాది
విశిష్టగుణములును జనింపఁగా నిత్యసుఖప్రదమయిన బ్రహ్మా
నందమును బొందించు ననువిషయము తేటపడును గనుక,
నాయికానాయకవ్యాపారములు జ్ఞానపారమార్థికమునందు గురు

హస్తములయొక్క నేత్రసేవకభావబోధకములే గాని యితరములు కావు అని బ్రహ్మాదులచేత చెప్పఁబడియున్నది కనుకను, ధర్మార్థకామమోక్షము లనెడిచతుర్విధపురుషార్థములకును సాధకములును, సర్వలోకశ్రేష్ఠములును దేవతారాధనకృత్యములును నైనయీ భరతశాస్త్రము ఎల్లవిధముల నెల్లరును పరిగ్రహణీయమును అభ్యసనీయమును నగును అని విచారించి, కాలానుసారముగా దినదినక్షీణదశనొందుచున్న దీనిని యథోచితప్రచారమునకు తేఁదలఁచి, భరతకర్తలలో నొకరగు నందికేశ్వరునిచేఁజెప్పఁబడిన 'యభినయదర్పణము' అనుగ్రంథమును సటీకా ముఖ్యహస్తముల స్వరూపములను దెలిపెడి చిత్రపుస్తకముల నాయాహస్తముల లక్షణశ్లోకములకు మొదటఁజేర్చుచును, గ్రంథాంతరములందు చెప్పఁబడిన ఆయాహస్తములయుత్పత్తికాలము, ఋషిదేవతాజాతివర్ణములు మొదలగు వానినిగూర్చియును విశేషసంయుతహస్తములను, ప్రసిద్ధరాజులహస్తములను, పుణ్యనదులహస్తములను, అశ్వత్థాదివృక్షహస్తములను, సింహాదిమృగహస్తములను, హంసాదిపక్షిహస్తములను, నక్రాదిజలజంతుహస్తములను, శిరోభేదాద్యనేకవిషయములను సంగ్రహించియును నిట్లుచేరిన నన్నాటయొనరిచి యీవిషయములను తెలుపునట్టి శ్లోకములకు స్త్రీబాలబాలికాదులకుగూడ తేటగా దెలియునట్లు సులభములైనమాటలతో తెనుఁగుతాత్పర్యము వ్రాసి మంచి అక్షరములతో ముద్రింపించితిమి.

ఇదిగాక అభినయమునందు నవరసములు మొదలగు వానిని దెలుపఁదగిన భరతరసప్రకరణమనెడిగ్రంథమును నిక్లే తెనుఁగుతాత్పర్యముతో మాచేత ముద్రింపఁబడియున్నది.

తండయార్పేట,
చెన్నపురి,
10-6-1934.

ఇట్లు,
వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

# విషయసూచిక.



## హస్తానాం చతుర్వింశతినామ నిరూపణమ్.



## గ్రంథాంతరస్థసంయుతహస్తలక్షణాని.

## గ్రంథాంతరస్థ విప్రకీర్ణాది హస్తలక్షణాని.

## అథ పక్షిహస్తలక్షణాని.



## అథ జలజన్తుహస్తలక్షణాని.

శ్రీ ర స్తు.

నన్దికేశ్వర ప్రోక్తం

# అభినయదర్పణమ్.

---

### ఇష్టదేవతాప్రార్థనా.

శ్లో. ఆఙ్గికం భువనం యస్య వాచికం సర్వవాఙ్మయమ్,
ఆహార్యం చన్ద్రతారాది తం వందే సాత్త్వికం శివమ్. 1

తా. ఎవనికి భువనము ఆంగికాభినయమో, వాగ్రూపములైనవియెల్ల నెవనికి వాచికాభినయమో, చంద్రతారాదులు ఎవనికి ఆహార్యాభినయమో, అటువంటి సత్త్వప్రధానుఁడగు శివునికి నమస్కరించెదను.

ఇన్ద్ర ఉవాచ:—

కళ్యాణాచలవాసాయ కరుణారససింధవే,
నమోఽస్తు నందికేశాయ నాట్యశాస్త్రార్థదాయినే. 2

తా. ఇంద్రుఁడు:— కైలాసపర్వతనిలయుఁడును, దయాసముద్రుఁడును, నాట్యశాస్త్రార్థప్రదుఁడునైన నందికేశ్వరునికి నమస్కరించెదను.

నన్దికేశ్వర ఉవాచ:—

స్వాగతం తే సురాధీశ కుశలం త్రిదివౌకసామ్,
కిమర్థమాగతం బ్రూహి భవతా మమ సన్నిధౌ. 3

తా. నందికేశ్వరుఁడు:—ఓయింద్రుఁడా! నీకు స్వాగతము. స్వర్గవాసులందరికిని క్షేమమా? నీరాకకు కారణమేమి?

ఇన్ద్ర ఉవాచ:—

త్వదీయకృపయా పూర్వం నాట్యశాలామలఙ్కృతామ్,
త్వదీయ నర్తక స్సోఽయం త్వత్కృపామభివాఞ్ఛతి. 4

తా. ఇంద్రుఁడు:—ఓయి నందికేశ్వరుఁడా! తొల్లి నీకృపారసముచే నలంకరింపఁబడిన నర్తనశాలకధిపతియైన యీ నీ నర్తకుఁడు నీదయను గోరి వచ్చియున్నాఁడు.

నన్దికేశ్వర ఉవాచ:—

మయా విధేయం కిం తస్య వద వాసవ తత్త్వతః,

తా. నందికేశ్వరుఁడు:—ఓయింద్రుఁడా! నీకు నాచేతఁ జేయఁదగిన దేమి చెప్పుము.

ఇన్ద్ర ఉవాచ:—

దైతేయనాట్యశాలాయాం నర్తకో నటశేఖరః. 5
తం విజేతుమయం నాట్యవినోదైః క్రమవేదిభిః,
భవద్విరచితం గ్రంథం భరతార్ణవమిచ్ఛతి. 6

తా. ఇంద్రుఁడు:—అసురనాట్యశాలయందు నటశేఖరుఁ డనెడు నటుఁడు గలఁడు. నాట్యక్రమములను దేటపరచు వినోదములచే వానిని జయించుటకు మీచే రచియింపఁబడిన భరతార్ణవమనెడు గ్రంథము నపేక్షించుచున్నాను.

నన్దికేశ్వర ఉవాచ:—

చతుస్సహస్రసంఖ్యాకైర్గ్రంథైశ్చ పరిపూరితమ్,
భరతార్ణవశాస్త్రన్తు సుమతే శృణు సాదరమ్. 7

తా. నందికేశ్వరుఁడు:—ఓయింద్రుఁడా! నాలుగువేలగ్రంథములు గల భరతార్ణవ మనెడు గ్రంథమును తెలియఁజెప్పెదను. నీవవహితుఁడవై వినుము.

ఇన్ద్ర ఉవాచ:—

నన్దికేశ దయామూర్తే విస్తరాత్సంవిహాయ మే,
సంక్షిప్య నాట్యశాస్త్రార్థం క్రమపూర్వముదాహర. 8

తా. ఇంద్రుఁడు:—దయామూర్తివైన నందికేశ్వరుఁడా! ఈగ్రంథమును సంగ్రహించి నాట్యశాస్త్రార్థములను యథాక్రమముగా నాకుఁ జెప్పుము.

నన్దికేశ్వర ఉవాచ:—

వదామి సుమతే దేవ సంక్షిప్య భరతార్ణవమ్,
దర్పణాఖ్యమిదం సూక్ష్మ మవధారయ సాదరమ్. 9

తా. నందికేశ్వరుఁడు:—ఓయింద్రుఁడా! భరతార్ణవమనెడు గ్రంథమునకు సంక్షేపమగు దర్పణమను నీగ్రంథమును జెప్పెదను దీనిని శ్రద్ధాళువై వినుము.

నాట్యం నృత్తం నృత్యమితి మునిభిః పరికీర్తితమ్,

తా. ఓయింద్రుఁడా! ఋషులు నాట్యము,నృత్తము, నృత్యము నని మూఁడువిధములఁ జెప్పుచున్నారు.

నాట్యం తన్నాటకేష్వేవ యోజ్యంపూర్వకథాయుతమ్.10

తా. నాట్యమనునది నాటకమునందు మాత్రము పూర్వకథతోఁడ విని యోగింపఁదగినది.

రసభావవిహీనం తు నృత్తమిత్యభిధీయతే,

తా. రసభావములు లేక తాళలయాశ్రయమైయుండునది నృత్తము.

రసభావవ్యంజకాదియుతం నృత్యమితీర్యతే. 11

తా. నృత్యమనఁగా రసము, భావము మొదలగువానితోఁ గూడి యుండునది.

ఏతత్త్రయం ద్విధా భిన్నం లాస్యతాణ్డవసంజ్ఞకమ్,

తా. ఈనాట్య నృత్త నృత్యములుమూఁడును మరల లాస్యమనియుం, తాండవమనియుం రెండువిధములుగా విభజింపఁబడియున్నవి.

సుకుమారం తు తల్లాస్య ముద్ధతం తాణ్డవం విదుః. 12

తా. సుకుమార మగునది లాస్యమును, ఉద్ధతమగునది తాండవమును నని చెప్పుదురు.

ద్రష్టవ్యే నాట్యనృత్యే చ పర్వకాలే విశేషతః,

తా. నాట్యనృత్యములు రెండును పర్వకాలములయందు ముఖ్యముగ చూడఁదగినవి.

నృత్యం తత్ర నరేన్ద్రాణా మభిషేకే మహోత్సవే. 13
యాత్రాయాం దేవయాత్రాయాం వివాహే ప్రియసఙ్గమే,
నగరాణా మగారాణాం ప్రవేశే పుత్త్రజన్మని. 14
శుభార్థిభిః ప్రయోక్తవ్యం మాఙ్గళ్యం సర్వకర్మసు,

తా. మీదఁజెప్పఁబడినమూఁటిలో మూఁడవదియుం మంగళప్రదము నగు నృత్యము రాజపట్టాభిషేకము, తిరునాళ్లు, ఊరేగింపు, దేవునియూరే గింపు, పెండ్లి, మిత్రసమాగమము, పురప్రవేశము, గృహప్రవేశము, పుత్త్రో త్సవము వీనియందు ప్రయోగించవలయును.

ఋగ్యజుస్సామవేదేభ్యో వేదాచ్చాఽథర్వణాత్త్రిమాత్.

వాద్యం చాఽభినయం గీతం రసాన్ సఙ్గృహ్యా పద్మభూః,
వ్యరీరచచ్ఛాస్త్రమిదం ధర్మకామాదిసిద్ధిదమ్. 16
దుఃఖార్తిశోకనిర్వేదఖేదవిచ్ఛేదసాధనమ్,
అపి బ్రహ్మపరానన్దాదిదమప్యధికం భవేత్. 17

తా. పూర్వకాలమునందు బ్రహ్మదేవుఁడు ఋగ్వేదమునుండి వాద్యమును, యజుర్వేదమునుండి యభినయమును, సామవేదమునుండి గానమును, అథర్వణవేదమునుండి రసములను సంగ్రహించి యీ శాస్త్రమును రచించెను. ఇది ధర్మార్థకామమోక్షముల నిచ్చునదియ కాక దుఃఖము, ఆర్తి, శోకము, నిర్వేదము, ఖేదము మొదలైనవానిని బోఁగొట్టునదియుం నగును. మరియుం నిది బ్రహ్మానందమునకంటె నధికమగు నానందమును గలుగఁజేయును. (కలహావస్తునాశ ప్రయత్నభంగాదులచేతఁ గలుగునది దుఃఖము. ఇతరులు చేయుం హింసాదులచేతఁ గలుగునది ఆర్తి. బంధుమరణము మొదలగువానిచేత సంభవించునది శోకము. తనకిష్టవస్తుప్రాప్తి చేకూరనపుడును సారహీనత తోఁచినపుడును కలుగునది నిర్వేదము. గతశోకకృత్యములను తలఁచినపుడు పుట్టునది ఖేదము.)

తత్ర నృత్యం మహారాజసభాయాం కల్పయేత్సదా,

తా. ఈమీఁదఁ జెప్పిన మూఁటియందును నృత్యము మహారాజసభలో నెల్లప్పుడును సంతోషముతో జరపుచుండవలయును.

## స భా ల క్ష ణ మ్.

సభాకల్పతరుర్భాతి వేదశాఖోపశోభితః,
శాస్త్రపుష్పసమాకీర్ణో విద్వద్భ్రమరసంయుతః. 18

తా. సభయనెడి కల్పవృక్షము, వేదములనెడి కొమ్మలచేత ప్రకా

శించునదియు, శాస్త్రములనెడి పుష్పములచేత నిండుకొన్నదియును, విద్వాంసులనెడి తుమ్మెదలతోఁ గూడినదియునై వెలుఁగుచున్నది.

సత్యాచారసభా గుణోజ్జ్వలసభా సద్ధర్మకీర్తిస్సభా
వేదాలఙ్కృతరాజపూజితసభా వేదాన్తవేద్యా సభా,
వీణావాణివిశేషలక్షితసభా విఖ్యాతవీరా సభా
రాజద్రాజకుమారశోభితసభా రాజత్ప్రకాన్తిస్సభా. 19

తా. సత్యముతప్పక నడపువారుగలదియును, సద్గుణములచే మెరయునదియును, మంచిధర్మమును కీర్తియును గలిగినదియు, వేదముచదివిన రాజులచేత పూజింపఁబడునదియు, వేదాంతము నెఱిఁగినదియు, వీణా గానము, వాచికగానము మొదలగువానితోఁ గూడినదియు, ప్రసిద్ధ వీరులు గలదియు, తేజస్సుచేత వెలుఁగుచున్న రాజకుమారులచేత ప్రకాశించునదియు సభ అనఁబడును. అనఁగా సభయనునది యిన్నిలక్షణములును గలదయి యుండవలయుననుట.

విద్వాంసశ్చ కవయో భట్టాః గాయకాశ్చ పరిహాసకాః,
ఇతిహాసపురాణజ్ఞా స్సభాసప్తాఙ్గలక్షణమ్. 20

తా. విద్వాంసులు, కవులు, పెద్దలు, గాయకులు, పరిహాసకులు, ఇతిహాసములను తెలిసినవారు, పురాణములను తెలిసినవారు అని యిట్లు సభకేడంగములు.

### సభానాయకలక్షణమ్.

శ్రీమాన్ ధీమాన్ వివేకీ వితరణనిపుణో
గానవిద్యాప్రవీణః,
సర్వజ్ఞః కీర్తిశాలీ సరసగుణయుతో
హావభావేష్వభిజ్ఞః,
మాత్సర్యాద్యైర్విహీనః ప్రకృతిహితసదా
చారశీలో దయాళుః,

ధీరోదాత్తః కలావాన్ నృపనయచతురో
ఽసౌ సభానాయకస్స్యాత్. 21

తా. సంపదగలవాఁడును, బుద్ధిమంతుఁడును, యుక్తాయుక్తవివేకము గలవాఁడును, దానశీలుఁడును, గానవిద్యయందు నేర్పుగలవాఁడును, సర్వజ్ఞుఁడును, కీర్తిశాలియు, సరసగుణములుఁగలవాఁడును, హావభావములఁ దెలిసినవాఁడును, మాత్సర్యాది దుర్గుణములు లేనివాఁడును, ఆయాకాలమునకుఁ దగిన మంచినడవడికల నెఱిఁగినవాఁడును, దయగలవాఁడును, ధీరోదాత్తుఁడును, విద్వాంసుఁడును, రాజనీతియందు చతురుఁడును నగువాఁడు సభానాయకుఁడు కాఁదగును. (శ్లో. గ్రీవారేచకసంయుక్తో భ్రూనేత్రాదివిలాసకృత్, భావ ఈషత్ప్రకాశో యస్సహావ ఇతి కథ్యతే.—అనఁగా మనోగతభావమును సంజ్ఞలు మొదలగువానిచేఁ దెలుపుట హావము. శ్లో. నిర్వికారస్య చిత్తస్య భావస్స్యాదతివిక్రియా. వికారరహితమగు చిత్తమున కత్యంతవికారము కలుగుట భావము. శ్లో. గమ్భీరస్సారసమ్పన్నః కృపావానవికత్థనః, పరకీయగుణగ్రాహీ ధీరోదాత్తస్సకథ్యతే. గంభీరుఁడును-అనఁగా కోపసంతోషములయందు మార్పుచెందనివాఁడును, దేహబలముగలవాఁడును, పరులదుఃఖమునఁజూచి యోర్వలేనివాఁడును, తన్నుఁదాఁ బొగడుకొననివాఁడును, ఇతరులగుణములను గ్రహించువాఁడును నైనవాఁడు ధీరోదాత్తనాయకుఁడు.)

## మన్త్రిలక్షణమ్.

నిత్యంచ స్థిరభాషిణో గుణపరా శ్శ్రీమద్యశోలమ్పటాః
భావజ్ఞా గుణదోషభేదనిపుణా శ్శృంగారలీలారతాః,
మధ్యస్థానయకోవిదాస్సుహృదయాస్సత్పణ్డితా భాన్తి తే
భూపాభేదవిచక్షణాస్సుకవయో యస్య ప్రభోర్మన్త్రిణః.

తా. మాటనిలుకడగలవారును, సద్గుణములను గ్రహించువారును,

కీర్తికాములును, భావము తెలిసికొనువారును, గుణదోషములను పరిశీలించుట యందు సమర్థులును, శృంగారలీలాసక్తులును, పక్షపాతము లేనివారును, నీతివిశారదులును, మంచిమనస్సుగలవారును, మంచిపండితులును, భేద చతురులును, కవులును అగుమంత్రులు ఏప్రభువుదగ్గర గలరో యాప్రభువు వృద్ధి పొందఁగలవాఁడు.

### రఙ్గలక్షణమ్.

ఏవం విధస్సభానాథః ప్రాఙ్ముఖో నివసేన్ముదా,
వసేయుః పార్శ్వత స్తస్య కవిమన్త్రిసుహృజ్జనాః. 23

తా. ఇట్టి సభానాయకుఁడు సంతోషముతో తూర్పుముఖముగాఁ గూర్చుండఁగా వాని కిరువైపుల,కవి మంత్రి సుహృజ్జనము లుండవలయును.

తదగ్రే నటనం కార్యం తత్థ్సలం రఙ్గముచ్యతే.

తా. ఆరాజునకెదుట నటనము చేయవలయును. ఆస్థలము రంగ మనఁబడును.

రంగమధ్యే స్థితే పాత్రే తత్సమీపే నటోత్తమః,
దక్షిణే తాళధారీ చ పార్శ్వద్వన్ద్వే మృదఙ్గికౌ. 24
తయోర్మధ్యే గీతకార శ్శ్రుతికార స్తదన్తరే,
ఏవం తిష్ఠేత్క్రమేణైవ నాట్యాదౌ రంగమణ్టపే. 25

తా. రంగమంటపమునడుమ పాత్రముండఁగా దాని వెంబడి నటోత్తముఁడును, కుడివైపు తాళగాఁడును, ఇరుప్రక్కలను మద్దెలగాండ్రును,వారి నడుమ పాత్రము ననుసరించి గాయకులును, వారికి వెనుక శ్రుతిపోయు వాఁడును, ఇట్లు వరుసగా నుండవలయును.

### పాత్రలక్షణమ్.

తన్వీ రూపవతీ శ్యామా పీనోన్నతపయోధరా,

ప్రగల్భా సరసా కాన్తా కుశలా గ్రహమోక్షయోః.　　26
చార తాళ లయాభిజ్ఞా మణ్డలస్థానపణ్డితా,
హస్తాంగస్థాననిపుణా కరణేషు విలాసినీ.　　27
విశాలలోచనా గీతవాద్యతాళానువర్తినీ,
పరార్ధ్యభూషాసమ్పన్నా ప్రసన్నముఖపఙ్కజా.　　28
నాఽతిస్థూలానాఽతికృశా నాఽత్యుచ్చానాఽతివామనా,
ఏవంవిధగుణోపేతా నర్తకీ సముదాహృతా.　　29

తా. నటించెడుపాత్రము రూపవతియు, యౌవనమధ్యస్థురాలును, బలిసి నిక్కిన పాలిండ్లుగలదియు, ప్రౌఢయు, రసికురాలును, మనోహారిణియు, పట్టువిడుపులందు సమర్థురాలును, తాళలయగతులను దెలిసినదియు, మండల స్థానన్పత్యమందు పండితురాలును, హస్తవిన్యాసాంగవిన్యాసములయందు నేర్పుగలదియు, కరణములయందు చాకచక్యముగలదియు, విశాలములగు కన్నులుగలదియు, గీతవాద్యతాళముల ననుసరించి నడచునదియు, వెలగల సొమ్ములు ధరించినదియు, ప్రసన్నముఖముగలదియు, మిగుల లావైనదిగాని మిగుల పొడువైనదిగాని మిగుల చిక్కినదిగాని మిగులపొట్టిదిగాని కానిది యునై యుండవలెను.

## అపాత్రలక్షణమ్.

పుష్పాక్షీ కేశహీనా చ స్థూలోష్ఠీ లమ్బకస్తనీ,
అతిస్థూలాఽప్యతికృశాఽప్యత్యుచ్చాఽప్యతివామనా.　　30
కుబ్జా చ స్వరహీనా చ వేశ్యా నాట్యవివర్జితా,

తా. పూలుపడియున్నకన్నులుగలదియు, తలవెండ్రుకలులేనిదియు, బలిసిన పెదవులుగలదియు, వ్రేలఁబడినస్తనములుగలదియు, మిక్కిలి బలిసినదియు, మిక్కిలి చిక్కినదియు, మిక్కిలి పొట్టిదియు, గూనుగలదియు, హీనస్వరముగలదియు నగువేశ్య నాట్యమునకుఁ దగినది కాదు.

### కిఙ్కిణీలక్షణమ్.

కిఙ్కిణ్యః కాంస్యరచితాః తామ్రేణ రజతేన వా. 31
సుస్వరాశ్చ సురూపాశ్చ సూక్ష్మా నక్షత్ర దేవతాః,
బన్ధయే న్నీలసూత్రేణ గ్రంథిభిశ్చ సమన్వితమ్. 32
శతద్వయం శతం వాఽపి పాదయోర్నాట్యకర్మణి,
శతంవా దక్షిణే పాదే ద్విశతం వామపాదకే. 33

తా. గజ్జెలు కంచువిగానైనను, రాగివిగానైనను, వెండివిగానైనను ఉండవలయును. అవి మంచిస్వరముగలవిగాను, అందమయినవిగాను, చిన్నవిగాను ఉండవలెను. నక్షత్రాధిదేవతగల అట్టి గజ్జెలను నల్లదారమునఁ గ్రుచ్చి గజ్జెగజ్జెకు ముడివేయవలయును. నాట్యమాడెడి కాలములయందు పాత్రము కాళ్ళలో ఇన్నూరిన్నూరుగాని నూరునూరుగాని గజ్జెలుండవలయును. లేనిచో కుడికాలియందు నూరును, ఎడమకాలియం దిన్నూరునైన నుండవలయును.

### నటలక్షణమ్.

రూపవాన్ మధురాభాషీ కృతీ వాగ్మీ పటు స్తథా,
కులాంగనాసుతశ్చైవ శాస్త్రజ్ఞో మధురస్వరః. 34
గీతవాద్యాదినృత్యజ్ఞో సిద్ధకః ప్రతిభానవాన్,
ఏతాదృశగుణైర్యుక్తో నట ఇత్యుచ్యతే బుధైః. 35

తా. చక్కనివాఁడును, ఇంపుగమాటలాడువాఁడును, పండితుఁడును, మాటకారియు, సమర్థుఁడును, కులాంగనాసుతుఁడును, భరతశాస్త్రపరిజ్ఞానముగలవాఁడును, మంచిశారీరముగలవాఁడును, గానవాద్యనృత్యాదులలో పూర్ణజ్ఞానముగలవాఁడును, పట్టుగలిగినవాఁడును, కల్పనాశక్తిగలవాఁడు నగువాఁడు నటుఁడని పెద్దలు చెప్పుదురు.

### పాత్రబహిఃప్రాణాః.

మృదంగశ్చ సుతాళౌచ వేణుర్గీతి స్తతశ్శ్రుతిః,
ఏకవీణా కిఙ్కిణీ చ గాయకశ్చ సువిశ్రుతః. 36
ఇత్యేవ మన్వయజ్ఞైశ్చ పాత్రప్రాణా బహిస్స్మృతాః,

తా. మృదంగము, మంచినాదముగల తాళములు, పిల్లనగ్రోవి, పాట, శ్రుతి, వీణ, గజ్జెలు, ప్రఖ్యాతుఁడైన గాయకుఁడు అనునవి నాట్యము చేసెడు పాత్రమునకు బహిఃప్రాణములని చెప్పఁబడును.

### పాత్రాన్తఃప్రాణాః.

జవస్థిరత్వ రేఖా చ భ్రమరీ దృష్టిరశ్రమః. 37
మేధా శ్రద్ధావచోగీతి స్త్వన్తఃప్రాణా దశస్మృతాః,

తా. వడి, నిలుకడ, సమత్వము, చపలత్వము, చూపు, శ్రమము లేమి, బుద్ధి, శ్రద్ధ, మంచిమాటలు, పాట ఈపదియును అంతఃప్రాణము లనఁబడును.

### నీచనాట్యలక్షణమ్.

అకృత్వా ప్రార్థనం పాత్రమాచరేద్యది నాట్యకమ్. 38
తన్నాట్యం నీచ మిత్యాహుర్నాట్యశాస్త్రవిచక్షణాః,

తా. నటించెడిపాత్రము ఇష్టదేవతాప్రార్థనము మొదలగువానిని చేయకయే చేయునాట్యము నీచనాట్యమని నాట్యశాస్త్రజ్ఞులు చెప్పుదురు.

### నీచనాట్యదర్శనఫలమ్.

నీచపాత్రకృతం నాట్యం యది పశ్యంతి మానవాః. 39
పుత్రహీనా భవిష్యంతి జాయంతే పశుయోనిషు,

తా. నాట్యవర్జితపాత్రచే చేయఁబడిన నాట్యమును జూచిన జనులు పుత్రహీనులై పశుయోనియందు జనింతురు.

నాట్యక్రమః.

తస్మాత్సర్వం సమాలోచ్య పూర్వైరాచార్యైరుదాహృతమ్. 40
దేవతాప్రార్థనాదీని కృత్వా నాట్యముపక్రమేత్,

తా. ఆకారణమువలన, పూర్వులచేత నాట్యవిషయమునం దేమేమి చెప్పఁబడియున్నదో, వానినెల్లను చక్కఁగా తెలిసికొని దేవతాప్రార్థనాదులను చేసి నాట్యమునకు ప్రారంభింపవలయును.

కంఠేనాఽఽలమ్బయేద్గీతం హస్తేనాఽర్థం ప్రదర్శయేత్.41
చక్షుర్భ్యాందర్శయేద్భావం పాదాభ్యాంతాళమాచరేత్,

తా. నటించుపాత్రము కంఠముచేత గానమును, హస్తాభినయముచే దానియర్థమును, నేత్రములచే అందలిభావమును, కాళ్లతో తాళమును నడపవలయును.

యతో హస్తస్తతో దృష్టిర్యతో దృష్టిస్తతో మనః. 42
యతో మనస్తతో భావో యతో భావస్తతో రసః,

తా. ఎచ్చటహస్తము వినియోగింపఁబడునో అచ్చట దృష్టియు, ఆదృష్టియున్నచోటనే మనస్సును, మనస్సున్నచోటనే భావమును, ఆభావమున్నచోటనే రసమునుండును.

అభినయలక్షణమ్.

అత్రత్వభినయస్యైవ ప్రాధాన్యమితి కథ్యతే. 43

తా. రసభావాది పరిజ్ఞానవిషయమం దభినయమే ముఖ్యమని చెప్పఁబడుచున్నది.

## అభినయశబ్దవ్యుత్పత్తిః.

అభిపూర్వస్య నీఞ్ ధాతో రాఖ్యానార్థస్య నిర్ణయః,
యస్మాత్పదార్థాన్నయతి తస్మా దభినయస్స్మృతః.        44

తా. అభియను నుపసర్గము పూర్వమునందుఁగల 'నీ'ఞ్ అను ధాతువు నకు చెప్పుట అని యర్థము. పదార్థములను తెలుపునది గాన నిది యభినయ మని పిలువఁబడును.

## గ్రంథాన్తరే.

అభివ్యంజన్విభావానుభావాదీ న్నాటకాశ్రయాన్,
ఉత్పాదయన్ సహృదయే రసజ్ఞానం నిరంతరమ్.        45
అనుకర్తృస్థితో యోఽర్థో ఽభినయస్సోఽభిధీయతే,

తా. నాటకాశ్రయములయిన విభావానుభావాదులను తెలియఁ జేయునట్టిదియుం, రసికుల మనములకు నిరంతరము రసజ్ఞానమును కలుగఁ జేయునట్టిదియుం, అనుకర్తృనిష్ఠమునగు అర్థము అభినయమనఁబడును.

ఆఙ్గికో వాచిక స్తద్వదాహార్య స్సాత్త్వికఃపరః.        46
చతుర్ధాఽభినయ స్తత్ర చాఽఽఙ్గికోఽఙ్గైర్నిదర్శితః,
వాచా విరచితః కావ్యనాటకాదిషు వాచికః.        47
ఆహార్యో హారకేయూరవేషాదిభిరలఙ్కృతిః,
సాత్త్వికస్సాత్త్వికై ర్భావై ర్భావజ్ఞైశ్చ నిదర్శితః.        48

తా. ఈయభినయము ఆంగికము, వాచికము, ఆహార్యము, సాత్త్వికము నని నాలుగువిధములు గలది. అందు అంగముల చేతఁ జూపఁబడునది ఆంగికము. మాటలచేతఁ దెలుపఁబడునది వాచికము, ఇది కావ్యనాటకాదుల

యందుఁ గానఁబడుచున్నది. హారకేయూరాదుల నలంకరించుకొనుట ఆహార్యము. సాత్త్వికాదిభావములచే నెరవేర్పఁబడునది సాత్త్వికము. అని భావజ్ఞులచేతఁ జెప్పఁబడుచున్నది.

### ఆఙ్గికాభినయత్రైవిధ్యమ్.

తత్రాఽఽఙ్గికోఽఙ్గప్రత్యఙ్గోపాఙ్గభేదాత్త్రిధా మతః,

తా. ఆంగికాభినయము, అంగాభినయము, ప్రత్యంగాభినయము, ఉపాంగాభినయము నని మూఁడువిధములుగలది.

### అంగాని.

అంగాన్యత్ర శిరోహస్తౌ కక్షౌ పార్శ్వకటీతటౌ. 49
పాదావితి షడుక్తాని గ్రీవామప్యపరే జగుః,

తా. తల, చేతులు,చంకలు, పార్శ్వములు,నడుము, పాదములు ఈయారును అంగములనఁబడును. కొందరు కంఠమును సయితము అంగమని చెప్పెదరు.

### ప్రత్యంగాని.

ప్రత్యంగానిత్వథస్కంధౌ బాహూపృష్ఠం తథోదరమ్.50
ఊరూ జఙ్ఘే షడిత్యాహు రపరే మణిబన్ధకౌ,
జానునీ కూర్పరమితి త్రయమప్యధికం జగుః. 51

తా. మూఁపులు, భుజములు, వీపు, కడుపు, తొడలు, పిక్కలు ఈయారును ప్రత్యంగములు. కొందరు మణికట్టు, మోఁకాళ్లు, మోఁచేతులును గూడ ప్రత్యంగములని చెప్పెదరు.

### ఉపాంగాని.

దృష్టిభ్రూపుటతారాశ్చ కపోలౌ నాసికా హనుః,
అధరో దశనా జిహ్వా చుబుకం వదనం శిరః. 52

ఉపాంగాని ద్వాదశైతాన్యన్యాన్యంగాని సంతి చ,
పార్ష్ణిగుల్ఫౌ తథాఽఙ్గుళ్యః కరయోః పదయోస్తలే. 53
ఏతాని పూర్వశాస్త్రానుసారేణోక్తాని వై మయా,

తా. చూపు, ఱెప్పలు, నల్లగ్రుడ్డు, చెక్కిళ్ళు, ముక్కు, దవుడలు, అధరము, దంతములు, నాలుక, గడ్డము, మొగము, శిరస్సు ఈ పండ్రెండును ఉపాంగములు. వీని అంగాంతరములుగా గుదికాలు, చీలమండ, కాళ్ల చేతుల వ్రేళ్లు, అరచేతులు, అరకాళ్లు. ఇవి పూర్వశాస్త్రము ననుసరించి నాచేత చెప్పఁబడినవి.

అంగానాం చలనాదేవ ప్రత్యఙ్గోపాఙ్గయోరపి. 54
చలనం ప్రభవేత్తస్మాత్సర్వేషాం నాఽత్రలక్షణమ్,

తా. అంగములు చలించుటవలననే ప్రత్యంగోపాంగములకును చలనము కలుగును. కాఁబట్టి వీని కన్నిఁటికిని వేరువేరుగా లక్షణములు చెప్పలేదు.

నృత్యమాత్రోపయోగ్యాని కథ్యంతే లక్షణైగక్రమాత్.
ప్రథమం తు శిరోభేదః దృష్టిభేదస్తతః పరమ్,
గ్రీవాహస్తౌ తతః పశ్చాత్క్రిమేణైవం ప్రదర్శ్యతే. 56

తా. నృత్యమున కుపయోగించునవి మాత్రము లక్షణయుక్తముగఁ జెప్పఁబడును. మొదట శిరోభేదము, తరువాత దృష్టిభేదము, పిమ్మట గ్రీవాభేదము, అటుపిమ్మట హస్తభేదము నీవిధముగ వివరింపఁబడును.

అథ నవవిధశిరోభేదా లక్ష్యన్తే.

సమముద్వాహితమధోముఖమాలోలితం ధుతమ్,
కమ్పితఞ్చ పరావృత్తముత్క్షిప్తమ్పరివాహితమ్. 57

నవధా కథితం శీర్షం నాట్యశాస్త్రవిచక్షణైః,

**తా.** సమము, ఉద్వాహితము, అధోముఖము, ఆలోళితము, ధుతము, కంపితము, పరావృత్తము, ఉత్క్షిప్తము, పరివాహితము నని శిరోభేదములు తొమ్మిది.

**౧. సమము :—**

నిశ్చలం సమమాఖ్యాతమున్నత్యానతివర్జితమ్. 58

**తా.** క్రిందికి వంపక, మీఁదికెత్తక నిశ్చలముగ నుంపఁబడునది సమశిరస్సు.

**వినియోగము :—**

నృత్తారమ్భే జపాదౌ చ గర్వే ప్రణయకోపయోః,
స్తమ్భనేనిష్క్రియాత్వేచ సమశీర్షముదాహృతమ్. 59

**తా.** నృత్తారంభము, జపాదులు, గర్వము, ప్రీతి, కోపము, స్తంభించియుండుట, క్రియారహితత్వము— వీనియందీశిరస్సు ఉపయోగింపఁబడును.

**౨. ఉద్వాహితము :—**

ఉద్వాహితశిరో జ్ఞేయ మూర్ధ్వభాగోన్నతం శిరః,

**తా.** మీఁదికెత్తి నిలుపఁబడునది యుద్వాహితశిరము.

ధ్వజే చన్ద్రేచ గగనే పర్వతే వ్యోమగామిషు. 60
తుఙ్గవస్తుని సంయోజ్య ముద్వాహితశిరో బుధైః,

**తా.** ధ్వజము, చంద్రుఁడు, ఆకాశము, పర్వతము, ఆకాశమున సంచరించెడువస్తువులు, ఎత్తైనపదార్థము—వీనిని చూచుటయందు ఈశిరస్సు వినియోగింపఁబడును.

3. అధోముఖము:—

అధస్తాన్నమితం వక్త్ర మధోముఖమితీరితమ్. 61

తా. క్రిందికి వంపఁబడిన శిరస్సు అధోముఖ మనఁబడును.

వినియోగము:—

లజ్జాఖేదప్రణామేషు దుశ్చిన్తా మూర్ఛయోస్తథా,
అధస్థితార్థనిర్దేశే యుజ్యతే జలమజ్జనే. 62

తా. సిగ్గు, ఖేదపడుట, మ్రొక్కుట, దురాలోచన చేయుట, మూర్ఛిల్లుట, క్రిందుగా నుండుపదార్థమును చూచుట, నీటమునుఁగుట వీనియందు ఈ శిరస్సు ఉపయోగింపఁబడును.

౪. ఆలోలితము:—

మణ్డలాకారవద్భ్రాన్త మాలోలితశిరో భవేత్,

తా. చక్రాకారముగాఁ ద్రిప్పఁబడునది ఆలోలితశిర మనఁబడును.

వినియోగము:—

నిద్రోద్వేగే గ్రహావేశే మదే మూర్ఛాతురే తథా. 63
భ్రమణేచ వికల్పాదౌ హాస్యేచాఽఽలోలితం శిరః,

తా. తూగాడుట, దయ్యముసోకుట, మదము, మూర్ఛపోయినవాఁడు, గిరగిరతిరుగుట, వికల్పాదులు, నవ్వు వీనియందు ఈ శిరస్సు ఉపయోగింపఁబడును.

౫. ధుతము:—

వామదక్షిణభాగే తు చలితం తద్ధుతం శిరః. 64

తా. ఎడమ కుడిప్రక్కలకు కదలింపఁబడునది ధుతశిర స్సనఁబడును.

వినియోగము:—

నాస్తీతి వచనే భూయః పార్శ్వదేశావలోకనే,
జనాశ్వాసే విస్మయే చ విషాదే ఽనీప్సితే తథా. 65
శీతార్తే జ్వలితే భీతే సద్యఃపీతాసవే తథా,
యుద్ధయత్నే నిషేధే చ అమర్షే స్వాఙ్గవీక్షణే. 66
పార్శ్వాహ్వానే చ తస్యోక్తః ప్రయోగో భరతాగమే,

తా. లేదనుట, మాటిమాటికి ప్రక్కలఁజూచుట, జనుల నూరడించుట, ఆశ్చర్యము, ఖేదము, ఇచ్ఛలేమి, చలి, మండుట, భయపడుట, అప్పుడు త్రాగినకల్లు, యుద్ధప్రయత్నము, త్రోపుడు, కోపము, తన అవయవములను జూచుకొనుట, ప్రక్కల నుండువారలను బిలుచుట వీనియందు ఈ శిరస్సు ఉపయోగింపఁబడును.

౬. కంపితము:—

ఊర్ధ్వాధోభాగచలితం కంపితం తచ్ఛిరో భవేత్. 67

తా. క్రిందుమీఁదుగాఁ గదలింపఁబడునది కంపితశిరస్సనఁబడును.

వినియోగము:—

రోషే తిష్ఠేతి వచనే ప్రశ్నసంజ్ఞోపహూతయోః,
ఆవాహనే తర్జనే చ కమ్పితం తచ్ఛిరో భవేత్. 68

తా. కోపము, ఉండుమనుట, అడుగుట, పిలుచుట, ఆవాహనము, బెదరించుట వీనియందు ఈశిరస్సు వినియోగింపఁబడును.

౭. పరావృత్తము:—

పరాఙ్ముఖీకృతం శీర్షం పరావృత్తమితీరితమ్,

తా. ప్రక్కగాఁ ద్రిప్పిన పరావృత్తశిరస్సగును.

వినియోగము:—

తత్కార్యం కోపలజ్జాది కృతే వక్త్రప్రసారణే. 69
అనాదరే కచే తూష్ణ్యాం పరావృత్తశిరో భవేత్,

తా. కోపము, సిగ్గు మొదలైన వానివలన ముఖమును చాచుట, ఉపేక్షించుట, జడ, అమ్ములపొది వీనియందు ఈశిరస్సు ఉపయోగింపఁబడును.

౭. ఉత్క్షిప్తము:—

పార్శ్వోర్ధ్వభాగచలిత ముత్క్షిప్తం నామ శీర్షకమ్. 70

తా. ప్రక్కన మీఁదికెత్తఁబడునది ఉత్క్షిప్తశిరస్సనఁబడును.

వినియోగము:—

గృహాణ గచ్ఛేత్యాద్యర్థే సూచనే పరిపోషణే,
అఙ్గీకారే ప్రయోక్తవ్య ముత్క్షిప్తం నామ శీర్షకమ్. 71

తా. తీసికొనుము పొమ్ము అనుట మొదలగునవి, జాడచూపుట, పోషించుట, సమ్మతించుట వీనియందు ఉత్క్షిప్తశిరస్సు ఉపయోగింపఁబడును.

౮. పరివాహితము:—

పార్శ్వోర్ధ్వయోశ్చామరవన్నతం చేత్పరివాహితమ్,

తా. వింజామరమువలె ఇరుప్రక్కలకు వంపఁబడునది పరివాహిత శిరస్సనఁబడును.

వినియోగము:—

మోహేచ విరహే స్తోత్రే సన్తోషే చానుమోదనే. 72
విచారే చ ప్రయోక్తవ్యం పరివాహితశీర్షకమ్,

తా. వలపు, ఎడబాటు, పొగడుట, సంతోషము, ఒప్పుకొనుట, విచారము వీనియందు ఈశిరస్సు ఉపయోగింపఁబడును.

### గ్రంథాంతరస్థ శిరోభేదాః.

ధుతం విధుతమాధూత మవధూతం చ కంపితమ్. 73

ఆకంపితోద్వాహితే చ పరివాహిత మంచితమ్,

నిహంచితం పరావృత్త ముత్క్షిప్తాధోముఖేతథా. 74

లోలితం చేతి విజ్ఞేయం చతుర్దశవిధం శిరః,

తిర్యఙ్నతోన్నతం స్కంధానతమారాత్రికం సమమ్. 75

పార్శ్వాభిముఖమిత్యన్య భేదాః పంచ పరే జగుః,

సౌమ్యమాలోకితం చైవ తిరశ్చీనం ప్రకంపితమ్. 76

సౌందర్యం పంచధాప్రోక్తం శిరోభేదా ఇదం క్రమాత్,

భరతాదిభిరాచార్యై శ్చతుర్వింశతిరీరితాః. 77

తా. ధుతము, విధుతము, ఆధూతము, అవధూతము, కంపితము, ఆకంపితము, ఉద్వాహితము, పరివాహితము, అంచితము, నిహంచితము, పరావృత్తము, ఉత్క్షిప్తము, అధోముఖము, లోలితము, తిర్యఙ్నతోన్నతము, స్కంధానతము, ఆరాత్రికము, సమము, పార్శ్వాభిముఖము, సౌమ్యము, ఆలోలితము, తిరశ్చీనము, ప్రకంపితము, సౌందర్యము అని శిరోభేదములు ఇరువదినాలుగువిధములుగా భరతాచార్యులు మొదలైనవారిచేఁ జెప్పఁబడి యున్నవి.

౧. ధుతము:—

పర్యాయేణ శనైస్తిర్యగ్గతముక్తం ధుతం శిరః,

తా. క్రమము చొప్పున మెల్లఁగా అడ్డముగాఁద్రిప్పఁబడునట్టిశిరము ధుతమనఁబడును.

వినియోగము:—

శూన్యస్థానే స్థితేచైవ పార్శ్వదేశావలోకనే. 78

అనాశ్వాసే విస్మయే చ విషాదేఽనీప్సితే తథా,
ప్రతిషేధే చ తస్యోక్తః ప్రయోగో భరతాదిభిః. 79

తా. ఏమిలేనిచోటు, ప్రక్కలుచూచుట, ఊరటలేమి, ఆశ్చర్యము, ఖేదము, ఇచ్ఛలేమి, త్రోపుడు వీనియందు ఈశిరస్సు వినియోగింపఁబడును.

౨. విధుతము:—

ద్రుతగత్యథత స్తస్మా ద్విధుతం తత్ప్రచక్షతే,

తా. ఆ దేశిరస్సు వడితోఁ ద్రిప్పఁబడినయెడ విధుత మనఁబడును.

వినియోగము:—

శీతార్తే జ్వలితే భీతే సద్యః పీతాసవే తథా. 80

తా. చలి, వేండ్రము, పిరికివాఁడు, అప్పుడు కల్లు త్రాగినవాఁడు వీరియందు ఈశిరస్సు వినియోగింపఁబడును.

3. ఆధూతము:—

ఆధూతం తు సకృత్తిర్యగూర్ధ్వనీతశిరోమతమ్,

తా. రవంతఅడ్డముగా నిక్కించిన శిరస్సు ఆధూత మనఁబడును.

వినియోగము:—

సగర్వేషు స్వాంగవీక్షాయాం పార్శ్వస్థోర్ధ్వనిరీక్షణే. 81
శక్తోఽస్మీత్యభిమానే చ ప్రయోగ స్తస్య చోదితః,

తా. సమస్తమునసుట, తనదేహమును జూచుకొనుట, పార్శ్వము లందు నిక్కిచూచుట, సమర్థుఁడనైతినను గర్వము వీనియందు ఈ శిరస్సు వినియోగింపఁబడును.

౪. అవధూతము:—

యదధస్సకృదానీత మవధూతం తదుచ్యతే. 82

తా. శిరము క్రిందుగా వంపఁబడునది యవధూత మనఁబడును.

వినియోగము:—

స్థిత్యర్థే దేశనిర్దేశే ప్రశ్నసంజ్ఞోపహూతయోః,
ఆలాపేచ ప్రయోక్తవ్య మిదమాహు ర్మనీషిణః. 83

తా. ఉండుమనుట, తావుజూపుట, అడిగెడుజాడ, పిలుచుట, సంభాషణము వీనియందు ఈ శిరస్సు వినియోగింపఁబడును.

౫. కంపితము:—

బహుళోర్ధ్వధృతమూర్ధ్వం చ కంపనాత్కంపితం శిరః,

తా. మిక్కిలి పొడువుగనెత్తి చలింపఁజేయఁబడిన శిరస్సు కంపిత మనఁబడును.

వినియోగము:—

జ్ఞానాభ్యుపగమే కోపే వితర్కే తర్జనే తథా. 84
త్వరితే ప్రశ్నవాక్యే చ ప్రయోక్తవ్యమిదం శిరః,

తా. జ్ఞాపకము తెచ్చుకొనుట, కోపము, ఆలోచన, బెదరించుట, త్వరితము, ప్రశ్నముచేయుట వీనియందు ఈశిరస్సు వినియోగింపఁబడును.

౬. అకంపితము:—

అకంపితం తదేవ స్యా త్కంపితం తు శనైర్యది. 85

తా. ఆ శిరస్సే మెల్లమెల్లఁగ చలింపఁజేయఁబడెనేని అకంపిత మనఁబడును.

వినియోగము:—

పురః ప్రస్థితనిర్దేశే ప్రశ్నసంజ్ఞోపదేశయోః,
ఆవాహనే స్వమనసికథనే తత్ప్రయుజ్యతే. 86

తా. ముందుపోవుదాని జూపుట, అడిగెడిజాడ చూపుట, ఉపదేశించుట, ఆవాహనము చేయుట, తనమనస్సునందు చెప్పుకొనుట వీనియందు ఈ శిరస్సు ఉపయోగింపఁబడును.

౭. ఉద్వాహితము:—

సకృదూర్ధ్వం శిరోనీత ముద్వాహితశిరోమతమ్,

తా. కొంచెము మీఁదికెత్తఁబడిన శిరస్సు ఉద్వాహిత మనఁబడును.

వినియోగము:—

శక్తోఽహమస్మి కార్యేష్విత్యభిమానే ప్రయుజ్యతే. 87

తా. అన్నిటికిని నేను చాలుదు ననుగర్వమున నీ శిరస్సు వినియోగింపఁబడును.

౮. పరివాహితము:—

పరం మండలికాకారం భ్రామితం పరివాహితమ్,

తా. చక్రాకారముగ మిక్కిలి త్రిప్పఁబడు శిరస్సు పరివాహిత మనఁబడును.

వినియోగము:—

లజ్జాభావే భ్రమే మానే వల్లభానుకృతౌ తథా. 88
విస్మయేచ స్మితేహర్షే రోమాంచేఽపి ప్రమోదనే,
విచారేచ విచారజ్ఞైః కార్యమాహురిదం శిరః. 89

తా. సిగ్గులేమి, భ్రమము, మానము, ప్రియుని అనుకరించుట, ఆశ్చర్యము, చిరునవ్వు, సంతోషము, పులకాంకురము, సంతోషింపఁజేయుట, విచారము వీనియందు ఈ శిరస్సు వినియోగింపఁబడును.

౯. అంచితము:—

శిరస్స్యాదంచితం కించిత్పార్శ్వయోర్నతకంధరమ్,

తా. ఇరుప్రక్కలకును ఇంచుక వంపఁబడిన మెడగలశిరస్సు అంచిత మనఁబడును.

వినియోగము:—

దుశ్చింతామోహమూర్ఛాదౌ తత్కార్యమధరేక్షణే 90

తా. దురాలోచనము, మోహము, మూర్ఛ మొదలైనవి, క్రింద నుండు వస్తువులను చూచుట వీనియందు ఈ శిరస్సు ఉపయోగింపఁబడును.

౧౦. నిహంచితము:—

ఉత్క్షిప్తబాహుశిఖర లగ్నగ్రీవం నిహంచితమ్,

తా. పొడువుగ నెత్తఁబడిన మూఁపుతో మెడను జేర్చిన శిరస్సు నిహంచిత మనఁబడును.

వినియోగము:—

విలాసే లలితే గర్వే బిబ్బోకే కిలికించితే. 91

మోట్టాయితే కుట్టమితే మానే స్తంభేచ తద్భవేత్,

తా. విలాసము, లలితము, గర్వము, బిబ్బోకము, కిలికించితము, మోట్టాయితము, కుట్టమితము, మానము, స్తంభము అను వీనియందు ఈ శిరస్సు వినియోగింపఁబడును. (ఇందలి విలాసము మొదలగువాని అర్థము భరతరసప్రకరణమునందు వివరింపఁబడియున్నది.)

౧౧. పరావృత్తము:—

పరాఙ్ముఖీకృతం శీర్షం పరావృత్తం శిరోభవేత్. 92

తా. వెడమొగముగలదిగాఁ ద్రిప్పఁబడిన శిరస్సు పరావృత్త మనఁ బడును.

వినియోగము:—

తత్కార్యం కోపలజ్జాది కృతే వక్త్రప్రసారణే,

పరావృత్తానుకరణే పృష్ఠతః ప్రేక్షణే భవేత్. 93

తా. కోపము, లజ్జ మొదలగుదానిచే ముఖమును చాఁచుట, ఒకతట్టు తిరిగినదాని ననుకరించుట, వెనుకతట్టు చూచుట వీనియందు ఈశిరస్సు వినియోగింపఁబడును.

౧౨. ఉత్క్షిప్తము:—

ఊర్ధ్వవక్త్రం శిరోజ్ఞేయ ముత్క్షిప్తం తత్ప్రచక్షతే,

తా. మీఁది కెత్తఁబడిన మొగముగలశిరస్సు ఉత్క్షిప్త మనఁబడును.

వినియోగము.—

దర్శనే తుంగవస్తూనాం చంద్రాదివ్యోమగామినామ్. 94

తా. ఎత్తైనపదార్థములను జూచుట, చంద్రుఁడు మొదలైన ఆకాశసంచారులను జూచుట వీనియందు ఈశిరస్సు వినియోగింపఁబడును.

౧౩. అధోముఖము:—

అధోముఖం శిరోయత్ర తత్ర ప్రాహురధోముఖమ్,

తా. క్రిందుమొగముగా వంచఁబడిన శిరస్సు అధోముఖ మనఁబడును.

లజ్జాఖేదప్రణామేషు స్యాదన్వర్థమధోముఖమ్.

తా. సిగ్గు, దుఃఖము, మ్రొక్కుట వీనియందు ఈశిరస్సు వినియోగించును.

౧౪. లోలితము:—

శిరస్స్యాల్లోలితం గర్వాధిక్యాచ్ఛిథిలలోచనమ్. 95

తా. గర్వాధిక్యముచేత తేలవేయఁబడిన కన్నులుగలశిరస్సు లోలిత మనఁబడును.

వినియోగము:—

నిద్రాగమ గ్రహావేశ మదమూర్ఛాసు తన్మతమ్,

తా. నిదురవచ్చుట, దయ్యముసోఁకుట, మదము, మూర్ఛ వీనియందు ఈశిరస్సు చెల్లును.

౧౫. తిర్యఙ్నతోన్నతము:—

తిర్యఙ్నతోన్నతిం ప్రాప్తం శిర స్తిర్యఙ్నతోన్నతమ్. 96

తా. అడ్డముగవంచి యెత్తఁబడినశిరస్సు తిర్యఙ్నతోన్నత మనఁబడును.

వినియోగము:—

బిబ్బోకాదిషు కాంతానాం తత్ప్రయోజ్యం ప్రచక్షతే,

తా. స్త్రీలయొక్క బిబ్బోకము మొదలగు విలాసచేష్టలయందు ఈ శిరస్సు వినియోగింపఁబడును.

౧౬. స్కంధానతము:—

స్కంధానతం తదాఖ్యాతం స్కంధేయన్నిహితం శిరః. 97

తా. మూఁపుమీఁదికి వంపఁబడినశిరస్సు స్కంధానతమనఁబడును.

వినియోగము:—

తన్నిద్రామదమూర్ఛాసు చింతాయాం చ ప్రయుజ్యతే,

తా. ఆశిరస్సు నిద్ర, మదము, మూర్ఛ, చింత వీనియందు ఉపయోగింపఁబడును.

౧౭. ఆరాత్రికము:—

స్కంధే తు కించిదాశ్లిష్య భ్రాంతమారాత్రికం మతమ్ 98

తా. మూఁపులయందు కొంచెము తాఁకించి త్రిప్పఁబడుశిరస్సు ఆరాత్రిక మనఁబడును.

వినియోగము:—

విస్మయే దృశ్యతే తచ్చ పరాభిప్రాయవేదనే,

తా. ఆశ్చర్యము, ఇతలరులయభిప్రాయము తెలియుగుట వీనియందు ఈశిరస్సునకు వినియోగము.

౧౮. సమశిరము:—

స్వాభావికం సమం శీర్షం స్వభావాభినయాదిషు. 99

తా. ఉన్నదియున్నట్టుండు శిరస్సు సమము. ఇది స్వభావాభినయము మొదలైనవానియందు వినియోగించును.

౧౯. పార్శ్వాభిముఖము:—

పార్శ్వాభిముఖమన్వర్థం పార్శ్వస్థస్యాఽవలోకనే,

తా. ఒకప్రక్కకుఁ ద్రిప్పఁబడుశిరస్సు పార్శ్వాభిముఖ మనఁబడును. అది ప్రక్కనుండువారిని జూచుటయందు ఉపయోగించును.

౨౦. సౌమ్యము:—

నిశ్చలం సౌమ్యమాఖ్యాతం నృత్తారంభే ప్రయుజ్యతే.100

తా. చలనములేకఉండు శిరస్సు సౌమ్య మనఁబడును. అది నాట్యారంభమం దుపయోగింపఁబడును.

౨౧. ఆలోలితము:—

సమంతాల్లోలితం యత్తదాలోలిత మితీరితమ్,

తా. అంతటను ద్రిప్పఁబడు శిరస్సు ఆలోలిత మనఁబడును.

వినియోగము:—

పుష్పాంజలిక్రమే చారినటనే లవణే తథా. 101

ఆలోలితస్య శిరసో వినియోగోఽభిధీయతే,

తా. పుష్పాంజలిక్రమము, చారినాట్యము, లావణ్యము వీనియందు ఈశిరస్సు వినియోగింపఁబడును.

౨౨. తిరశ్చీనము:—

పార్శ్వద్వయాదూర్ధ్వభాగే చలనా త్తిర్యగీరితమ్. 102

తా. ఇరుప్రక్కలందును మీఁదితట్టు చలించుశిరస్సు తిరశ్చీన మనఁబడును.

వినియోగము:—

లజ్జానిరూపణే నృత్తే ముఖచారీయనామని,
త త్తదౌచిత్యకాలేషు తిరశ్చీనముదీరితమ్. 103

తా. సిగ్గునుకనపరచుట, ముఖచారి అనునృత్తము వీనియందును, ఇంక నిట్టి తగినసమయములందును ఈశిరస్సు చెల్లును.

౨౩. ప్రకంపితము:—

పునఃపునః ప్రచలనాత్పురోభాగే చ పార్శ్వయోః,
ప్రకంపితశిరః ప్రోక్తం నాట్యశాస్త్రేషు సమ్మతమ్. 104

తా. ముందరికిని ఇరుప్రక్కలకును మాటిమాటికి చలించు శిరస్సు ప్రకంపిత మనఁబడును.

వినియోగము:—

అద్భుతాఖ్యరసే గీతే ప్రబంధే భ్రమరే తథా,
ప్రత్యర్థియుద్ధభావేఽపి ప్రకంపితశిరో భవేత్. 105

తా. అద్భుతరసము, పాట, ప్రబంధము, తుమ్మెద, శత్రుయుద్ధ భావము వీనియందు ఈ శిరస్సు చెల్లును.

౨౪. సౌందర్యము:—

ఊర్ధ్వాధోముఖవిన్యాసా త్పశ్చాద్భాగేనచాలనాత్,

సౌందర్యాఖ్యశిరః ప్రోక్తం సర్వనాట్యే ప్రశస్యతే. 106

తా. క్రిందుమీఁదులకు త్రిప్పుటవలన వెనుకతట్టు చలించుట గలది సౌందర్య శిరస్సు. అది యెల్ల నాట్యములందు ప్రశంస చేయఁబడుచున్నది.

వినియోగము:—

కారణాభినయే హస్తభ్రమణాఖ్యేచ నర్తనే,
సౌందర్యాఖ్యశిరః ప్రోక్తం యోగాభ్యాసేషు యుజ్యతే.

తా. కారణాభినయము, హస్తభ్రమణము అను నృత్తము, యోగాభ్యాసము వీనియందు ఈ శిరస్సు చెల్లును.

అథాఽష్టదృష్టిభేదా లక్ష్యన్తే.

సమమాలోకితం సాచీ ప్రలోకితనిమీలితే,
ఉల్లోకితానువృత్తే చ తథాచైవాఽవలోకితమ్. 108
ఇత్యష్టదృష్టిభేదాస్తు కీర్తితా భరతాగమే,

తా. సమము, ఆలోకితము, సాచి, ప్రలోకితము, నిమీలితము, ఉల్లోకితము, అనువృత్తము, అవలోకితము, అని దృష్టి యెనిమిదివిధములు గలదిగా భరతశాస్త్రమునందుఁ జెప్పఁబడినది.

౧. సమము:—

వీక్షితం సురనారీభిస్సమానం సమవీక్షణమ్. 109

తా. దేవతాస్త్రీలవలె రెప్పపాటులేక చూచుట సమదృష్టి యనఁబడును.

వినియోగము:—

నాట్యారమ్భే తులాయాఞ్చ అన్యచిన్తావినిశ్చయే,
ఆశ్చర్యే దేవతారూపే సమదృష్టి రుదాహృతా. 110

తా. నాట్యారంభము, త్రాసు, ఇతరచింతను నిశ్చయించుట, ఆశ్చర్యము, దేవతారూపము వీనియందు ఈ దృష్టి యుపయోగింపఁబడును.

౨. ఆలోకితము:—

ఆలోకితం భవేదాశు భ్రమణం స్ఫుటవీక్షణమ్,

తా. వడితోడి తిరుగుడుగల స్పష్టమైనచూపు ఆలోకితమనఁబడును.

వినియోగము:—

కులాలచక్రభ్రమణే సర్వవస్తుప్రదర్శనే. 111

ఇచ్ఛాయాంచ ప్రయోక్తవ్య మాలోకితనిరీక్షణమ్,

తా. కుమ్మరిసారె తిరుగుట, అన్నివస్తువులను జూచుట, ఇచ్ఛ వీనియందు ఈ దృష్టి వినియోగింపఁబడును.

3. సాచి:—

స్వస్థానే తిర్యగాకార మపాఙ్గచలనక్రమాత్. 112

సాచీదృష్టిరితిజ్ఞేయా నాట్యశాస్త్రార్థకోవిదైః,

తా. స్వస్థానమందుండి కడకంటివరకు అడ్డముగా చలించునది సాచీదృష్టి యనఁబడును.

వినియోగము:—

ఇఙ్గితేశ్మశ్రుసంస్పర్శే శరలక్షేఽంశుకే స్మృతా. 113

సూచనాయాంచ కులటా నాట్యే సాచీనిరీక్షణమ్,

తా. అభిప్రాయము, మీసము దువ్వుట, గురి, వస్త్రము, తలఁపు, సయిగ, కులటానాట్యము వీనియందు ఈ దృష్టి వినియోగింపఁబడును.

౪. ప్రలోకితము:—

ప్రలోకితం పరిజ్ఞేయం చలనా త్పార్శ్వభాగయోః. 114

తా. ఇరుప్రక్కలయందును చలించునట్టి దృష్టి ప్రలోకితమనఁబడును.

వినియోగము:—

ఉభయోః పార్శ్వయోర్వస్తుదర్శనే సూచనే తథా,
చలనే బుద్ధిజాడ్యే చ ప్రలోకితనిరీక్షణమ్. 115

తా. ఇరుప్రక్కల నుండువస్తువులను జూచుట, సయిగచేయుట, కదలుట, కలవరము వీనియందు ఈ దృష్టి యుపయోగింపఁబడును.

౫. నిమీలితము:—

దృష్టేరర్ధవికాసే నిమీలితా దృష్టిరీరితా,

తా. సగము కన్నుదెరచి చూచెడి చూపు నిమీలిత మనఁబడును.

వినియోగము:—

ఋషివేషే పారవశ్యే జపే ధ్యానే నమస్కృతౌ. 116
ఉన్మాదే సూక్ష్మదృష్టౌ నిమీలితా దృష్టిరీరితా,

తా. ఋషివేషము, పరవశత్వము, జపము, ధ్యానము, నమస్కారము, చిత్తచలనము, సూక్ష్మదృష్టి వీనియందు ఈ దృష్టి ఉపయోగింపఁబడును.

౬. ఉల్లోకితము:—

ఉల్లోకితమితి జ్ఞేయ మూర్ధ్వభాగోన్నతానతమ్. 117

తా. మీఁదికి నిక్కించి వంపఁబడినదృష్టి ఉల్లోకిత మనఁబడును.

వినియోగము:—

ధ్వజాగ్రే గోపురే దేవమణ్డపే పూర్వజన్మని,
ఔన్నత్యే చన్ద్రికాదౌ చ ఉల్లోకితనిరీక్షణమ్. 118

తా. ధ్వజముకొన, గోపురము, దేవమండపము, పూర్వజన్మము, పొడుగు వెన్నెల మొదలగువానియందు ఈ దృష్టి వినియోగింపఁబడును.

౭. అనువృత్తము:—

ఊర్ధ్వాధో వీక్షణం వేగా దనువృత్తనిరీక్షణమ్,

తా. వడిగ క్రిందుమీఁదుగాఁ జూచునట్టిచూపు అనువృత్త మనఁబడును.

వినియోగము:—

కోపదృష్టౌ ప్రియామన్త్రే ఽప్యనువృత్తనిరీక్షణమ్. 119

తా. కోపముతోఁ జూచుట, ప్రీతితోఁ బిలుచుట వీనియందు ఈ దృష్టి వినియోగించును.

౮. అవలోకితము:—

అధస్తాద్దర్శనం యత్త దవలోకితముచ్యతే,

తా. క్రిందుచూచెడిచూపు అవలోకిత మనఁబడును.

వినియోగము:—

ఛాయాలోకే విచారేచ శయ్యాయాం పఠనక్రమే. 120
స్వాఙ్గావలోకనే యానే ఽప్యవలోకితముచ్యతే,

తా. నీడనుచూచుట, విచారము, శయనము, చదువుట, తన యవయవములను జూచుకొనుట, నడక వీనియందు ఈ దృష్టి వినియోగింపఁబడును.

## గ్రన్థాన్తరస్థదృష్టిభేదాః.

సమా ప్రలోకితా స్నిగ్ధా శృంగారో ల్లోకితాఽద్భుతా.121
కరుణా విస్మయాదృప్తా విషణ్ణా చ భయానకా,
సాచీద్రుతా వీరరౌద్రే దూరేంగితవిలోకితాః. 122

వితర్కితా శంకితా చ అభితప్తావలోకితా,
శూన్యాహృష్టోగ్రవిభ్రాన్తాః శాన్తామీలితసూచనే. 123
లజ్జితామలినాత్రస్తామ్లానా ముకుళకుఞ్చితే,
ఆకాశాచార్ధముకుళా అనువృత్తాచ విప్లుతా. 124
జిహ్మావికోశామదిరా హృద్యాలలితసంజ్ఞికా,
చతుశ్చత్వారింశదితి దృష్టిభేదాః ప్రకీర్తితాః. 125

తా. సమ, ప్రలోకిత, శృంగార, స్నిగ్ధ, ఉల్లోకిత, అద్భుత, కరుణ, విస్మయ, దృప్త, విషణ్ణ, భయానక, సాచి, ద్రుత, వీర, రౌద్ర, దూర, ఇంగిత, విలోకిత, వితర్కిత, శంకిత, అభితప్త, అవలోకిత, శూన్య, హృష్ట, ఉగ్ర, విభ్రాంత, శాంత, మీలిత, సూచన, లజ్జిత, మలిన, త్రస్త, మ్లాన, ముకుళ, కుంచిత, ఆకాశ, అర్ధముకుళ, అనువృత్త, విప్లుత, జిహ్మ, వికోశ, మదిర, హృద్య, లలిత అని దృష్టిభేదములు నలుఁవదినాలుగును.

౧. అందు సమము:—

వీక్షితం సురనారీణామివదృష్టిస్సమాభవేత్,

తా. దేవతాస్త్రీవలె రెప్పపాటులేనిది సమదృష్టి యనఁబడును.

వినియోగము:—

సమాధిషు ప్రయోక్తవ్యమితినాట్య విదోవిదుః. 126

తా. సమాధులయందు ఈదృష్టి వినియోగింపఁబడునని నాట్యశాస్త్రజ్ఞులు చెప్పుదురు.

౨. ప్రలోకితము:—

ప్రలోకితా పరిజ్ఞేయా దర్శనంపార్శ్వభాగయోః,

తా. ఇరుప్రక్కలను జూచెడిచూపు ప్రలోకిత యనఁబడును.

వినియోగము:—

ఉభయోః పార్శ్వయోరస్తు దర్శనాదిషు యుజ్యతే. 127

తా. ఇరుప్రక్కలయందు వస్తువులు జూచుట మొదలైనవానియందు ఈదృష్టి వినియోగించును.

3. స్నిగ్ధ:—

సహర్షాసాభిలాషాచ మనోజ్ఞాఽన్తః ప్రకాశినీ,
స్మరోద్రేకాభవేత్స్నిగ్ధా స్నిగ్ధాదిషు నియుజ్యతే. 128

తా. సంతోషముతోడను, అభిలాషముతోడను గూడునదియు, మనోజ్ఞతగలదియు, అంతర్వికాసముగలదియు, మన్మథోద్రేకముగలదియు నైన దృష్టిస్నిగ్ధయనఁబడును. ఇది స్నేహముగల వస్తువు మొదలైనవానియందు వినియోగించును.

౪. శృంగారము:—

హర్షోత్పన్నప్రమోదోత్థా కామం కామవశంవదా,
శృంగారదృష్టిః కాన్తానాం భ్రూక్షేపాపాఙ్గసమ్భవా. 129
భవేన్మనోభవావిష్ట కామినీ వీక్షణాదిషు,

తా. సంతోషమువలనఁ బుట్టిన సుఖవిశేషమునందుఁ గలిగినదియు, మిక్కిలి మన్మథాధీనమయినదియు, మనోజ్ఞురాండ్ర కనుబొమ్మలు నిక్కించుటవలనను, కడగంటిచూపువలనను గలిగినదియునైన చూపు శృంగారదృష్టి యనఁబడును. ఈదృష్టి మన్మథావేశముగల స్త్రీలవీక్షణము మొదలగువానియందు చెల్లును.

౫. ఉల్లోకితము:—

ఉల్లోకితా పరిజ్ఞేయా ఊర్ధ్వభాగావలోకనమ్. 130

తా. మీఁదిభాగము జూచునట్టిది ఉల్లోకితదృష్టి యనఁబడును.

వినియోగము:—

దర్శనే తుంగవస్తూనాం పూర్వజన్మనియుజ్యతే,

తా. ఎత్తైనపదార్థములను జూచుటయందును, పూర్వజన్మమును తలఁచుటయందును ఈదృష్టిచెల్లును.

౬. అద్భుతము:—

కిఞ్చిత్కుంచితపక్ష్మాన్తా విస్మయోత్క్షిప్తభ్రూలతా. 131
సవికాససమాదృష్టిరద్భుతేతి ప్రకీర్త్యతే,

తా. కొంచెమువంచఁబడిన రెప్పకొనలును, ఆశ్చర్యముచేత నెత్తఁబడిన కనుబొమ్మలునుగలిగి వికాసముతోఁగూడియున్న సమదృష్టి అద్భుతదృష్టి యనఁబడును.

వినియోగము:—

ఏషాతు భావశాస్త్రజ్ఞైరద్భుతాదిషు కీర్తితా. 132

తా. ఈదృష్టి ఆశ్చర్యము మొదలైనవానియందు వినియోగించును.

౭. కరుణ:—

విస్రస్తార్ధ వికాసాస్యాదశ్రుమన్థరతారకా,
నాసావలోకినీ దృష్టిః కరుణా కరుణే రసే. 133

తా. దిగువకు వ్యాపించినదియు, సగము తెరవఁబడినదియు, కన్నీళ్లచే మెల్లగాతిరుగుచున్న నల్లగ్రుడ్లుగలదియు, ముక్కుకొనయందు నిలువఁబడినదియు నైనచూపు కరుణాదృష్టియనఁబడును. ఈదృష్టి కరుణారసమునందు వినియోగపడును.

౮. విస్మయము:—

ఉద్ధతా రచనాఽఽత్యర్థం సమా వికసితా తథా,
విస్పష్టపుటయుగ్మాచ విస్మయా విస్మయాదిషు. 134

తా. మిక్కిలి నిక్కునుచూపునదియు, సమమయినదియు, వికాసము గలదియు, చక్కగా తెరవఁబడిన రెప్పలుగలదియునైనచూపు విస్మయదృష్టి యనఁబడును. ఈదృష్టి ఆశ్చర్యము మొదలైనవానియందు చెల్లును.

౯. దృప్తము:—

స్థిరావికాససహితా నిశ్చలీకృతతారకా,
స్వసన్నివేశినీదృప్తా దృష్టిరుత్సాహగోచరా. 135

తా. నిలుకడగలదియు, వికాసముతోఁగూడినదియు, చలింపనినల్లగ్రుడ్లుగలదియు, స్వస్థానగతమయినదియు నైన దృష్టిదృప్త యనఁబడును. ఇది ఉత్సాహమందు చెల్లును.

౧౦. విషణ్ణము:—

విస్తారితపుటద్వన్ద్వా విస్రస్తాన్త నిమేషణా,
స్తబ్ధతారామనాగ్దృష్టిర్విషణ్ణేతి నిగద్యతే. 136

తా. విరిసినరెప్పలును, తొలఁగిన రెప్పపాట్లును, చలింపని నల్లగ్రుడ్లునుగలది విషణ్ణదృష్టి యనఁబడును.

వినియోగము:—

విషాదే చైవ చింతాయాం దృష్టిరేషా ప్రకీర్తితా,

తా. ఖేదమునందును, చింతయందును ఈదృష్టి వినియోగించును.

౧౧. భయానకము:—

స్తబ్ధోద్వృత్తపుటాఽత్యర్థం చఞ్చలాఫుల్లతారకా. 137
భయానకా భవేద్దృష్టిః భృశంభీతే భయానకే,

తా. చలింపనిమీఁదికి ఎత్తఁబడినరెప్పలతో, మిక్కిలి చలించుచు, వికాసము నొందియున్న నల్లగ్రుడ్లుగలచూపు భయానక దృష్టియనఁబడును.

ఇది మిక్కిలి భయపడుటయందును, భయానకరసమునందును వినియోగ పడును.

౧౨. సాచి:—

సాచీదృష్టిరితిజ్ఞేయా అపాఙ్గచలనక్రమాత్. 138
ఇఙ్గితాదిష్వియం ప్రోక్తా భరతాగమవేదిభిః,

తా. కడకంటి చలించునది సాచీదృష్టి యనఁబడును. ఈదృష్టి ఇంగితము మొదలైనవానియందు వినియోగించును.

౧౩. ద్రుతము:—

తారాద్వయస్య చలనాద్ద్రుతదృష్టిరుదాహృతా. 139

తా. రెండు నల్లగ్రుడ్లయొక్క చలనముగలది ద్రుతదృష్టి యనఁబడును.

వినియోగము:—

ఏతస్యా వినియోగస్తు సమ్భ్రమాదిషు కీర్తితా,

తా. ఈదృష్టి సంభ్రమము మొదలైనవానియందు వినియోగింపఁబడును.

౧౪. వీరము:—

దీప్తా వికసితాఫుల్లా మధ్యా గామ్భీర్యశాలినీ. 140
వీరా వీరరసే యోజ్యా అక్షుబ్ధా సమతారకా,

తా. వెలుఁగునదియు, తేటయయినదియు, విరిసినదియు, ఉగ్రమును శాంతమును గాక మధ్యస్థమైయుండునదియు, లోపలనణఁగిన యభిప్రాయముగలదియు, కలకలేనిదియు, సమములయిన నల్లగ్రుడ్లుగలదియు నైన చూపు వీరదృష్టియనఁబడును. ఈదృష్టి వీరరసమునందు ఉపయోగించును.

౧౫. రౌద్రము:—

అస్నిగ్ధా లోహితా క్రూరా నిస్తబ్ధపుటతారకా. 141
భ్రుకుటీకుటిలోద్వృత్తా రౌద్రా రౌద్రే దృగుచ్యతే,

తా. ప్రీతిలేనిదియు, ఎఱ్ఱనయినదియు, క్రూరమయినదియు, చలించని రెప్పలు నల్లగ్రుడ్డుగలిగినదియు, వంకరైన కనుబొమలుగలిగినదియు, మీఁదికి తెరవఁబడినదియు నైనచూపు రౌద్రదృష్టి యనఁబడును. ఈదృష్టి రౌద్రరసమునందు వినియోగించును.

౧౬. దూరము:—

కిఞ్చిదూర్ధ్వ వికాసేన దూరదృష్టిరుదాహృతా, 142

తా. కొంచెము మీఁదికెత్తఁబడినచూపు దూరదృష్టి యనఁబడును.

వినియోగము:—

దూరావలోకనే ప్రోక్తా భావశాస్త్రవిచక్షణైః,

తా. దూరముననుండు వస్తువులను జూచుటయందు ఈదృష్టి వినియోగపడును.

౧౭. ఇంగితము:—

సహర్షేఙ్గితదృష్టిస్స్యాత్కటాక్ష చలనక్రమాత్. 143
ఇంగితాదిష్వియంభావ నేతృభిస్సముదాహృతా,

తా. కటాక్షచలనముగలిగి సంతోషముతోఁగూడినచూపు ఇంగితదృష్టి అనఁబడును. ఇది ఇంగితము మొదలైనవానియందు వినియోగింపఁబడును.

౧౮. విలోకితము:—

వీక్షణం పృష్ఠభాగేయ త్తద్విలోకిత ముచ్యతే. 144
ఇయందృష్టి ర్భవేత్పశ్చా ద్దేశవృత్త్యవలోకనే,

తా. వెనుకతట్టు చూచునట్టిచూపు విలోకితదృష్టి యనఁబడును. ఇది వెనుకతట్టు ఉండువానిని జూచుటయందు వినియోగపడును.

౧౯. వితర్కిత:—

వికాసితోద్వృత్తపుటా తద్వదుత్ఫుల్లతారకా. 145
త్రాసితాసమతారాచ దృష్టిర్జ్ఞేయా వితర్కితా,

తా. తేటయై మీఁదికి తెరవఁబడిన రెప్పలు గలదియుఁ, విరిసి భయముతోఁ గూడినవివలె సమములైన నల్లగ్రుడ్లుగలదియు నైనచూపు వితర్కితదృష్టి యనఁబడును.

వినియోగము:—

ఏషాతుభావశాస్త్రజ్ఞై రూహాదిషునియుజ్యతే. 146

తా. ఈదృష్టి ఊహించుట మొదలైనవానియందు వినియోగించును.

౨౦. శఙ్కితము:—

కిఞ్చిచ్చలాస్థిరాకిఞ్చిదున్నతా తిర్యగాయతా,
గూఢాచకితతారా చ శఙ్కితా దృష్టిరుచ్యతే. 147

తా. కొంచెము చలనము గలదియుఁ, కొంచెము నిలుకడగలదియుఁ, నిక్కినదియుఁ, అడ్డపువిరివిగలదియుఁ, మరుగైనదియుఁ, బెదరును లోపించెడి నల్లగ్రుడ్లుగలదియు నైనచూపు శంకితదృష్టి యనఁబడును.

వినియోగము:—

శఙ్కాదిషు ప్రయోక్తవ్యా ప్రోక్తానాట్యవిశారదైః,

తా. ఇది శంక మొదలయినవానియందు వినియోగింపఁబడును.

౨౧. అభితప్తము:—

పుటప్రచలనం యత్రతారకే దర్శనాలసే. 148
అభితప్తా భవేద్దృష్టిర్నిర్వేద ప్రముఖేష్వియమ్,

తా. రెప్పలకదలికయు, దర్శనాలసములగు నల్లగ్రుడ్లునుగలచూపు అభితప్తదృష్టి యనఁబడును. ఇదొ విసుగు మొదలగువానియందు వినియోగించును.

౨౨. అవలోకితము:—

అధస్తాద్దర్శనం యత్తదవలోకిత ముచ్యతే. 149

తా. క్రిందుగ చూచెడిచూపు అవలోకితదృష్టి యనఁబడును.

వినియోగము:—

వినియోగో భవేదస్యా విచారపఠనాదిషు,

తా. ఈ దృష్టివిచారము, చదువుటమొదలైన విషయములందు వినియోగించును.

౨౩. శూన్యము:—

సమతారా పుటాబాహ్యే నిష్కమ్పా శూన్యదర్శనా. 150
బాహ్యార్థాగ్రహణే చేయం శూన్యదృష్టిరుదాహృతా,

తా. సమములైన నల్లగ్రుడ్లును రెప్పలునుగలదియు, బయలుపడినదియు, చలనములేనిదియు, శూన్యమునుచూచునదియు నైనచూపు శూన్యదృష్టియనఁబడును. ఇది బాహ్యార్థాగ్రహణమునందు వినియోగించును.

౨౪. హృష్టము:—

చఞ్చలాదృశ్యతే యాతు రుచిరాచ నిమేషభాక్. 151
ఈషత్సఙ్కుచితాదృష్టిర్హృష్టాహాసే ప్రయుజ్యతే,

తా. చలించునదియు, మనోహరమయినదియు, రెప్పపాట్లుగలదియు, కొంచెము సంకోచింపఁబడినదియు నైనచూపు హృష్టదృష్టి యనఁబడును. ఈదృష్టి నవ్వునందు వినియోగపడును.

౨౫. ఉగ్రము:—

సమ్యగ్వికసితా కిఞ్చిదపాఙ్గ ద్వయశోణిమా. 152

ఉగ్రదృష్టి స్సమాఖ్యాతా ఉగ్రాదిషునియుజ్యతే,

తా. లెస్సగావికసించినదియు, ఱెండుకనుగొనలందును ఎరుపుగలదియు నైనచూపు ఉగ్రదృష్టి యనఁబడును. ఇది ఉగ్రము మొదలైనవానియందు చెల్లును.

౨౬. విభ్రాంతము:—

చలత్తారాచ విభ్రాంతా దృష్టిర్విస్రంభదర్శనా. 153
మధ్యేచ వికలోత్ఫుల్లా విభ్రాంతా సంభ్రమాదిషు,

తా. చలించుచున్ననల్లగ్రుడ్లు గలిగినదియు, భ్రమించునదియు, ప్రీతిని గనబరుచునదియు, నడుమనడుమ వెలవెలపాటును తేటదనమును గలిగినదియు నైనచూపు విభ్రాంతదృష్టి యనఁబడును. ఇది సంభ్రమము మొదలైనవానియందు వినియోగపడును.

౨౭. శాంతము:—

క్రమమాణపుటా సన్నాకిఞ్చిచ్చఞ్చలలోచనా. 154
చలత్తారా కృతాపాఙ్గా దృష్టిశ్శాంతా శమాదిషు,

తా. మూఁతపడు ఱెప్పలుగలదియు, కొంచెము చలించునట్టి కన్నులు గలిగినదియు, చలించుచున్న నల్లగ్రుడ్లు గలిగినదియు నైనచూపు శాంతదృష్టి యనఁబడును. ఇది శమము మొదలైనవానియందు చెల్లును.

౨౮. మీలితము:—

దృష్టేరర్ధ వికాసేన మీలితా దృష్టిరీరితా. 155

తా. సగము తెరవఁబడిన కన్నులుగలది మీలితదృష్టియనఁబడును.

వినియోగము:—

పారవశ్యాదిభావేషు ప్రయోక్తవ్యానిమీలితా,

తా. పరవశత్వము మొదలైనభావములయందు ఈదృష్టి యుపయోగింపఁబడును.

౨౯. సూచనః—

హస్తాభియోగచలనాత్కిఞ్చిన్ముకుళితాకృతిః. 156
సూచనాదృష్టిరాఖ్యాతా సూచనాదిషుయుజ్యతే,

తా. చేసైగ ననుసరించి కొంచెము మూయఁబడినకన్నులుగలది సూచనాదృష్టి యనఁబడును. ఇది జాడచూపుట మొదలైనవానియందు చెల్లును.

౩౦. లజ్జితః—

పతితోర్ధ్వ పుటావ్రీడా భరతఃచ్యుతతారకా. 157
కిఞ్చిత్కుఞ్చిత పక్ష్మాగ్రా లజ్జితా లజ్జితాదిషు,

తా. వాలిన మీఁదిరెప్పలును, సిగ్గువలన వాల్పఁబడిన నల్లగ్రుడ్లును, కొంచెము ముడిగినరెప్పల కొనలునుగలది లజ్జితదృష్టి యనఁబడును. ఈదృష్టి సిగ్గుపడుట మొదలైనవానియందు వినియోగించును.

౩౧. మలినము:—

మలినాంతా చలత్పక్ష్మా కిఞ్చిన్ముకుళితాకృతిః. 158
అక్షిభ్యాం కృష్టతారాదృఙ్మలినా దృశ్యతే స్త్రియామ్,

తా. సంకోచించిన కనుగొనలును, చంచలములైన రెప్పలునుగలిగి కొంచెముముడిగి కన్నులచే ఆకర్షింపఁబడిన నల్లగ్రుడ్లుగలది మలినదృష్టి యనఁబడును. ఇది స్త్రీయందు గనుపడును.

౩౨. త్రస్తము:—

అంతర్వికసితా పూర్వం పశ్చాద్విరళతారకా. 159
త్రస్తాత్రాసేమదేదృష్టి స్సమోద్వృత్త పుటద్వయా,

తా. తొలుత వికాసముగలదై పిమ్మట చలించుచున్న నల్లగ్రుడ్లతో

సరిగా మీఁదికెత్తఁబడిన రెప్పలుగలది త్రస్తదృష్టి యనఁబడును. ఇది భయమందును మదమునందును చెల్లును.

33. మ్లానము:—

శిథిలాచార్ధచలనాత్ క్రమాన్నిర్భుగ్న తారకా. 160
పక్ష్మాగ్రభ్రూపుటామ్లానా యోజ్యామ్లానాదికేష్వియమ్,

తా. సడలి, కొంచెపుకదలికతో క్రమముగా సోలుచున్న నల్లగ్రుడ్లు గలిగి రెప్పలకొనలనంటుచున్న కనుబొమ్మలుగలది మ్లానదృష్టి యనఁబడును. ఇది వాడినవస్తువులు మొదలయినవానియందు చెల్లును.

34. ముకుళము:—

స్ఫురదాసక్తపక్ష్మాగ్రా సౌమ్యామిళితతారకా. 161
మీలితోర్ధ్వపుటాదృష్టిరానందే ముకుళాభవేత్,

తా. కదలుచున్నట్టియు, ఆసక్తితోఁగూడినవియు నయిన కొనరెప్పలును, తిన్నదనమును, కలసిననల్లగ్రుడ్లును, మూయఁబడిన పైరెప్పలునుగలది ముకుళదృష్టి యనఁబడును. ఇది యానందమునందు వినియోగించును.

35. కుఞ్చితము:—

కిఞ్చిత్కుఞ్చిత పక్ష్మాగ్రపుటాఽత్యర్థం నికుఞ్చితా.  162
తారాభ్యాం కుఞ్చితాదృష్టి రసూయానిష్టతాదిషు,

తా. కొంచెము వాల్పబడిన కొనరెప్పలును, మిక్కిలి లోఁగొనఁబడిన నల్లగ్రుడ్లునుగలది కుంచితదృష్టి యనఁబడును. ఇది అనిష్టమునందును అసూయత మొదలైనవానియందును వినియోగపడును.

36. ఆకాశము:—

ఆకాశదృష్టిరాకాశే బహువ్యావృతతారకా. 163
ఏషాప్యాఽఽకాశే సఞ్చారివస్త్వాదిషు నియుజ్యతే,

తా. మిక్కిలి విరిసినగ్రుడ్లతో నాకాశమున నిగుడ్పఁబడిన దృష్టి యాకాశదృష్టి. ఆకాశమునందు సంచరించు వస్తువులు మొదలగువానియం దిది చెల్లును.

౩౭. అర్ధముకుళము:—

సస్మితా చ భవేత్తారా కిఞ్చిదున్మిషితాపుటా. 164
స్యాదర్ధముకుళా దృష్టిశ్చాఽఽనందాహ్లాదగోచరా,

తా. చిరునవ్వుతో మీఁదికికూరుకొనఁబడుచున్న రెప్పలుగలది అర్ధముకుళదృష్టి యనఁబడును. ఇది ఆనందాహ్లాదముల గోచరమైయుండును.

౩౮. అనువృత్తము:—

అనువృత్తా యదుక్తం తదూర్ధ్వాధో భూయోనిరీక్షణం. 165

తా. మాటిమాటికి చూచుట అనువృత్తదృష్టి యనఁబడును.

వినియోగము:—

త్వరాదిషు ప్రయోక్తవ్యా కలితాభావకోవిదైః,

తా. ఇది తత్తరపాటు మొదలగువానియందు వినియోగింపఁబడును.

౩౯. విప్లుతము:—

స్ఫురితోత్ఫుల్లపతితపుటాదృగ్విప్లుతా భవేత్. 166

తా. కదలింపఁబడి, విరిసి, వాల్పఁజడిన రెప్పలుగలది విప్లుతదృష్టి యనఁబడును.

వినియోగము:—

ఏషాతు సర్వవస్తూనాం సౌందర్యాద్యవలోకనే,

తా. ఈదృష్టి అన్నివస్తువులయొక్క సౌందర్యాదులను జూచుట యందు చెల్లును.

౪౦. జిహ్మము:—

ఆకుఞ్చితపుటా గూఢతిర్యగ్జ్యంధరలోకినీ. 167
జిహ్మాదృగ్గూఢతారాస్యాత్ గూఢార్థాదిషు యుజ్యతే,

తా. అంతటను వాల్పఁబడినరెప్పలు నిగూఢములయిన గ్రుడ్లుగలిగి, పయికి తెలియక అడ్డముగాను మెల్లగాను చూచుట జిహ్మదృష్టియనఁబడును. ఇది గూఢార్థములయందును అసూయ మొదలైనవానియందును చెల్లును.

౪౧. వికోశము:—

అనిమేషాచలత్తారా వ్యాకోచితపుటద్వయా. 168
వికోశాఖ్యా భవేద్దృష్టిః హర్షాదిషు నియుజ్యతే,

తా. రెప్పపాటులేనిదియు, చలించుచున్న నల్లగ్రుడ్లుగలదియు,సంకుచితములైన రెప్పలుగలదియు నైనచూపు వికోశదృష్టి యనఁబడును. ఇది సంతోషము మొదలైనవానియందు చెల్లును.

౪౨. మదిర:—

అఞ్చితామార్గితామిధ్యా క్షుబ్ధాక్షీ కుంచితాచలా. 169
మునినా కీర్తితాదృష్టిః మదిరాతరుణే మదే,

తా. ఒప్పిదమును దిక్కులుజూచుటయుం కలతపాటునుగలదియు, మధ్యస్థమయి క్రిందికి వాల్పఁబడినదియు, బెదరుగలదియు నైనచూపు మదిరాదృష్టి యనఁబడును. ఇది తరుణమదమునందు చెల్లును.

౪౩. హృద్య:—

అవ్యవస్థితసమ్యాభ్రింతామనాగ్లులితతారకా. 170
ఆకుంచితపుటా హృద్యా మధ్యమాదిషు యుజ్యతే,

తా. నిలుకడలేనిదై తడబాటుగలిగి కొంచెము చలింపఁజేయఁబడిన

నల్లగ్రుడ్లును వంచఁబడిన రెప్పలునుగలచూపు హృద్యదృష్టియనఁబడును. ఇది మధ్యమములైన వస్తువులయందు చెల్లును.

౪౪. లలితము:—

భ్రూక్షేపకుంచితాపాఙ్గా స్మితేనాఽనంగసంభవా. 171
వికాసేనాఽన్వితాదృష్టిః లలితాలలితాదిషు,

తా. కనుబొమ్మలకదలికచే ముడుఁగఁజేయఁబడిన కడకన్నులు, మన్మథ వికారమువలని చిరునవ్వును, తేటదనమునుగలది లలితదృష్టి యనఁబడును. ఇది ఆనందకరములైన వస్తువులయందు చెల్లును.

అథ గ్రంథాన్తరస్థభ్రూభేదానిరూప్యంతే.

సహజా పతితోత్క్షిప్తా చతురా రేచితా తథా. 172
కుంచితేతి షడేవాఽత్ర భ్రూచాతుర్యవతిక్రియాః,

తా. సహజ, పతిత, ఉత్క్షిప్త, చతుర, రేచిత, కుంచిత అని భ్రూ భేదములు (కనుబొమలచతురత్వము గలక్రియలు) ఆరువిధములుగాఁ జెప్పఁబడుచున్నవి.

౧. సహజము:—

సహజాస్యాత్స్వభావభ్రూః వికారరహితా ముఖే. 173
సహజాదిషు యుజ్యేత ఇతి భావవిదో విదుః,

తా. ముఖమందేవికారమును లేక స్వాభావికముగనుండెడి కనుబొమ్మ సహజభ్రువనఁబడును. ఇది స్వభావము మొదలైనవానియందు చెల్లును.

౨. పతితము:—

అచంచలభ్రూయుగంచ పతనాత్పతితామతా. 174

తా. చలింపని కనుబొమ్మలను వాల్చిన పతితభ్రువగును.

వినియోగము:—

జుగుప్సాయాం విస్మయేచ అసూయాయాం భవేదసౌ,

తా. ఇది రోతపడుటయందును, ఆశ్చర్యమందును, ఓర్వనితనమందును చెల్లును.

3. ఉత్క్షిప్తము:—

ఏకావాసా ద్వితీయావా యదుత్క్షిప్తవతీతరామ్. 175
ఉత్క్షిప్తాసాభవేత్ స్త్రీణాం కోపే సత్యవచస్యపి,
శృఙ్గారభావే లీలాయాం భ్రూరేషా వినియుజ్యతే. 176

తా. కనుబొమ్మలు రెంటియందును ఒక్కటిగాని రెండుగాని మిక్కిలి నిక్కింపఁబడునేని అది ఉత్క్షిప్తభ్రువనఁబడును. ఇది స్త్రీలకోపమునందును, సత్యవచనమునందును, శృంగారభావమందును, లీలయందును వినియోగింపఁబడును.

౪. చతుర:—

ద్వితీయసహితా స్తోకా స్ఫురితామదమంథరా,
చతురా ముఖసంస్పర్శే హ్లాదానందేచ సమ్భ్రమే. 177

తా. రెండుకనుబొమ్మలకూడికతో కొంచెము మెల్లగా చలింపఁజేయఁబడియెనేని చతురభ్రువగును. ఇది ముఖముతాఁకుట, మనస్సంతోషము, వేగిరపాటు వీనియందు ఉపయోగింపఁబడును.

౫. రేచితము:—

లావణ్యమధురాక్షిప్తా యద్యేకా రేచితామతా,

తా. అందముగాను ఇంపుగాను ఒక కనుబొమ్మ వంపఁబడునేని అది రేచితభ్రువనఁబడును.

వినియోగము:—

రహస్యశ్రవణే సాధు కలనే పదవీక్షణే. 178

తా. ఇది రహస్యమును వినుట, మంచిది అనుట, స్థానవీక్షణము వీని యందు చెల్లును.

౬. కుంచితము:—

ఏకా వా సా ద్వితీయా వా కుంచితాంచిత వామతా,

తా. ఒక కనుబొమ్మయేని రెండు కనుబొమ్మలేని ముడిగింపఁబడిన యెడ అది కుంచితభ్రువనఁబడును.

వినియోగము:—

మోట్టాయితే కుట్టమితే విలాసే కిలికించితే. 179

తా. ఇది మోట్టాయితము, కుట్టమితము, విలాసము, కిలికించితము అను శృంగారచేష్టావిశేషములందు వినియోగింపఁబడును. మోట్టాయితము మొదలగు వానియర్థము భరతరసప్రకరణమందు వివరింపఁబడియున్నది.

అథ చతుర్విధ గ్రీవాభేదానిరూప్యంతే.

సుందరీ చ తిరశ్చీనా తథైవ పరివర్తితా,
ప్రకమ్పితా చ భావజ్ఞైర్జ్ఞేయా గ్రీవా చతుర్విధా. 180

తా. సుందరి, తిరశ్చీన, పరివర్తిత, ప్రకంపిత అని గ్రీవా (మెడ) భేదములు నాలుగువిధములు.

౧. సుందరి:—

తిర్యక్ప్రచలితా గ్రీవా సుందరీతి నిగద్యతే,

తా. అడ్డముగాఁ గదలింపఁబడినది సుందరీగ్రీవ యనఁబడును.

వినియోగము:—

స్నేహారమ్భే తథాయత్నే సమ్యగర్థే ఉపిచ స్మృతా. 181
సరసత్వేనుమోదేచ సా గ్రీవా సుందరీ మతా,

తా. స్నేహారంభము, యత్నము చేయుట, మంచిదనుట, తలఁచుట, సరసము, అనుమోదము వీనియందు ఈగ్రీవ యుపయోగింపఁబడును.

౨. తిరశ్చీనము:—

పార్శ్వద్వయోర్ధ్వభాగే తు చలనాత్సర్పయానవత్. 182
సాగ్రీవాతు తిరశ్చీనేత్యుచ్యతే నాట్యకోవిదైః,

తా. ఇరుప్రక్కల నూర్ధ్వభాగములయందు సర్పగతివలెఁ గదలిక గలది తిరశ్చీనగ్రీవ యనఁబడును.

వినియోగము:—

ఖడ్గభ్రమే సర్పగత్యాం తిరశ్చీనానిగద్యతే. 183

తా. కత్తిని ద్రిప్పుటయందును, పాముసడకయందును ఈగ్రీవ వినియోగించును.

3. పరివర్తితము:—

సవ్యాపసవ్యచలితా గ్రీవా యత్రార్ధచంద్రవత్,
సా తు నాట్యకలాభిజ్ఞైర్విజ్ఞేయా పరివర్తితా. 184

తా. వామదక్షిణములకు అర్ధచంద్రాకారముగా కదలింపఁబడునది పరివర్తితగ్రీవ యనఁబడును.

వినియోగము:—

శృంగారనటనే కాంతా కపోలపరిచుమ్బనే,
నాట్యతంత్రకలాభిజ్ఞైర్విజ్ఞేయా పరివర్తితా. 185

తా. శృంగారనటనమునందును, స్త్రీల చెక్కిళ్లు ముద్దుపెట్టుకొనుట యందును ఈగ్రీవ యుపయోగించును.

౪. ప్రకమ్పితము:—

పురగపశ్చాత్ప్రచలనాత్కపోతీకణ్ఠకమ్పవత్,
ప్రకమ్పితేతి సా గ్రీవా ప్రోక్తానాట్యవిశారదైః. 186

తా. పావురాయి మెడకదలించునట్లు ముందువెనుకలందుఁ గదలింపఁ బడునది ప్రకంపితగ్రీవ యనఁబడును.

వినియోగము:—

యుష్మదస్మదితిప్రోక్తే దేశీనాట్యవిశేషకే,
డోలాయాఙ్గణితేచాఽపిప్రయోక్తవ్యాప్రకమ్పితా. 187

తా. నీవు నేను అనుటయందును, దేశీనాట్యమునందును, ఉయ్యాల యందును, లెక్కపెట్టుటయందును, ఈగ్రీవ యుపయోగింపఁబడును.

అథ ద్వాదశహస్తప్రాణలక్షణం నిరూప్యతే.

హస్తానాం ద్వాదశ ప్రాణాస్తేషాం లక్షణముచ్యతే,

తా. హస్తప్రాణములు పండ్రెండు, వానిలక్షణము చెప్పఁబడు చున్నది.

ప్రసారణం కుంచితఞ్చ రేచితం పుఙ్ఖితం తథా. 188
అపవేష్టితకంచాఽపి ప్రేరితోద్వేష్టితే తథా,
వ్యావృత్తగ పరివృత్తశ్చ సజ్కేతస్తదనంతరమ్. 189
చిహ్నం పదార్థ టీకేతి ప్రాణా ద్వాదశహస్తజాః,

తా. ప్రసారణము, కుంచితము, రేచితము, పుంఖితము, అపవేష్టిత

శము, ప్రేరితము, ఉద్వేష్టితము, వ్యావృత్తము, పరివృత్తము, సంకేతము, చిహ్నము, పదార్థటీక అని హస్తజప్రాణములు పండ్రెండు.

౧. ప్రసారణము:—

ప్రసారణమితిజ్ఞేయమఙ్గులీనాం ప్రసారణాత్ 190

తా. వ్రేళ్లనుజాచుట ప్రసారణ మనఁబడును.

౨. కుంచితము:—

కుఞ్చనాదంగులీనాంచ కుంచితం సముదీరితమ్,

తా. వ్రేళ్లనుముడుచుట కుంచిత మనఁబడును.

౩. రేచితము:—

అంగులీనాం ప్రచలనా ద్రేచితం పరికీర్తితమ్. 191

తా. వ్రేళ్లనుగదలించుట రేచితమనఁబడును.

౪. పుఙ్ఖితము:—

పురోభాగే కుంచితోవా రేచితో వా ప్రసారితః,

యోహస్తస్తుపతాకాదిర్నామ్నాఽసౌపుఙ్ఖితోభవేత్.

తా. పతాకాదిహస్తములందు వ్రేళ్లు ముందరికివంచుట, కదలించుట, చాచుట అను నిట్టిది పుంఖిత మనఁబడును.

౫. అపవేష్టితము:—

అధస్తాద్గమనంయస్య హస్తోనామ్నాఽపవేష్టితః,

తా. వ్రేళ్లను క్రిందుగా చాచుట యనెడి హస్తప్రాణము అప వేష్టిత మనఁబడును.

౬. ప్రేరితము:—

పశ్చాద్భాగేకుఞ్చితోవా రేచితోవా ప్రసారితః. 193

యోహస్తగకథితసోఽయంప్రేరితగ పూర్వసూరిభిః,

తా. వ్రేళ్లను వెనుకప్రక్కకు ముడిగించుట, కదలించుట, చాఁచుట యను హస్తప్రాణము ప్రేరిత మనఁబడును.

౭. ఉద్వేష్టితము:—

హస్తానామూర్ధ్వభాగేయద్గమనంచాఽ స్తినర్తనే. 194
తదుద్వేష్టితమిత్యాహు ర్భరతాగమవేదినః,

తా. నాట్యకర్మమునందు చేతులను మీఁదికెత్తుట యనెడి హస్త ప్రాణము ఉద్వేష్టిత మనఁబడును.

౮. వ్యావృత్తము:—

ఉదగ్రతఃపార్శ్వభాగే హస్తోవ్యావృత్తకోభవేత్. 195

తా. పార్శ్వభాగములందు మీఁదికెత్తఁబడిన చేతులుగల హస్త ప్రాణము వ్యావృత్త మనఁబడును.

౯. పరివృత్తము:—

పార్శ్వాభ్యాంచ పురోభాగే యోహస్తో నటనే కృతః,
పరివృత్తస్సమాఖ్యాతో నామ్నా హస్తవిశారదైః. 196

తా. నాట్యముచేయునపుడు పార్శ్వములనుండి ముందరితట్టునకు చేతులను తెచ్చుట అనుహస్తప్రాణము పరివృత్త మనఁబడును.

౧౦. సఙ్కేతము:—

ఊహావిధానరచనావినాస్థూలోక్తిపూర్వకమ్,
యోహస్తోనియమంప్రాప్తస్ససఙ్కేత ఉదాహృతః. 197

తా. స్థూలోక్తి పరంపరలేక ఊహచేత తెలిసికోఁదగిన సైగగల హస్తప్రాణము సంకేత మనఁబడును.

౧౧. చిహ్నము:—

ప్రత్యక్షాణాం పరోక్షాణాం వస్తూనాంనాట్యకర్మణి,
స్థావరత్వం జఙ్గమత్వమీయుషామపితాదృశమ్. 198
తదాకారప్రకటనం తన్ముఖస్య నిరీక్షణమ్,
తత్థ్సానదర్శనంచాఽపి తద్ధ్వజానాం చ దర్శనమ్. 199
తదాయుధప్రకటనం తద్గతార్థనివేదనమ్,
తద్వ్యాప్తదర్శనంచాఽపి తచ్చేష్టా దర్శనం తథా. 200
అష్టలక్షణమిత్యేతచ్చిహ్నమిత్యభిధీయతే,

తా. నాట్యకర్మమునందు ప్రత్యక్షపరోక్షవస్తువులయొక్క స్థావర జంగమత్వములను దెలుపు చిహ్నములు ఎనిమిది. అవి వానియాకారములను జూపుట, వానిముఖములను జూపుట, అవియుండుతావులను జూపుట, వానిటెక్కెములను చూపుట, వాని యాయుధములను దెలుపుట, వాని యందుఁగల ప్రయోజనములను దెలుపుట, వానిచే వ్యాపింపఁజేయఁబడిన వానిని దెలుఁపుట, వానిచేష్టలను దెలుపుట, ఈ యెనిమిదిలక్షణములుగల హస్తప్రాణము చిహ్నము అనఁబడును.

౧౨. పదార్థటీక:—

పదానాం కథితానాం స్యాదర్థనిర్వాహతా యది. 201
ఇయంపదార్థటీకేతి కథితా భరతాదిభిః,

తా. చెప్పఁబడుచుండెడు భావవ్యంజకములైన పదములయర్థములను నిశ్చయపరచునట్టి హస్తప్రాణము పదార్థటీక అనఁబడును.

అథ హస్తభేదానిరూప్యన్తే.

అథేదానీంతు హస్తానాం లక్షణాని యథాక్రమమ్. 202

అసంయుతాస్సంయుతాశ్చ ద్వేధాహస్తాః ప్రకీర్తితాః,

తా. ఇఁక హస్తములయొక్క లక్షణములు చెప్పఁబడును. హస్తములు అసంయుతములు సంయుతములు నని రెండువిధములుగలవి.

అథాఽష్టావింశతివిధా సంయుతహస్తా నిరూప్యన్తే.

పతాకస్త్రిపతాకోఽర్ధపతాకః కర్తరీముఖః. 203
మయూరాఖ్యోఽర్ధచన్ద్రశ్చాఽప్యరాళశ్శుకతుణ్డకః,
ముష్టిశ్చశిఖరాఖ్యశ్చ కపిత్థః కటకాముఖః. 204
సూచీచంద్రకలాపద్మకోశం సర్పశిరస్తథా,
మృగశీర్షస్సింహాముఖో లాఙ్గూలస్సోలపద్మకః. 205
చతురో భ్రమరశ్చైవ హంసాస్యోఽహంసపక్షకః,
సందంశోముకుళశ్చైవ తామ్రచూడస్త్రిశూలకః. 206
అష్టావింశతి హస్తానా మేవం నామాని వై క్రమాత్,

తా. పతాకము, త్రిపతాకము, అర్ధపతాకము, కర్తరీముఖము, మయూరము, అర్ధచంద్రము, అరాళము, శుకతుండము, ముష్టి, శిఖరము, కపిత్థము, కటకాముఖము, సూచి, చంద్రకల, పద్మకోశము, సర్పశీర్షము, మృగశీర్షము, సింహాముఖము, లాంగూలము, సోలపద్మము, చతురము, భ్రమరము, హంసాస్యము, హంసపక్షము, సందంశము, ముకుళము, తామ్రచూడము, త్రిశూలము అను ఇరువదియెనిమిదియు అసంయుత హస్తము లనఁబడును.

### పతాకహస్తలక్షణమ్.



అఙ్గుళ్యగ కుఞ్చితాఙ్గుష్ఠా
స్సంశ్లిష్టాః ప్రసృతా యది. 207
సపతాకకరగ ప్రోక్తో
నృత్య కర్మవిశారదైః,

తా. అన్నివ్రేళ్లనుచేర్చి చాఁచి బొటనవ్రేలినివంచిపట్టునది పతాకహస్తమని నృత్యశాస్త్రవిశారదులు చెప్పుదురు.

వినియోగము.—

నాట్యారమ్భే వారివాహే వనే వస్తునిషేధనే. 208
కుచస్థలే నిశాయాంచ నద్యామమరమణ్డలే,
తురగే ఖండనే వాయౌ శయనే గమనోదితే. 209
ప్రతాపేచ ప్రసాదేచ చంద్రికాయాం ఘునాతపే,
కవాటపాటనే సప్తవిభక్త్యర్థే తరఙ్గకే. 210
వీథీప్రవేశభావే ఽపి సమత్వేచాఽఙ్గరాగకే,
ఆత్మార్థే శపథేచాఽపి తూష్ణీం భావస్య దర్శనే. 211
ఆశీర్వాదక్రియాయాం చ నృపశ్రేష్ఠస్య భావనే,
తాళపత్రేచ పేటేచ ద్రవ్యాది స్పర్శనే తథా. 212
తత్రతత్రేతి వచనే సింధౌతు సుకృతిక్రమే,
సంబుద్ధౌతు పురోగే ఽపి ఖడ్గరూపస్య ధారణే. 213
మాసే సంవత్సరే వర్షే దినే సమ్మార్జనే తథా,
ఏవమర్థేషు యుజ్యన్తే పతాకా హస్తభావనాః. 214

తా. నాట్యారంభము, మేఘము, వనము, వస్తువులనునిషేధించుట, కుచస్థలము, రాత్రి, నది, దేవసమూహము, అశ్వము, ఖండించుట, వాయువు, శయనము, గమనము, ప్రతాపము, ప్రసాదము, చంద్రిక, మిక్కిలియెండ, తలుపుకట్టుట, ఏడువిభక్తులు, అల, వీథిలోప్రవేశించుట, సమముగానుండుట, గంధముపూయుట, తాననుట, పంతము, ఊరకుండుట, ఆశీర్వదించుట, గొప్పరాజునుజూపించుట, తాటాకు, చెంపవెట్టు, పదార్థమును స్పృశించుట, అక్కడనే యక్కడనే యనుట, సముద్రము, సుకృతిక్రమము, సంబోధనము, ముందు గాఁబోవువాఁడనుట, కత్తియాకృతిని జూపుట, మాసము, సంవత్సరము, వర్షము, దినము, సమ్మార్జనము, (అనఁగా తుడుచుట) ఈఅర్థములయందు ఈహస్తము వినియోగపడును.

## గ్రంథాంతరస్థ పతాకలక్షణమ్.

సంలగ్నాః తర్జనీమూలే యత్రాఽఙ్గుష్ఠో నికుఞ్చితః,
ప్రసారితతలాఙ్గుళ్యః పతాకః ప్రభవేత్కరః. 215
ఏకాకినాపురాధాత్రా పరబ్రహ్మ సమాగమే,
జయేతి స్తుతివేళాయాం పతాకస్యాఽఽకృతిః కరః. 216
యతోఽభేజే తతోలోకే పతాక ఇతి విశ్రుతః,
అతఏవ సమస్తానాం హస్తానా మయమాదిమః. 217
పతాకో బ్రహ్మణోజాతః శ్వేతవర్ణో ఋషిశ్శివః,
బ్రహ్మజాతి ర్భవేత్తస్య పరబ్రహ్మాఽధిదైవతమ్. 218

తా. తర్జనీమూలమందుఁజేర్చి వంచఁబడిన బొటనవ్రేలును, చాఁచఁబడిన అరచేయియు, వ్రేళ్లునుగలది పతాకహస్త మనఁబడును. ముందు బ్రహ్మ యొంటరిగా పరబ్రహ్మను చేరఁబోయినప్పుడు పతాకాకృతిగా చేయి చాఁచి 'జయవిజయీభవ'యని స్తోత్రముచేసెను. ఆకారణముచేత అట్లు

పట్టఁబడిన చేయి నాఁటినుండి లోకమునందు పతాకమని ప్రసిద్ధినొందెను. కనుక ఇది యెల్లహస్తములకును మొదటిదాయెను. ఈపతాకహస్తము బ్రహ్మవలనఁబుట్టినది. దీనిజాతి బ్రాహ్మణజాతి. వర్ణము తెలుపు. ఋషి శివుఁడు. అధిదేవత బ్రహ్మము.

వినియోగము:—

జయేతి వచనే మేఘే నిషేధే విపినే నిశి,
యాహీతి వచనే యానే వాహేమరుతివక్షసి. 219
పురఃపుణ్యేచాఽతిశయే ప్రవాహే విబుధాలయే,
హాహాకారే చంద్రికాయా మాతపే సురమణ్డలే. 220
అర్గళాపుటనేకుడ్యే ఖణ్డనే పరితోషణే,
కపోలే చన్దనాలేపే కృపాణే వారివారణే. 221
సమూహే సైన్యసన్నాహే సమయే భయవారణే,
అపాశ్రయే అపచయే పిధానే శయనే భువి. 222
జ్వాలాసు వర్షధారాసు తరఙ్గే పక్షిపక్షకే,
ప్రభువిజ్ఞాన నేత్రేతి వాక్యే యాదృశితాదృశి. 223
చపేటే వస్తుసంస్పర్శే సరస్యామజ్జమర్దనే,
వ్యాజస్తుతౌ ప్రతాపేచ దేవతానాం నివేదనే. 224
పార్శ్వశ్లేషేపతాకాయాం ప్రవాతే వసనాఞ్చలే,
శైత్యేతాపే ఘాళధళ్యే ఛాయాయాం వత్సరే ఋతౌ.
అయనే వాసరే పక్షే మాసే స్వచ్ఛే మహాకులే,
సమాసన్నే పాలయేతి లాలయేతిచ భాషణే. 226
బ్రహ్మజాతౌ శుభ్రవర్ణే పతాకోఽయం నియుజ్యతే.

తా. జయజయయనుట, మేఘము, నిశ్శేణము, అడవి, రాత్రి, పొమ్మనుట, నడచుట, గుఱ్ఱము, గాలి, రొమ్ము, ఎదురు, పుణ్యము, అతిశయము, ప్రవాహము, దేవలోకము, హాహాకారము, వెన్నెల, ఎండ, దేవతాసమూహము, గడియ తీయుట, గోడ, నరకుట, సంతోషము, చెక్కిలి, గంధము పూయుట, కత్తి, నీటికికట్టవేయుట, గుంపు, దండుయొక్క అయత్తము, సమయము, వెరపుతీర్చుట, ఆశ్రయములేమి, క్షయము, కప్పుట, పానుపు, భూమి, నిప్పుచుంట, వానధార, అల, పక్షిరెక్క, ప్రభువుతో మనవి చేయుట, ఇక్కడననుట, ఎట్టిది అట్టిదియనుట, చెంపపెట్టు, వస్తువులను అంటుట, కొలను, ఒడలుపిసుకుట, వ్యాజస్తుతి, ప్రతాపము, దేవతానివేదనము, ప్రక్కకౌఁగిలింత, టెక్కెము, పెద్దగాలి, కొంగు, చలి, ఊక్క, తళతళ, నీడ, సంవత్సరము, ఋతువు, ఆయనము, దినము, పక్షము, మాసము, లేట, గొప్పవంశము, సమీపించుట, పాలింపుము లాలింపుము అనుట, బ్రాహ్మణజాతి, శుభ్రవర్ణము వీనియందు ఈ హస్తము వినియోగించును.

## త్రిపతాకహస్తలక్షణమ్.



సఏవ త్రిపతాకస్స్యా
ద్వక్రితా నామికాంగుళిః,

తా. ముందుచెప్పిన పతాకహస్తమందలి యనామిక, (అనఁగా చిటికినవ్రేలికి ముందువ్రేలు) వంచఁబడెనేని యది త్రిపతాక హస్తమగును.

వినియోగము:—

మకుటే వృక్షభావేచ వజ్రే తద్ధరవాసవే. 227
కేతకీ కుసుమే దీపే వహ్నిజ్వాలా విజృమ్భణే,

కపోలేపత్రలేఖాయాం బాణార్థే పరివర్తనే. 228

స్త్రీపుంసయోస్సమాయోగే యుజ్యతే త్రిపతాకకః,

తా. కిరీటము, వృక్షము, వజ్రాయుధము, ఇంద్రుఁడు, మొగలిపువ్వు, దీపము, అగ్నిజ్వాల పైకిలేచుట, చెక్కిలి, మకరికాపత్రరేఖ, బాణము, మార్పు, స్త్రీపురుషులచేరిక వీనియందు ఈ హస్తము వినియోగించును.

## గ్రంథాంతరే త్రిపతాకహస్తలక్షణమ్.

పతాకేఽనామికావక్రాత్త్రిపతాకకరో భవేత్. 229

శక్రేణాఽఽదౌ యతో వజ్రం పస్పర్శేఽనామికాంవినా,

పతాకస్య త్రిభాగేన త్రిపతాక ఇతిస్మృతః. 230

వాసవాత్త్రిపతాకోఽయం జజ్ఞే తస్య ఋషిర్గుహః,

రక్తవర్ణో క్షత్రజాతిరధిదేవో మహేశ్వరః. 231

తా. క్రిందచెప్పఁబడిన పతాకహస్తమందు అనామిక (ఉంగరపు వ్రేలు,) వంచఁబడెనేని యది త్రిపతాకహస్తమగును. ఆదికాలమందు దేవేంద్రుఁడు వజ్రాయుధము కొత్తుకొనునపుడు అనామికనువదలి పతాకము యొక్క మూఁడుభాగములచేత గ్రహించుటచే నేర్పడినది కనుక ఇది త్రిపతాకము అనఁబడెను. ఇది ఇంద్రునివలన పుట్టినది, ఎఱ్ఱవన్నెగలది, క్షత్రియజాతి, దీనికి ఋషి గుహుఁడు, అధిదేవత శివుఁడు.

వినియోగము:—

ఆవాహనేఽవతరణే వదనోన్నమనే నతౌ,

స్పర్శేశుభానాం ద్రవ్యాణామఙ్కనేఽనాదరేఖలే. 232

సన్దేహే మకుటే వృక్షే వాసవే కులిశాయుధే,

అలకాపనయే దీపే తిలకోల్లేఖ ధారణే. 233
కటుగన్ధరవాలాస్త్రైః నాసాకర్ణస్యసంవృతౌ,
అశ్వాసమ్మార్జనే బాణే కేతక్యాం పత్ర లేఖనే. 234
పాతేఖగవిశేషాణాం కీలికీలా విజృమ్భణే,
క్షత్త్రజాతౌ రక్తవర్ణే త్రిపతాకో నియుజ్యతే. 235

తా. ఆవాహనము, దిగుట, మొగమెత్తుట, వంచుట, మంగళవస్తువులనుముట్టుట, గురుతిడుట, నమ్మకములేమి, దుర్జనుఁడు, సందేహము, కిరీటము, వృక్షము, ఇంద్రుఁడు, వజ్రాయుధము, ముంగురుల నెగదువ్వుట, దీపము, బొట్టుపెట్టుకొనుట, పాగాపెట్టుకొనుట, కారైనవాసనవలనను కఠోరశబ్దమువలనను ముక్కుచెవులను మూసికొనుట, గుఱ్ఱమునుతోముట, బాణము, మొగలిపువ్వు, మకరికాపత్రములనువ్రాయుట, కొన్నిపక్షులయొక్కపాటు, నిప్పుమంటలులేచుట, క్షత్త్రియజాతి, ఎరుపువన్నె వీనియందు ఈహస్తము వినియోగించును.

## అర్ధపతాకహస్తలక్షణమ్.



త్రిపతాకేకనిష్ఠాచే
ద్వక్రితార్ధపతాకకః,

తా. త్రిపతాకహస్తమందు చిటికెనవ్రేలు వంపఁబడునేని యది అర్ధపతాకహస్త మనఁబడును.

వినియోగము:—

పల్లవేఫలకేతీరేఽప్యుభయోరితి వాచకే. 236
క్రకచేచ్ఛురికాయాంచ ధ్వజే గోపురశృఙ్గయోః,

యుజ్యతేఽర్ధపతాకోఽయం తత్తత్కర్మప్రయోగతః. 237

తా. చిగురు, పలక, గట్టు, ఇద్దరని చెప్పుట, నూరుకత్తి, రంపము, ధ్వజము, గోపురము, కొమ్ము వీనియందు ఈ హస్తము వినియోగించును.

## కర్తరీముఖహస్తలక్షణమ్.



అస్యైవచాఽపి హస్తస్య
తర్జనీచ కనిష్ఠికా,
బహిః ప్రసారితే ద్వే చే
త్సకరః కర్తరీముఖః. 238

తా. అర్ధపతాకహస్తమందలి చిటికెనవ్రేలును చూపుడువ్రేలును బైటికిచాఁపఁబడునేని కర్తరీముఖహస్తమగును.

వినియోగము:—

స్త్రీపుంసయోస్తు విశ్లేషే విపర్యాసపదేఽపి చ,
లుంఠనే నయనాన్తేచ మరణే భేదభావనే. 239
విద్యుదర్థేప్యేకశయ్యా విరహే పతనే తథా,
లతాయాం చైవయోజ్యోయం కర్తరీ ముఖఇష్యతే. 240

తా. స్త్రీపురుషులయెడబాటు, వ్యత్యస్తస్థానము, దొంగిలించుట, కడకన్ను, చావు, భేదించుట, మెరపు, ఏకశయ్యావిరహము, క్రిందపడుట, తీఁగె వీనియందు ఈహస్తము వినియోగించును.

## క్రష్ణాస్త రే.

త్రిపతాకే బహిర్యాతా తర్జనీ యదికర్తరీ,

శశాఙ్క శేఖరః పూర్వం జటాధర వధమ్ప్రతి. 241
చక్రం లిలేఖ తర్జన్యా నిక్షిప్య భువి మధ్యమామ్,
తదా ప్రభృతిక ర్తర్యుత్పన్నేతి మునిభిస్స్మృతా. 242
క ర్తరిశ్శంకరాజ్జాతః ఋషిః పర్జన్య దేవతా,
క్షత్త్రజాతిస్తామ్రవర్ణశ్చక్రపాణిరధీశ్వరః. 243

తా. త్రిపతాకహస్తమందు తర్జనిబయటకు చాఁచఁబడెనేని కర్తరీ హస్తమగును. పూర్వకాలమునందు శివుఁడు జటాధరాసురసంహారము కొఱకు భూమిలోమధ్యమనుంచి తర్జనిచే చక్రమువ్రాసెను. అది మొదలు కొని కర్తరిగలిగెనని ఋషులు చెప్పుచున్నారు. కర్తరిహస్తము శివునివలనఁ బుట్టినది. ఇది క్షత్త్రియజాతి. ఋషి పర్జన్యుఁడు. రక్తవర్ణము. అధిదేవత చక్రపాణి.

వినియోగము:—

పాదాలక్తకనిర్మాణే పతనే లేఖ్యవాచకే,
దమ్పత్యోర్విరహేచైవ విపర్యాసేరమాధవే. 244
చపలాయా మేకశయ్యా వియోగే మహిషేమృగే,
చామరే శైలశృఙ్గేచ వారణే వృషభే గవి. 245
కేశపాశస్య శోధిన్యాం క్షత్త్రియే తామ్రపర్ణకే,
క ర్తర్యాం గోపురేపోఽయం క ర్తరీ వినియుజ్యతే. 246

తా. కాళ్లకులత్తుకపెట్టుట, వ్రాయుట, దంపతులవిరహము, వ్యత్యాసము, విష్ణువు, మెరపు, ఏకశయ్యావియోగము, మహిషము, మృగము, చామరము, కొండశిఖరము, ఏనుఁగు, వృషభము, ఆవు, దువ్వెన, క్షత్త్రియుఁడు, రక్తవర్ణము, కత్తెర, గోపురము వీనియందు ఈహస్తము వినియోగపడును.

### ౫. మయూరహస్తలక్షణమ్.



అస్మిన్నామికాఽంగుష్ఠే
శ్లిష్టేచాఽన్యే ప్రసారితాః,
మయూరహస్తః కథితః
కరటీకా విచక్షణైః. 247

తా. కర్తరీముఖహస్తమందు అనామికను అంగుష్ఠముతోఁజేర్చి తక్కిన వ్రేళ్లను చాఁచిపట్టినయెడ మయూరహస్తమగును.

వినియోగము:—

మయూరాస్యే లతాయాంచ శకునే వమనేతథా,
అలకస్యాఽపనయనే లలాటే తిలకేషుచ. 248
నేత్రస్యోదకవిక్షేపే శాస్త్రవాదే ప్రసిద్ధకే,
ఏవమర్థేషు యుజ్యన్తే మయూరకరభావనాః. 249

తా. నెమిలిముఖము, తీఁగె, పక్షి, క్రక్కుట, ముంగురులు దిద్దుట, శోసలు, తిలకము, కన్నీరుఎగజిమ్ముట, శాస్త్రమును వ్యవహరించుట, ప్రసిద్ధి వీనియందు ఈహస్తము వినియోగించును.

### ౬. అర్ధచంద్రహస్తలక్షణమ్.



అర్ధచన్ద్రకరస్సోఽయం
పతాకేఽఙ్గుష్ఠసారణాత్,

తా. పతాకహస్తమందు అంగుష్టము చాఁచఁబడిన యెడల అర్ధచంద్రహస్తమగును.

వినియోగము:—

చన్ద్రే కృష్ణాష్టమీభాజి గళహస్తాదికే ఽపిచ. 250
భల్లాయుధే దేవతానా మభిషేచన కర్మణి,
భుక్పాత్రే చోద్భవే కట్యాం చిన్తాయా మాత్మవాచకే. 251
ధ్యానేచ ప్రార్థనేచాఽపి అఙ్గసంస్పర్శనే తథా,
ప్రాకృతానాం నమస్కారే ఽప్యర్ధ చన్ద్రో నియుజ్యతే.

తా. కృష్ణాష్టమీచంద్రుఁడు, మెడపట్టిగెంటుట, భల్లాయుధము, దేవాభిషేకము, కంచము, పుట్టుక, మొల, చింత, తన్ను దానుచెప్పుకొనుట, ధ్యానము, ప్రార్థించుట, అవయవములను అంటుట, సలాముచేయుట వీనియందు ఈహస్తము వినియోగించును.

ద్రంథాన్తరస్థార్థచంద్రహస్తలక్షణమ్.

పతాకే విరళాంగుష్ఠే సోఽర్ధచంద్రకరోభవేత్,
భూషణేచ్ఛావతశ్శమ్భోరతసీముకుళాకృతి. 253
జాతశ్చంద్రాదర్ధచన్ద్రో ఋషిరస్యాఽత్రిరుచ్యతే,
వైశ్యజాతిర్గౌరవర్ణో మహాదేవోఽధిదేవతా. 254

తా. పతాకహస్తము చాఁచఁబడిన బొటనవ్రేలుగలదగునేని అర్ధచంద్రహస్తమగును. ఇది అవిసెమొగ్గవలె నుండును. ఇది భూషణేచ్ఛగల శివునినిమిత్తమై చంద్రునినుండిపుట్టినది. ఇది వైశ్యజాతి, దీనికి ఋషి అత్రి, వర్ణము గౌరము, అధిదేవత మహాదేవుఁడు.

వినియోగము:—

వలయే మణిబంధేచ దర్పణస్య నిరూపణే,
ఆశ్చర్యేచ ప్రయాణేచా ఽప్యమితే నిఖిలేషుచ. 255

తాళమానేమాళిబంధనిర్మాణే బాలపాదపే,
ఖేదాత్కపోలవహనే గజకర్ణనిరూపణే.　　256
యువార్థే చ సమర్థే చ శశాఙ్కప్రాకృతానతౌ,
అభిషేకే భ్రూలతాయామంశుకే కార్ముకేఽధికే.　　257
కటిపట్టదృఢీకారే కలశారచనేఽఙ్గకే,
చరణాభినయేబాలవహనే పశ్చిమాఙ్గకే.　　258
గౌరవర్ణేవైశ్యజాతావర్ధచంద్రో నియుజ్యతే,

తా. ముంజేతికడియము, మనికట్టు, అద్దమునుజూచుట, ఆశ్చర్యము, ప్రయాసము, మేరలేమి, సకలము, తాళమానము, సిగముడివేయుట, లేఁతచెట్టు, దుఃఖమువలన చెక్కిట చెయిచేర్చుట, ఏనుఁగుచెవులను చూపుట, తప్పుచేసినవారిని వెడలఁగొట్టుట, నొసటిచెమటతుడుచుట, యౌవనవంతుఁడు, సమర్థుఁడు, చంద్రుఁడు, ప్రాకృతులకు నమస్కరించుట, అభిషేకము, కనుబొమ్మ, వస్త్రము, ధనుస్సు, మిక్కిలియనుట, నడుముకట్టు బిగించుట, కుండలుచేయుట, అంగము కాళ్లనుచూపుట, బిడ్డనెత్తుకొనుట, వీఁపు, తెలుపు, వైశ్యజాతి వీనియందు ఈహస్తము వినియోగపడును.

౭. అరాళహస్తలక్షణమ్.



పతాకే తర్జనీ వక్రా
నామ్నాసోఽయమరాళకః.　　259

తా. పతాకహస్తమందు చూపుడువ్రేలు వంచఁబడిన యెడ అరాళహస్తమగును.

**వినియోగము:—**

విషామృతాదిపానేషు ప్రచండ పవనేఽపి చ,
యుజ్యతేఽరాళహస్తోఽయం భరతాగమకోవిదైః. 260

**తా. విషము అమృతము మొదలగువానిని త్రాగుటయందును, ప్రచండ మయిన గాలియందును ఈ హస్తము ఉపయోగింపఁబడును.**

**గ్రన్థాంతరస్థారాళహస్తలక్షణమ్.**

పతాకాఙ్గుష్ఠతర్జన్యౌ వక్రితౌ స్యాదరాళకః,
సప్తానాం జలధీనాంయ ఆపోశనకృతేపురా. 261
అరాళః కుమ్భజాజ్జాతః సఏవ ఋషిరుచ్యతే,
పాటలాంశుర్మిశ్రజాతిర్వాసుదేవోఽధిదేవతా. 262
ఏవమేతస్యాఽఽనుపూర్వీం వదంతిభరతాదయః,

**తా. పతాకహస్తమున అంగుష్ఠతర్జనులు వంచఁబడినయెడ అరాళ హస్తమగును. ఇది పూర్వకాలమునందు అగస్త్యమహాముునివలన సప్తసముద్రములను ఆపోశనము చేయునపుడు పుట్టెను. ఇది మిశ్రజాతి. దీనికి అగస్త్యుఁడు ఋషి. పాటలవర్ణము. వాసుదేవుఁడు అధిదేవత. దీని ఆనుపూర్వి ఇటువంటిదని భరతాదులు చెప్పిరి.**

**వినియోగము:—**

ఆపోశనే బ్రాహ్మణానామాశీర్వచనకర్మణి. 263
విటానాంప్రియవైముఖ్యే కేశానాంచ విశీర్ణకే,
ఆయాహి శీఘ్రమిత్యుక్తౌ సంధ్యాకర్మప్రదక్షిణే. 264
లలాటస్వేదహరణే కజ్జలాలేపనే దృశోః,
ఏవమాదిషుయుజ్యంతే అరాళకరభావనాః. 265

తా. బ్రాహ్మణులయొక్క ఆపోశనము, ఆశీర్వాదము చేయుట, విటుల ప్రియవైముఖ్యము, వెంద్రుకలు చిక్కుదీయుట, వేగమురమ్మనుట, సంధ్యాకర్మమునందలి ప్రదక్షిణము, నొసటిచెమ్మటతుడుచుట, కన్నులకు కాటుక పెట్టుట మొదలగువానియందు ఈ హస్తము చెల్లును.

### ౧. శుకతుణ్డహస్తలక్షణమ్.



అస్మిన్ననామికావక్రా
శుకతుండకరో భవేత్,

తా. ముందుచెప్పిన అరాళహస్తమందు అనామిక వంచఁబడెనేని శుకతుణ్డహస్తమగును.

వినియోగము:—

బాణప్రయోగే కుంతార్థేమర్మోక్త్యావుగ్రభావనే. 266
శుకతుండకరోజ్ఞేయో భరతాగమవేదిభిః,

తా. బాణప్రయోగము, ఈటె, మర్మమైనమాట, తీక్ష్ణభావము వీనియందీహస్త ముపయోగింపఁబడును.

### గ్రన్థాన్తరస్థ శుకతుణ్డహస్తలక్షణమ్.

వక్రేపతాకతర్జన్యనామికౌ శుకతుండకః. 267
నటయిత్వాప్రేమకోపంనాథమ్ప్రీతిసదాశివమ్,
దుర్గాయాః శుకతుండాభ్యో దుర్వాసాఋషిరుచ్యతే. 268
ద్విజాన్వయశ్శోణవర్ణో దేవతాఽస్య మరీచికః,

తా. పతాకహస్తమందు తర్జన్యనామికలు వంచఁబడెనేని శుకతుండహస్తమగును. ఇది సదాశివునిపై పార్వతీదేవికి ప్రణయకలహము గలిగినప్పుడు పార్వతీదేవియందుపుట్టెను. ఇది బ్రాహ్మణజాతి. ఋషి దుర్వాసుఁడు. రక్తవర్ణము. మరీచి అధిదేవత.

వినియోగము:—

ప్రహ్మాస్త్రేస్యాన్ముఖాగ్రేచ కౌటిల్యే పరివర్తనే. 269
భిణ్డిపాలేచ భావ్యర్థే క్రమణే కలహేఽపిచ,
అనాదరే ప్రేమకోపే ఆశయేచ విసర్జనే. 270
ద్యూతాక్షపాతే కున్తార్థే శుకశారినిరూపణే,
ఉగ్రభావేచ మర్మోక్తౌ తామ్రే బ్రాహ్మణజాతిజః. 271
శుకతుండకరోభావనేతృభిఃపరికీర్తితః,

తా. బ్రహ్మాస్త్రము, మొగముతుద(ముక్కు), వంకర, మార్పు, భిండిపాలమను ఆయుధము, నడవఁబోవువిషయము, దాఁటుట, కలహము, ప్రీతిలేమి, ప్రణయకలహము, అభిప్రాయము, విడుపు, జూదపు పాచికలు వేయుట, ఈటె, చిలుకగోరువంకలను జూపుట, ఉగ్రభావము, మర్మోక్తి, తామ్రవర్ణము వీనియందు బ్రాహ్మణజాతియైన ఈహస్తము చెల్లును.

౯. ముష్టిహస్తలక్షణమ్.



మేళనాదఙ్గుళీనాఞ్చ
కుఞ్చితానాంతలాన్తరే. 272
అఙ్గుష్ఠేనోపరియుతో
ముష్టిహస్తోఽయముచ్యతే,

తా. నాలుగు వ్రేళ్లను జేర్చి యరచేతిలోనికివంచి యంగుష్ఠమును మీఁదఁజేర్చునెడ ముష్టిహస్తమగును.

వినియోగము:—

స్థిరేకచగ్రహేదార్ఢ్యేవస్త్వాదీనాంచ ధారణే. 273
మల్లానాంయుద్ధభావేచ ముష్టిహస్తోఽయముచ్యతే,

తా. స్థిరమనుట, సిగబట్టుట, దృఢత్వము, పదార్థములఁబట్టుకొనుట, జెట్టీలజగడము వీనియందు ఈముష్టిహస్తము వినియోగింపఁబడును.

## గ్రంథాంతరస్థ ముష్టిహస్తలక్షణమ్.

మధ్యోపరికృతాంగుష్ఠో ముష్టిర్ముష్ట్యాకృతిఃకరః. 274
మధుకైటభయోర్యుద్ధేజాతోవిష్ణోరయంకరః,
అమరేంద్రోఋషిర్నీలవర్ణశ్చంద్రోఽధిదేవతా. 275

తా. నడిమివ్రేలిమీఁద అంగుష్ఠమునుమడిచి పిడికిలిపట్టఁబడెనేని యది ముష్టిహస్తమగును. అది విష్ణువు మధుకైటభులతో యుద్ధము చేయుకాలమందు విష్ణువువలనపుట్టెను. ఇది శూద్రజాతి. దీనికి. ఋషి అమరేంద్రుఁడు. వర్ణము నీలము. చంద్రుఁడు అధిదేవత.

ఆలమ్బనేమధ్యభావే ఫలే సజ్కేతభావనే,
భద్రార్థే బలిదానేచ ప్రణామే ప్రాకృతైఃకృతే. 276
ఊరుసంవహనే ఘంటాగ్రహణేఽతిప్రధావనే,
లాఘవే మల్లయుద్ధేచ ఖేటకాదిగ్రహేస్థిరే. 277
కచాకర్షేముష్టిఘాతే గదాకున్తాదిధారణే,
నీలవర్ణేశూద్రజాతౌ ముష్టిహస్తోఽయముచ్యతే. 278

తా. పట్టు, నడుము, ప్రయోజనము, సంకేతము, క్షేమము, బలియిచ్చుట, ప్రాకృతజనుల నమస్కారము, గట్టిపట్టు, గంటనుపట్టుట, వడిగా పరుగెత్తుట, తేలిక, జెట్టిపోట్లాట, కేడెము మొదలయినవానిని పట్టుట, నిలుకడ, తలవెండ్రుకలుపట్టుట, పిడికిటిపోటు, గద యీటె మొదలయిన ఆయుధములనుపట్టుట, నీలవర్ణము, శూద్రజాతి వీనియందు ఈహస్తము వినియోగింపఁబడును.

## ౧౦. శిఖరహస్తలక్షణమ్.



చేన్ముష్టిరున్నతాంగుష్ఠ
స్సఏవ శిఖరః కరః,

తా. ముందుచెప్పిన ముష్టిహస్తమందు అంగుష్ఠమును పొడవుగా నెత్తినయెడ శిఖరహస్తమగును.

వినియోగము:—

మదనే కార్ముకే స్తమ్భే నిశ్శబ్దే పితృతర్పణే. 279
ఓష్ఠేనాథేచరదనే ప్రవిష్టే ప్రశ్నభావనే,
అఙ్గేనాఽస్తీతి వచనే స్మరణే ఽభినయాంతరే. 280
కటిబంధాకర్షణే చ పరిరమ్భవిధౌ ధవే,
శక్తితోమరయోర్మోక్షే ఘణ్టానాదే చ పేషణే. 281
శిఖరోయుజ్యతేసోఽయం భరతాగమవేదిభిః,

తా. మన్మథుఁడు, ధనుస్సు, స్తంభము, శబ్దములేమి, పితృతర్పణము, పెదవి, పెనిమిటి, దంతము, ప్రవేశించుట, ప్రశ్నచేయుట, అవయవము, లేదనుట, తలఁచుట, ఇతరాభినయము, నడుముకట్టు నీడ్చుట, కౌఁగిలింత,

ప్రియుఁడు, శక్త్యాయుధ తోమరాయుధములను ప్రయోగించుట, ఘంటానాదము, పేషణము వీనియందు ఈ హస్తము ఉపయోగింపఁబడును.

## గ్రంథాంతరస్థ శిఖరహస్తలక్షణమ్.

ముష్టిరూర్ధ్వీకృతాంగుష్ఠః సఏవ శిఖరః కరః.        282
సుమేరుం కార్ముకీకృత్య తన్మధ్యే చంద్రశేఖరః,
హస్తేన యేన జగ్రాహసోఽభవచ్ఛిఖరఃకరః.        283
శిఖరో మేరుధనుషో జాత స్తస్య ఋషిర్జినః,
గంధర్వజాతిశ్శ్యామాంశురధీశో రతివల్లభః.        284

తా. ముష్టిహస్తము పైకెత్తఁబడిన బొటనవ్రేలుగలదయ్యేనేని శిఖరహస్తమగును. ఇది పూర్వకాలమందు శివుఁడు త్రిపురాసురులతో యుద్ధము చేయుటకు మేరుపర్వతమును విల్లుగాచేసి దాని నడిమిభాగమును పట్టునపుడు శివునివలనఁబుట్టెను. ఇది గంధర్వజాతి. దీనికి ఋషి జినుఁడు. వన్నె చామన. అధిదేవత మన్మథుఁడు.

పితౄణాం తర్పణేస్థైర్యే కుటుమ్బస్థాపనే ఽపిచ,
నాయకే శిఖరే మిత్రే తిర్యక్ఛే ద్దంతధావనే.        285
వ్యజనేతాలవృంతస్య భేదే కిమితి భాషణే,
శృంగారపయసోపానే చతుస్సంఖ్యా విభావనే.        286
శక్తితోమరయోర్మోక్షే ఫలాంశక పరిగ్రహే,
విలాసినీనమ్రభావే లజ్జాయాం కార్ముకేస్మరే.        287
పురుషే నిశ్చయేస్తమ్భే ఘంటానాదేచ నర్తనే,
నాఽస్తీతి వచనే దానే స్థాయిభావే వినాయకే.        288

మహిషాసురమర్దన్యాం వీరాంశే హయవల్గనే,
అర్ధచంద్రాదితిలకే కబరీచిహ్నధారణే 289
ఇంద్రనీలే గాఢభావే శిఖరస్సమ్ప్రయుజ్యతే,

తా. పితృతర్పణము, కుటుంబమును నిలుపుట, నాయకుఁడు, శిఖరము, స్నేహితుఁడు, అడ్డముగఁ బట్టినయెడ పండ్లుతోముకొనుట, వింజామరము, విసనకఱ్ఱ, ఏమని యడుగుట, గిండిచెంబు, నీళ్లుత్రాగుట, నాలుగని లెక్కపెట్టుట, శక్తి అను ఆయుధమును వైచుట, ఈటెను విసరుట, ఫలాంశమును గ్రహించుట, ఆఁడువారియడఁకువ, సిగ్గు, విల్లు, మన్మథుఁడు, మగఁడు, నిశ్చయము, స్తంభము, గంటవాయించుట, భోగమాట, లేదనుట, ఈవి, నిలుకడ గలిగియుండుట, పిశ్యారి, మహిషాసురమర్దని, వీరుఁడు, గుఱ్ఱమును దాఁటించుట, అర్ధచంద్రతిలకము మొదలగునవి, కొప్పుగురుతును పూనుట, ఇంద్రనీలము, దృఢత్వము వీనియందు ఈ హస్తము ఉపయోగింపఁబడును.

## ౧౧. కపిత్థహస్తలక్షణమ్.



అంగుష్ఠమూర్ధ్ని శిఖరే
వక్రితా యది తర్జనీ. 290
కపిత్థాఖ్యకరస్సోఽయం
తన్నిరూపణముచ్యతే,

తా. ముందుచెప్పిన శిఖరహస్తము అంగుష్ఠముపై చూపుడువ్రేలు వంచఁబడెనేని కపిత్థహస్తమగును.

వినియోగము:—

లక్ష్మ్యాంచైవ సరస్వత్యాం వేష్టనే తాళధారణే. 291
గోదోహనేచాఽఞ్జనేచ లీలాత్త సుమధారణే,

చేలాఞ్చలాది గ్రహణే పటస్యైవా ఽవకుణ్ఠనే. 292
ధూపదీపార్చనేచాపి కపిత్థ స్సంప్రయుజ్యతే,

తా. లక్ష్మీదేవి, సరస్వతి, చుట్టుట, తాళమునుపట్టుట, పాలుపిదుకుట, కాటుకపెట్టుకొనుట, వినోదముగా పూలచెండ్లు ధరించుట, కొంగు మొదలగువానిని పట్టుకొనుట, గుడ్డ ముసుఁగువేసికొనుట, ధూపదీపార్చనము వీనియందు ఈ హస్తము వినియోగింపఁబడును.

### గ్రంథాంతరస్థ కపిత్థహస్తలక్షణమ్.

శిఖరాంగుష్ఠ తర్జన్యో లగ్నాచే త్సకపిత్థకః. 293
సముద్రమథనేపూర్వం మందరాకర్షణోచితః,
జాతః కపిత్థః శ్రీవిష్ణోర్నారదో ఋషిరుచ్యతే. 294
ఋషిజాతి ర్గౌరవర్ణః పద్మగర్భోఽధిదేవతా,

తా. శిఖరహస్తమునందలి బొటనవ్రేలును చూపుడువ్రేలును చేర్పఁబడునెడ కపిత్థహస్తమగును. పూర్వకాలమునందు సముద్రమును చిలుకుటకు అనుకూలముగా మందరపర్వతమును పట్టునపుడు ఈకపిత్థహస్తము విష్ణువువలనఁబుట్టెను. ఇది ఋషిజాతి. దీనికి ఋషి నారదుఁడు. వర్ణము తెలుపు. అధిదేవత పద్మగర్భుఁడు.

వినియోగము:—

మంథానాకర్షణేలక్ష్మ్యాం ధూప దీప నివేదనే. 295
వరాటకానాం విక్షేపే వహనేఽఙ్కుశవజ్రయోః,
క్షేపణగ్రహణేతాళధారణే నాట్యదర్శనే. 296
లీలాబ్జధారణేవాణ్యాం జపదామ నిరూపణే,

వేషణే యావకాదీనాం చేలాఞ్చల సమాహృతౌ.
ఋషిజాతౌ గౌరవర్ణే కపిత్థోఽయం నియుజ్యతే,

తా. కవ్వమునుబట్టి చిలుకుట, లక్ష్మి, ధూపదీపములను నివేదించుట, గవ్వలను ఎగఁజిమ్ముట, అంకుశవజ్రాయుధములనుపట్టుట, ఒడిసెలత్రిప్పుట, తాళముపట్టుట, నాట్యమునుజూపుట, వినోదముగా తామరపువ్వు చేతపట్టు కొనుట, సరస్వతిజపమాలికను ధరించుట, లత్తుక మొదలగువానిని మెదుపుట, కొంగునులాగుట, ఋషిజాతి, గౌరవర్ణము వీనియందు ఈహస్తము వినియోగించును.

౧౨. కటకాముఖహస్తలక్షణమ్.



కపిత్థ తర్జనీచోర్ధ్వం
మిశ్రితాంగుష్ఠమధ్యమా. 298
కటకా ముఖ హస్తోఽయం
కీర్తితో భరతాదిభిః,

తా. ముందుచెప్పిన కపిత్థహస్తమందు చూపుడువ్రేలు నడిమివ్రేలితోను బొటనవ్రేలితోను జేర్చి పట్టఁబడునేని కటకాముఖహస్తమగును.

వినియోగము:—

కుసుమాపచయేముక్తాస్రజాందామ్నాంచధారణే. 299
శరమందాకర్షణేచ నాగవల్లీప్రదానకే,
కస్తూరికాదివస్తూనాం పేషణే గంధవాసనే. 300
వచనేదృష్టిభావేచ కటకాముఖఇష్యతే,

తా. పువ్వులుకోయుంట,ముత్యాలదండ పూలదండలు ధరించుట,బాణ

మెల్లగా ఆకర్షించుట, ఆకుమడుపులిచ్చుట, కస్తూరి మొదలగు ద్రవ్య కలుపుట, వాసనద్రవ్యములు చేర్చుట, మాట, చూపు వీనియందు స్త ముపయోగింపఁబడును.

## గ్రంథాంతరస్థ కటకాముఖలక్షణమ్.

త్యంగుష్ఠయుతః క్షిప్తః కపిత్థః కటకాముఖః. 301
భ్యస్యతోధనుర్విద్యాం గుహాదీశ్వరసన్నిధౌ,
టకాముఖహస్తోఽభూద్భార్గవోబుషిరుచ్యతే. 302
దేవజాతిస్స్వర్ణవర్ణో రఘురామోఽస్య దేవతా,

తా. కపిత్థహస్తముయొక్క బొటనవ్రేలు ఎత్తి పట్టఁబడునేని కట ఖహస్త మగును. శివునియొద్ద కుమారస్వామి విలువిద్య నేర్చునపుడు ముఖహస్తము పుట్టెను. ఇది దేవజాతి. దీనికి ఋషి భార్గవుఁడు. స్వర్ణ ం. అధిదేవత రఘురాముఁడు.

గము:—

ముక్తాస్రజాంపుష్పదామ్నాం చామరాణాంచ ధారణే.
ఆకర్షణేశరాదీనాం దర్పణాభిముఖగ్రహే,
ంలీనవహానేవృంత భేదనే దంతధావనే. 304
పసుమాపచయే నాగవల్లీదళపరిగ్రహే,
స్తూరికాదినిష్పేషే వారస్త్రీణాం నిగూహనే. 305
సురాకర్షణే చక్రధారణేవ్యజనగ్రహే,
స్వర్ణవర్ణే దేవజాత్యాం యుజ్యతే కటకాముఖః. 306

తా. ముత్యాలసరము, పూలదండ, వింజామరము వీనిని ధరించుట; ము మొదలైనవానిని ఆకర్షించుట, అద్దము నెదుటికి తెచ్చుట, కల్లము ు, తొడిమనుత్రుంచుట, పండ్లుతోముట, పువ్వులుకోయుట, ఆకుమడు

పులిచ్చుట, కస్తూరి మొదలగువస్తువులను మెదుపుట, బోగమువారి కౌఁగిలింత, ఇంటినితిగుచుట, చక్రాయుధమును ధరించుట, విసనకఱ్ఱపట్టుట, బంగారువన్నె, దేవజాతి వీనియందు ఈహస్తము వినియోగించును.

## ౧౩. సూచీహస్తలక్షణమ్.



ఊర్ధ్వం ప్రసారితా యత్ర
కటకా ముఖతర్జనీ,
భవేత్సూచీకరస్సోఽయం
కీర్తితో భరతాగమే. 307

తా. ముందుచెప్పిన కటకాముఖహస్తమునందలి చూపుడువ్రేలు పొడుగుగా చాఁచఁబడినయెడ సూచీహస్తమగును.

వినియోగము:—

ఏకార్థేఽపి పరబ్రహ్మ భావనాయాం శతేఽపిచ,
రవౌ నగర్యాం లోకార్థే తథేతి వచనేఽపి చ. 308
యచ్ఛబ్దేఽపిచ తచ్ఛబ్దే వ్యజనార్థేఽపితర్జనే,
కార్శ్యేశలాకావపుషోరాశ్చర్యే వేణిభావనే. 309
ఛత్రే సమర్థకోణేచ రోమాళ్యాంభేరిభేదనే,
కులాలచక్రభ్రమణే రథాంగే మండలేతథా, 310
వివేచనేదినాంతేచ సూచీహస్తః ప్రకీర్తితః,

తా. ఒకటి అనుట, పరబ్రహ్మనిరూపణము, నూరుఅనుట, సూర్యుఁడు, నగరము, లోకము అనుట, అట్లు అనుట, ఎవఁడు ఎవతె ఏదియనుట, వాఁడు ఆమె అదియనుట, విసనకఱ్ఱ, వెరపించుట, కృశించుట, సలాక, దేహము,

ఆశ్చర్యపడుట, జడచూపుట, గొడుగు, నేర్పరితనము, ఘూలఅనుట, నూగారు, భేరివాయించుట, కుమ్మరవాని చక్రముతిరుగుట, బండిచక్రము, సమూహము, వివరించుట, సాయంకాలము వీనియందు ఈ హస్తము వినియోగించును.

## గ్రన్థాన్తరస్థ సూచీముఖహస్తలక్షణమ్.

సూచీముఖో భవేదూర్ధ్వం కటకాముఖతర్జనీ. 311
అహమేక ఇతి బ్రహ్మా నిర్దేశమకరోద్యతః,
తస్మాద్విరించినో జాతః సూచిరస్య ఋషీరవిః. 312
దేవజాతి శ్శ్వేతవర్ణో విశ్వకర్మాఽధిదేవతా,

తా. కటకాముఖహస్తముయొక్క చూపుడువ్రేలు పైకెత్తఁబడెనేని సూచీముఖహస్తమగును. పూర్వకాలమునందు బ్రహ్మ నేనొకఁడనే యని నిర్దేశించునపుడు ఆ బ్రహ్మవలన ఈ సూచీహస్తము పుట్టెను. ఇది దేవజాతి. దీనికి ఋషి సూర్యుఁడు. వర్ణము శ్వేతము. అధిదేవత విశ్వకర్మ.

వినియోగము:—

శ్లాఘాయాం సత్యవచనే దూరదేశనిరూపణే. 313
ప్రాణార్థే చ పురోగేఽపి ఏకసఙ్ఖ్యానిరూపణే,
సంధ్యాయాం విజనే నాశే సాధువాదే నిరీక్షణే. 314
తథేతి వచనే లోకే పరబ్రహ్మనిరూపణే,
ఏకార్థే ఽపిశలాకాయాం రథాఙ్గ భ్రమణేరవౌ. 315
ఉదయాస్తమయేబాణే గూఢనాయకదర్శనే,
శిలీముఖే చ యచ్ఛబ్దే తచ్ఛబ్దేలోహ నాళయోః. 316

తర్జనే. నీచసంబుద్ధౌ శ్రవణే విరహే స్మృతౌ,
ఘ్రాణే చక్షుర్ద్వయం శ్వేతవర్ణే దర్శనే సూచికః కరః. 317

తా. శ్లాఘించుట, నిజము, దూరమునుజూపుట, ప్రాణమనుట, ముందుగఁబోవువానిఁజూపుట, ఒకటి అనుట, సంధ్యాకాలము, ఏకాంత ప్రదేశము, తూడు, బాగనుట, చూపు, అట్లేయనుట, లోకము, పరబ్రహ్మ నిరూపణము, ఒకటేయనునర్థము, సలాక, చక్రమును త్రిప్పుట, సూర్యుఁడు, ఉదయాస్తమయములు, బాణము, రహస్యముగనాయకునిజూపుట, అలుగు గలబాణము, ఏది అది అనుట, ఇనుము, కమ్మి, బెదరించుట, నీచునిపిలుచుట, వినుట, విరహము, తలఁచుట, ముక్కు, పక్షిముక్కు, తెలుపు, చూచుట వీనియందు ఈహస్తము వినియోగపడును.

౧౮. చన్ద్రకలాహస్తలక్షణమ్.

వినియోగము:—



సూచ్యామఙ్గుష్ఠమోక్షేతు
భవేచ్చన్ద్రకలాకరః,
ఏషాచన్ద్రకలాచన్ద్ర
కలాయామేవయుజ్యతే. 318

తా. ముందుచెప్పిన సూచీహస్తమునందు బొటనవ్రేలిని విడిచినయెడ చంద్రకలాహస్తమగును. ఈ చంద్రకలాహస్తము కలామాత్రచంద్రునియందు వినియోగింపఁబడును.

## ౧౫. పద్మకోశహస్తలక్షణమ్.



అఙ్గుళ్యో విరళాగ్ర కిఞ్చిత్
కుఞ్చితా _స్తలనిమ్నగాః,
పద్మకోశాభిధో హ_స్త
_స్తన్నిరూపణముచ్యతే. 319

తా. అయిదువ్రేళ్లను ఎడముగాచాఁచి కొంచెము వంచి అరచేయిపల్లమగునట్టు పట్టఁబడునెడ పద్మకోశ హస్తమగును.

వినియోగము.—

ఫలేబిల్వకపిత్థాదౌ స్త్రీణాంచ కుచకుమ్భయోః,
వర్తులేకందుకే స్వల్పభోజనే పుష్పకోశకే. 320
సహకారఫలే పుష్పవర్షేమంజరికాదిషు,
జపాకుసుమభావే ఉపిఘుంటారూపవిధానకే. 321
వల్మీకే కుముదేఽప్యండే పద్మకోశోఽభిధీయతే,

తా. మారేడుపండు, వెలగపండు, స్తనములు, వట్రువ, చెండు, అల్పాహారము, పూమొగ్గ, మామిడిపండు, పూలవాన, పూగుత్తి మొదలగునది, మంకెనపువ్వు, ఖంటారూపమునుజూపుట, పాములపుట్ట, నల్లకలువ, గుడ్లు వీనియందు ఈహస్తము ఉపయోగించును.

### గ్రంథాంతరస్థ పద్మకోశహస్తలక్షణమ్.

వరశ్వేతామ్బుజాకారః పద్మకోశోఽభిధీయతే. 322
చక్రార్థే పద్మనికరైశ్శమ్భుపూజాం వితన్వతః,
నారాయణాత్పద్మకోశో జాతః పద్మధరోఋషిః. 323

యక్షాన్వయః కిన్నరాంశో అధిదేవోఽస్య భార్గవః,

తా. శ్రేష్ఠమయిన తెల్లదామర యాకృతిగా పట్టఁబడునది పద్మకోశ హస్తమనఁబడును. పూర్వకాలమునందు చక్రాయుధముకొఱకు పద్మములచేత శివపూజఁజేయుచున్న విష్ణుదేవునివలన ఈపద్మకోశహస్తముగలిగెను. ఇది యక్షజాతి. కిన్నరాంశము. దీనికి పద్మధరుఁడు ఋషి. భార్గవుఁడు అధిదేవత.
వినియోగము:—

శుండాయాం థాళథళ్యేచ హేమరౌప్యాదిభాజనే. 324
ధమ్మిల్లే చ మితార్థే చ లావణ్యే సాధువాచనే,
ఘంటాయాం కందుకే పద్మేవల్మీకే వర్తులేస్తనే. 325
నారికేళే చూతఫలే కర్ణికారేచదర్పణే,
శాఖానతౌపుష్పవర్షేకబళేఽండవికాసనే. 326
బిల్వేకపిత్థే యుజ్యేత పద్మకోశాహ్వయః కరః,

తా. ఏనుఁగుతొండము, థళథళయనుకాంతి, బంగారు వెండి మొదలగువాని పాత్రము, కొప్పు, కొలఁదియనుట, అందము, బాగు అనుట, ఘంట, పుట్టచెండు, తామర, పుట్ట, గుండ్రన, కుచము, టెంకాయ, మామిడిపండు, కొండగోగు, అద్దము, కొమ్మవంగుట, పూలవాన, కబళము, గ్రుడ్లుపగులుట, మారేడుపండు, వెలగపండు వీనియందు ఈ హస్తము వినియోగించును.

౧౬. సర్పశీర్షహస్తలక్షణమ్.



పతాకతల నిమ్నత్వా
త్సర్పశీర్షకరోభవేత్. 327

తా. పతాకహస్తముయొక్క అరచెయ్యి కొంచెముపల్లముగ వంచఁబడినయెడ సర్పశీర్షహస్తమగును.

వినియోగము:—

చన్దనే భుజగే మందే ప్రోక్షణే పోషణాదిషు,
దేవర్ష్యుదకదానేష్వాఽఽస్ఫాలే గజకుమ్భయోః. 328.
భుజాస్ఫాలే తు మల్లానాం యుజ్యతే సర్పశీర్షకః,

తా, గంధము, పాము, మెల్లగాననుట, నీళ్ళు చిలుకరించుట, ప్రోచుట మొదలగునవి, దేవర్షి తర్పణములు, ఏనుఁగు కుంభస్థలములను చరచుట, జెట్టిలు భుజముచరచుట వీనియందు ఈహస్తము ఉపయోగపడును.

## గ్రంథాంతరస్థ సర్పశీర్షహస్తలక్షణమ్.

పతాకే నిమ్నమధ్యత్వం సర్పశీర్ష ఇతిస్మృతః. 329
నిరీక్ష్యనిర్జరాన్భీతాన్కరవిన్యాసపూర్వకమ్,
బలింవఞ్చయితుంఖర్వో భవేయమితిభాషతః. 330
వామనాత్సర్పశీర్షోఽయం వాసవో ఋషిరుచ్యతే,
హరిద్వర్ణో దేవజాతిః కాలకంఠోఽధిదేవతా. 331

తా. పతాకహస్తమునందలి అరచేయి పల్లముగాపట్టఁబడునేని సర్పశీర్షహస్తమగును. పూర్వకాలమునందు బలిచక్రవర్తికి వెరచి తన్ను శరణుచొచ్చిన దేవతలనుగూర్చి విష్ణుదేవుఁడు 'వామనావతారమెత్తి బలినివంచించి మిమ్ముకాపాడెద' నని చేయిచాఁచి చెప్పునపుడు ఆవామనునివలన ఈసర్పశీర్షహస్తముపుట్టెను. ఇది దేవజాతి. దీనికి ఇంద్రుఁడు ఋషి. పసుపువర్ణము. శివుఁడు అధిదేవత.

వినియోగము:—

కుఞ్కుమే పఙ్కభావేఽపి ప్రాణాయామనిరూపణే,
ముఖప్రక్షాళనవిధౌ దానవేళావివేచనే. 332

చందనేచ గజే ఖర్వే మల్లానాం ప్రలేచ లాలనే,
క్షీరే నీరేచ కాశ్మీరే లజ్జాయాం గోప్యకేశకా. 333
ప్రతిమాయాం పయఃపానే లీనే సత్వరిభాషణే,
దేవజాతౌ హరిద్వర్ణే యుక్తమిత్యుత్తరీకృతౌ. 334
పటవాసపరిక్షేపే చన్దనాదివిలేపనే,
కుచాదిగ్రహణే స్త్రీణాం సర్పశీర్షో నియుజ్యతే. 335

తా. కుంకుమము, ఆడుసు, ప్రాణాయామమునుజూపుట, మొగము కడుగుకొనుట, దానకాలమునునిరూపించుట, గంధము, ఏనుఁగు, పొట్టి వాఁడు, జెట్టిలుభుజముచరచుట, బుజ్జగించుట, పాలు, నీరు, కుంకుమపువ్వు, సిగ్గు, దాఁచఁదగినవస్తువు, పసిబిడ్డ, బొమ్మ, నీళ్ళుత్రాగుట, ఐక్యము, మంచి దనుట, దేవజాతి, పసుపువన్నె, తగుననుట, గంధపుపొడిచల్లుట, గందము మొదలగువానిపూఁత, స్తనము మొదలగువానిని పట్టుకొనుట వీనియందు ఈహస్తము వినియోగించును.



## ౧౭. మృగశీర్షహస్తలక్షణమ్.

అస్మిన్నేకనిష్ఠికాఙ్గుష్ఠే
ప్రసృతే మృగశీర్షకః,

తా. ముందుచెప్పిన సర్పశీర్షహస్తమందలి చిటికెనవ్రేలును బొటన వ్రేలును చాఁచఁబడునేని మృగశీర్షహస్తమగును.

వినియోగము:—

స్త్రీణామర్థకపోలేచ క్రమ మర్యాదయోరపి. 336
భీతేవివాదే నైపథ్యేఽప్యావాసేచ త్రిపుండ్రకే,

ముఖాముఖేరంగవల్ల్యాం పాదసంవాహనేఽపిచ.　　337
సర్వసమ్మేళనేకార్యే మందిరే ఛత్రధారణే,
సోపానేపదవిన్యాసే ప్రియాహ్వానే తథైవచ.　　338
సఙ్జ్ఞాం రేచ ప్రయుజ్యేత భరతాగమకోవిదైః,

తా. స్త్రీవిషయము, చెక్కిలి, క్రమము, మర్యాద, వెరపు, వాదు, అలంకారము, ఉనికిపట్టు, త్రిపుండ్రము పెట్టుకొనుట, ఎదురెదురు, ముగ్గు, కాళ్ళుపిసుకుట, అన్నిటినికూర్చుట, ఇల్లు, గొడుగుబట్టుకొనుట, మెట్టు, అడుగుపెట్టుట, ప్రియులనుబిలుచుట, తిరుగుట వీనియందు ఈహస్తము వినియోగించుచు.

## గ్రంథాంతరస్థ మృగశీర్షహస్తలక్షణమ్.

ఊర్ధ్వగశ్చతురాంగుష్ఠో మృగశీర్షకరః స్మృతః.　　339
శివం ప్రతితపః కర్తుం ధారయిత్వా త్రిపుణ్డ్రకమ్,
మృగశీర్షో ఽభవద్గౌర్యాః ఋషిరస్య మృకండుజః.　　340
ఋషిజాతి శ్శుభ్రవర్ణో ఽధిదేవస్తు మహేశ్వరః,

తా. చతురహస్తాంగుష్ఠము వెలుపలికెత్తఁబడెనేని మృగశీర్షహస్తమాను. మహేశ్వరునిగూర్చి తపస్సుచేయుటకు పార్వతీదేవి త్రిపుండ్రము నుధరింపఁగా ఈహస్తము పుట్టెను. ఇది ఋషిజాతి. దీనికి ఋషి మార్కండేయుఁడు. వర్ణము తెలుపు. అధిదేవత మహేశ్వరుఁడు.

వినియోగము:—

భిత్తౌవిచారే సమయే ఆవాసే ఛత్రధారణే.　　341
పద్మిన్యామపిశంఖిన్యాం హస్తిన్యాం మందవాచకే,
లేపనే చందనాదీనాం స్త్రీణామభినయక్రమే.　　342

తిరస్కరిణ్యాం సోపానే సాహాత్కారేఽపిచక్రమే,
త్రిపుండ్రధారణేచైవ వితర్కేచ మృగాననే. 343
అస్మదర్థే శరీరేచ సంజ్ఞాపూర్వసమాహృతౌ,
ఋషిజాతౌ శుభ్రవర్ణే మృగశీర్ష కరః స్మృతః. 344

తా. గోడ, విచారము, సమయము, నివాసస్థానము, గోడుగుపట్టుట, పద్మినీ శంఖినీ హస్తినీజాతిస్త్రీలు, మెల్లగాననుట, గందము మొదలగువాని పూఁత, స్త్రీలఅభినయము, త్రిపుండ్రధారణము, వితర్కము, మృగము యొక్కమొగము, నేను అనుట, దేహము, సైగచేగ్రహించుట, ఋషిజాతి, తెల్లవన్నె వీనియందు ఈహస్తము ఉపయోగించును.

౧౮. సింహముఖహస్తలక్షణమ్.



మధ్యమానామికాగ్రాభ్యా
మఙ్గుష్ఠో మిశ్రితో యది,
శేషౌ ప్రసారితౌ యత్ర
స సింహ ముఖఈరితః. 345

తా. నడిమివ్రేలు ఉంగరపువ్రేలు ఈరెంటికొనలను బొటనవ్రేలితోఁ జేర్చి తక్కినవ్రేళ్ళను జాఁచిపట్టినయెడ సింహముఖహస్తమగును.

వినియోగము:—

విద్రుమే మౌక్తికేచైవ సుగన్ధేఽలకస్పర్శనే,
ఆకర్ణనేచ పృషతి మోక్షార్థే హృదిసంస్థితః. 346
హోమేశశే గజేదర్భ చలనేపద్మదామని,
సింహాననే వైద్యపాక శోధనే సింహవక్త్రకః. 347

తా. పగడము, ముత్యము, మంచివాసన, ముంగురులదిద్దుట, వినుట, నీటిబొట్టు, (ఱొమ్మున నిలిపినయెడ) మోక్షవిషయము, హోమము, కుందేలు, ఏనుఁగు, దర్భనువిదలించుట, తామరపూలదండ, సింహముయొక్క మొగము, వైద్యుఁడు, మందు, వంటనుశోధించుట వీనియందు ఈహస్తము వినియోగించును.

## ౧౯. లాఙ్గూలహస్తలక్షణమ్.



పద్మకోశేఽనామికాచే
న్నమ్రాలాఙ్గూలకోభవేత్,

తా. పద్మకోశహస్తమందు ఉంగరపువ్రేలు వంచిపట్టిన యెడ లాంగూలహస్తమగును.

వినియోగము:—

లికుచస్య ఫలేబాలా కుచే కల్హారకే తథా,	348
చకోరే క్రముకేబాల కిఙ్కిణ్యాం ఘుటికాదికే,
చాతకేయుజ్యతేచాఽయం లాఙ్గూల కరనామకః.	349

తా. గజనిమ్మపండు, పడుచులచన్నులు, వాసనగల ఎఱ్ఱకలువ, చకోరము, పోక, చిరుగజ్జెలు, రసగుండు మొదలగునవి, చాతకపక్షి వీని యందు ఈహస్తము వినియోగించును.

## గ్రంథాంతరస్థ లాఙ్గూలహస్తలక్షణమ్.

మధ్యమాఙ్గుష్ఠ తర్జన్యః నారికేళాక్షవత్కృతాః,
లాఙ్గూలోఽనామికావక్రా ప్రోక్తా తాచ కనిష్ఠికా.	350

క్షీరోధిజః కాలకూటః గుళికాకృతికఃపురా,
లాఙ్గూలో హరసఞ్జాతో ఋషిః క్రౌఞ్చవిదారణః. 351
సిద్ధజాతిస్స్వర్ణవర్ణః పద్మా తస్యాఽధిదేవతా,

తా. నడిమివ్రేలు, బొటనవ్రేలు, చూపుడువ్రేలు వీనిని టెంకాయ కన్నుల తీరుననిలిపి ఉంగరపువ్రేలినివంచి, చిటికెనవ్రేలినిపైకెత్తిపట్టిన లాంగూలహస్తమగును. ఈహస్తము పూర్వకాలమునందు పాలసముద్రమునందుఁ బుట్టిన కాలకూటవిషమును మ్రింగుటకై శివుఁడు గుళికగాఁ జేసినపట్టినపుడు శివునివలనఁబుట్టినది. దీనికి ఋషి కుమారస్వామి. సిద్ధజాతి. బంగారు వన్నె. అధిదేవత లక్ష్మి.

వినియోగము:—

ద్రాక్షాఫలేచ రుద్రాక్షే చుబుకగ్రహణేఽపిచ. 352
కుచప్రరోహే క్రముకే కిఙ్కిణ్యాముత్పలే ఫలే,
విద్రుమేచ మితగ్రాసే నక్షత్రే బదరీఫలే. 353
వర్తులాయాం మల్లికాదౌ చకోరే చాతకేఽల్పకే,
కరకాయాం సిద్ధజాతౌ హరితక్యాం సువర్ణకే. 354
ఏవమాదిషుయుజ్యేత హస్తోలాఙ్గూలసంజ్ఞకః,

తా. ద్రాక్షపండు, రుద్రాక్ష, గడ్డముపట్టుకొనుట, మొలకచన్ను, పోక, చిరుగజ్జెలు, కలువ, పండు, పగడము, కొద్దిపాటికబళము, నక్షత్రము, రేగుపండ్లు, పట్రువ, మల్లెపువ్వు, చకోరపక్షి, చాతకపక్షి, అల్పవస్తువు, పడగల్లు, సిద్ధజాతి, కరకకాయ, బంగారు ఇవి మొదలగువానియందు ఈహస్తము వినియోగించును.

## ౨౦. సోలపద్మహస్తలక్షణమ్.



కనిష్ఠాద్యా వర్తితాశ్చే
ద్విరళా స్సోలపద్మకః. 355

తా. చిటికెనవ్రేలు మొదలగు వ్రేళ్లు సందులు గల విగా త్రిప్పి పట్టఁబడినయెడ సోలపద్మహస్తమగును.

వినియోగము:—

వికచాబ్జేకపిత్థాది ఫలేఽప్యావర్తకే కుచే,
విరహేముకురే పూర్ణచంద్రే సౌందర్యభాజనే. 356

ధమ్మిల్లే చంద్రశాలాయాం గ్రామేఽప్యుద్ధతకోపయోః,
తటాకే శకటే చక్రవాకే కలకలారవే. 357

శ్లాఘనే సోలపద్మశ్చ కీర్తితో భరతాగమే,

తా. విరిసినతామర, వెలగ మొదలగుపండు, తిరుగుడు, చన్ను, ఎడబాటు, అద్దము, పూర్ణచంద్రుఁడు, సౌందర్యపాత్రము, కొప్పు, మేడమీఁదియిల్లు, ఊరు, ఎత్తు, కోపము, చెరువు, బండి, చక్రవాకపక్షి, కలకధ్వని, మెప్పు వీనియందు ఈహస్తము వినియోగించును.

### గ్రంథాంతరస్థ సోలపద్మహస్తలక్షణమ్.

వ్యావృత్తికరణం యత్ర సభ వేదలపల్లవః. 358

వ్యావృత్తహస్తః కలశనవనీతముషఃపురా,
జజ్ఞేఽలపల్లవః కృష్ణాత్ వసంతో ఋషిరుచ్యతే 359

గంధర్వజాతి శ్యామాంశురధీశోఽస్య దినేశ్వరః,

తా. వ్రేళ్ళనువిరళముగఁద్రిప్పినయెడ అలపల్లవహస్తమగును. ఈ యలపల్లవహస్తము పూర్వము పాలు వెన్నలుదొంగిలించిన కృష్ణునివలనఁ బుట్టెను. ఇది గంధర్వజాతి. దీనికి వసంతుఁడు ఋషి. శ్యామమువర్ణము. సూర్యుఁడు అధిదేవత.

వినియోగము:—

హైయంగవీనే విరహే మౌళౌ మోదకభావనే. 360
ఫుల్లపద్మేచ మంజర్యాం కిరీటే వర్తులేఽపిచ,
శ్లాఘాయాం రూపసౌందర్యే నర్తనే దుర్గసౌధయోః.361
ధమ్మిల్లే చంద్రశాలాయాం మాధుర్యే సాధువాదనే,
నియుజ్యతే తాళఫలే హస్తోఽయమలపల్లవః. 362

తా. అప్పుడుకాఁచిననెయ్యి, విరహము, తల, కుడుమునుజూపుట, వికసించిన తామరపువ్వు, పూఁబత్తి, కిరీటము, వర్తులము, శ్లాఘించుట, ఆకృతి, చక్కఁదనము, నర్తనము, కోట, మేడ, కొప్పు, మేడమీఁదియిల్లు, మాధుర్యము, బాగుబాగు అనుట, తాటిపండు వీనియందు ఈహస్తము వినియోగించును.

౨౧. చతురహస్తలక్షణమ్.



తర్జన్యాద్యాస్త్రయశ్శ్లిష్టాః
కనిష్ఠా ప్రసృతా యది,
అంగుష్ఠోఽనామికా మూలే
తిర్యక్చే చ్చతురఃకరః. 363

తా. తర్జని మొదలైన మూఁడువ్రేళ్ళను జేర్చి చిటికెనవ్రేలును చాఁచి అంగుష్ఠమును అనామికమూలమందడ్డముగనుంచిపట్టిన చతురహస్తమగును.

వినియోగము:—

కస్తూర్యాం కించిదప్యర్థే స్వర్ణతామ్రాదిలోహకే,
ఆర్ద్రే ఖేదే రసాస్వాదే లోచనే వర్ణభేదకే.    364
ప్రమాణే సరసే మందగమనే శకలీకృతే,
ఆసనే ఘృతతైలాదౌ యుజ్యతే చతురః కరః.    365

తా. కస్తూరి, కొంచెమనుట, బంగారు రాగి మొదలగులోహములు, తడి, ఖేదము, రసాస్వాదము, కన్ను, వర్ణభేదము, ప్రమాణము, సారస్యము, మెల్లగనడచుట, తునుక, ఎత్తుపీఁట, నేయి నూనె మొదలగుద్రవవస్తువులు వీనియందు ఈహస్తము వినియోగించును.

## గ్రంథాంతరస్థ చతురహస్తలక్షణమ్.

యత్రాఽంగుష్ఠః పతాకస్య మధ్యమామధ్యపర్వగః,
కనిష్ఠికా బహిర్యాతా చతురం తం కరం విదుః.    366
అమృతం హర్తుమనసమాత్మాను మతికాంక్షిణమ్,
సుధాం హరేతి హస్తేనగరుడమ్ప్రేతజల్పతః.    367
కాశ్యపాచ్చతురో జాతః వాలఖిల్యో మహాఋషిః,
చిత్రవర్ణో మిశ్రజాతిః వైనతేయశ్చ దేవతా    368

తా. పతాకహస్తమునందలి అంగుష్ఠమును నడిమివ్రేలి నడిమిగణుపునందు పొందించి చిటికెనవ్రేలిని బయటచాఁచిపట్టఁబడినది చతురహస్తమనఁబడును. ఇది పూర్వకాలమునందు అమృతమును హరించుటకై తన యభిమతమున పేక్షించు గరుత్మంతునికి సుధను హరింపుమని హస్తముచేత జాడచూపిన కశ్యపునివలనఁబుట్టెను. ఇది మిశ్రజాతి. దీనికి వాలఖిల్యుఁడు ఋషి. చిత్రవర్ణము. వైనతేయుఁడు దేవత.

వినియోగము:—

గోరోచనాయాంధూళ్యాంచ సరసేఽలక్తకేఽపిచ,
చిత్తావధానే కర్పూరే లోచనే చుబుకే తథా. 369
తాటఙ్కేవదనేఫాలే కటాక్షేచ ప్రియేనయే,
కస్తూర్యాం శర్కరాయాంచ తైలే మధునిసర్పిషి. 370
చాతుర్యేదర్పణేస్వర్ణే వజ్రేమరతకేఽపిచ,
ఇయత్తాయామీషదర్థేవస్తూనాం మితదర్శనే. 371
నీలశ్వేతాదివర్ణేషు మిశ్రజాతౌచ శాద్వలే,
గండస్థలే పాలికాయాం ద్రష్టవ్యశ్చతురఃకరః. 372

తా. గోరోచనము, దుమ్ము, సరసము, లత్తుక, మనసునునిలుపుట, కర్పూరము, కన్ను, గడ్డము, కమ్మ, ముఖము, నొసలు, కడకంటిచూపు, ప్రియవస్తువు, నయము, కస్తూరి, చక్కెర, నూనె, తేనె, నెయ్యి, నేర్పు, అద్దము, బంగారు, రవ, పచ్చ, ఇంతఅనుట, కొంచెమనుట, వస్తువులను మితముగాఁజూచుట, నలుపు తెలుపు మొదలగువన్నెలు, మిశ్రజాతి, పచ్చిక నేల, చెక్కిలి, పాలిక వీనియందు ఈహస్తము చెల్లును.

౨౨. భ్రమరహస్తలక్షణమ్.



మధ్యమాఙ్గుష్ఠసంస్పర్శే
తర్జనీ వక్రితా యది,
శేషౌ ప్రసారితౌ యత్ర
భ్రమరాభిధహస్తకః 373

తా. నడిమివ్రేలిచేత బొటనవ్రేలినితాఁకి చూపుడువ్రేలినివంచి తక్కి-నవ్రేళ్లను చాఁచిపట్టినయెడ భ్రమరహస్తమగును.

వినియోగము:—

భ్రమరేచశుకేయోగే సారసే కోకిలాదిషు,
భ్రమరాభిధహస్తోఽయం కీర్తితో భరతాగమే. **374**

తా. తుమ్మెద, చిలుక, యోగాభ్యాసము, బెగ్గురుపక్షి, కోయిల మొదలైనపక్షులు వీనియందు ఈహస్తము వినియోగించును.

## గ్రంథాంతరస్థ భ్రమరహస్తలక్షణమ్.

హంసాస్యతర్జనీనమ్రాయదిస్యాద్భ్రమరఃకరః,
కర్ణపూరంరచయతో దేవమాతుః కదాచన. **375**
కశ్యపాద్భ్రమరోజాతః కపిలో ఋషిరుచ్యతే,
మేచకఃఖచరోజాతిః పక్షిరాజోఽధిదేవతా. **376**

తా. హంసాస్యహస్తమునందలి చూపుడువ్రేలువంచిపట్టునెడ భ్రమరహస్తమగును. ఇది పూర్వమందు కశ్యపబ్రహ్మ అదితిదేవికి కమ్మలుచేయుచున్నపుడు ఆయనవలనఁబుట్టినది. ఇది గంధర్వజాతి. దీనికి ఋషి కపిలుఁడు. చామనచాయ. పక్షిరాజు అధిదేవత.

వినియోగము:—

యోగే మౌనవ్రతే శృంగేగజదన్తనిరూపణే,
దీర్ఘనాళప్రసూనానాం గ్రహణే భ్రమరేఽపిచ. **377**
కర్ణమంత్రస్వరచనే కంకోటద్ధరణేఽపిచ,
నీవీమోక్షేద్వ్యక్షరాణామవ్యయానాం నిరూపణే. **378**
ఖేచరేమేచకేవర్ణే భ్రమరోఽయం నియుజ్యతే,

తా. యోగాభ్యాసము, మౌనవ్రతము, కొన, ఏనుఁగుదంతమున జూపుట, నిడుకాడగలపువ్వులను పట్టుకొనుట, కర్ణమంత్రము చెప్పుట ముల్లుతీయుట, పోకముఁడి విప్పుట, రెండక్షరముల అవ్యములను నిరూపించుట, ఆకాశమునందు తిరిగెడిప్రాణి, చామనచాయ వీనియందు ఈహస్తము వినియోగించును.

## ౨౩. హంసాస్యహస్తలక్షణమ్.



మధ్యమాద్యాస్త్రయోఽంగుళ్యః
ప్రసృతా విరళా యది. 379
తర్జన్యంగుష్ఠసంయోగే
హంసాస్యకర ఈరితః,

తా. నడిమివ్రేలు మొదలు మూఁడువ్రేళ్లను ఎడముగలవిగాచాఁచి అంగుష్ఠమును చూపుడువ్రేలితోఁ జేర్చిపట్టినయెడ హంసాస్యహస్తమగును.

వినియోగము:—

మాఙ్గళ్యసూత్రబంధేచాఽప్యుపదేశే వినిశ్చయే. 380
రోమాఞ్చేమౌక్తికాదౌచ చిత్రసంలేఖనేతథా,
దంశేతుజలబిందౌచ దీపవర్తిప్రసారణే. 381
నికషేశోధనేమల్లికాదౌ రేఖావిలేఖనే,
మాలాయాంవహనేసోఽహం భావనాయాంచరూపకే. 382
నాస్తీతివచనేచాపి నికషాణాంచ భావనే,
కృతకృత్యేఽపిహంసాస్యః ఈరితో భరతాగమే. 383

తా. బొట్టుకట్టుట, ఉపదేశము, నిశ్చయము, గగుర్పాటు, మృత్యము మొదలైనవి, చిత్రము వ్రాయుట, అడవియగు, నీటిబొట్టు, దీపపువత్తి నెగఁద్రోయుట, ఒరయుట, శోధించుట, మల్లెమొగ్గలు మొదలైనవి, గీత గీయుట, పూలదండపట్టుకొనుట, నేనే బ్రహ్మమనుట, రూపించుట, లేదనుట, ఒరసి చూడఁదగినవస్తువులను భావించుట, కృతకృత్యము వీనియందు ఈహస్తము వినియోగించును.

## గ్రంథాంతరస్థ హంసాస్యహస్తలక్షణమ్.

శ్లిష్టాగ్రమధ్యమాఙ్గుష్ఠ తర్జన్యో యత్రసారితౌ,
అనామికా కనీయాంసౌ సహంసాస్య కరోభవేత్. 384
న్యగ్రోధమూలమాశ్రిత్య మునీనాం తత్త్వదర్శనే,
హంసాస్యో దక్షిణామూర్తేరాసీదస్య ఋషిశ్శుకః. 385
శుభ్రవర్ణో విప్రజాతిరధిశ శ్చతురాననః,

తా. బొటనవ్రేలిని చూపుడు నడిమివ్రేళ్ళను చేర్చి, ఉంగరపువ్రేలిని చిటికెనవ్రేలిని చాఁచిపట్టినయెడ హంసాస్య హస్తమవును. ఇది మఱ్ఱిమాని క్రింద మునులకు జ్ఞానోపదేశము చేయునప్పుడు దక్షిణామూర్తివలనఁ బుట్టెను. ఇది విప్రజాతి. దీనికి శుకుఁడు ఋషి. వర్ణము తెలుపు. బ్రహ్మ అధిదేవత.

వినియోగము:—

జ్ఞానోపదేశే పూజాయాం నిర్ణయేచతిలాహుతౌ. 386
భాషణేపఠనే గానే ధ్యానేభావనిరూపణే,
రచనేయావకాదీనాం పులకేమౌక్తికేమణౌ. 387
వేణునాదే సంయుతశ్చేద్వాసనాయాం నిజాత్మని,

జలబిందౌ లక్ష్యభావే ముద్రికాయాంచ చుమ్బనే. 388
విప్రజాతౌ శుభ్రవర్ణే హంసాస్యః పరికీర్తితః,

తా. జ్ఞానోపదేశము, పూజచేయుట, నిర్ణయించుట, తిలాహుతి, మాటలాడుట, చదువుట, పాడుట, ధ్యానముచేయుట, భావములను నిరూపించుట, లత్తుక మొదలైనవానిని పెట్టుట, గగుర్పాటు, ముత్యము, రత్నము, పిల్లనగ్రోవియూదుట, వాసనచూచుట, మనస్సు, నీటిబొట్టు, గురిపెట్టుట, ముద్దుటుంగరము, ముద్దుపెట్టుట, బ్రాహ్మణజాతి, తెల్లవన్నె వీనియందు ఈహస్తము వినియోగించును.

౨౪. హంసపక్షహస్తలక్షణమ్.



సర్పశీర్షకరే సమ్య
క్కనిష్ఠా ప్రసృతా యది. 389
హంసపక్షకరస్సోఽయం
తన్నిరూపణ ముచ్యతే,

తా. సర్పశీర్షహస్తమునందలి చిటికెనవ్రేలిని బాగుగా చాఁచిపట్టిన యెడ హంసపక్షహస్తమగును.

వినియోగము:—

షట్సంఙ్ఞాయాం సేతుబంధే నఖరేఖాఙ్కనే తథా. 390
విధానేహంసపక్షోఽయం కీర్తితో భరతాగమే,

తా. ఆరు అనెడి లెక్క, కట్టకట్టుట, గోటినొక్కుగురుతు, ఏదేనొక పనిచేయుట వీనియందు ఈహస్తము వినియోగించును.

### గ్రంథాంతరస్థ హంసపక్షహస్తలక్షణమ్.

కనిష్ఠా సర్పశీర్షేసా సారితా హంసపక్షకః    391
తాండవాభ్యసనే హంసపక్షాకారః కరః స్మృతః,
తండోర్జాతో హంసపక్షః భరతో ఋషిరుచ్యతే.    392
నీలవర్ణోఽప్సరోజాతి రధీశః పఞ్చసాయకః,

తా. సర్పశీర్ష హస్తమునందలి చిటికెనవ్రేలిని చాఁచిపట్టినయెడ హంసపక్ష హస్తమగును. శివుని సన్నిధియందు తండువు తాండవము నభ్యసించునపుడు హంసరెక్కవలె చేతిని పట్టెను గనుక ఆతండువువలన హంసపక్షహస్తము పుట్టెను. ఇది అప్సరోజాతి. దీనికి ఋషి భరతుఁడు. వర్ణము నీలము. మన్మథుఁడు అధిదేవత.

వినియోగము:—

శుభనాట్యే సేతుబంధే వీణావాదే సమాహృతౌ.    393
నియంత్రణే పక్షిపక్షే పర్యాప్తౌ రూపలేఖనే,
శ్యామవర్ణేఽప్సరోజాతౌ హంసపక్షో నియుజ్యతే.    394

తా. శుభనాట్యము, నీళ్ళకు అడ్డకట్టకట్టుట, వీణవాయించుట, సంగ్రహించుట, కట్టుట, పక్షిరెక్క, ముగియుంట, చిత్రరువువ్రాయుంట, నలుపువన్నె, అప్సరోజాతి వీనియందు ఈహస్తము వినియోగించును.

### ౨౫. సందంశహస్తలక్షణమ్.



పునఃపునః పద్మకోశే
సంశ్లిష్టా ప్రసృతా యది,
సందంశాభిధహస్తోఽయం
కీర్తితో భరతాగమే.    395

తా. ముందుచెప్పిన పద్మకోశహస్తము వ్రేళ్ళను మాటిమాటికి చేర్చి విడిచిపెట్టుచుండినయెడ సందంశ హస్తమగును.

వినియోగము:—

ఉదారే బలిదానేచ వ్రణే కీటె మనోభయే,
అర్చనే పఞ్చసఙ్ఖ్యే సందంశాఖ్యోఽభిధీయతే. 396

తా. త్యాగము, బలియిచ్చుట, పుండు, పురుగు, మనస్సునందలి భయము, అర్చించుట, అయిదు అనుట వీనియందు ఈహస్తము వినియోగించును.

గ్రంథాంతరస్థ సందంశహస్తలక్షణమ్.

హంసాస్య మధ్యయా బాహ్యే యది సందంశకో భవేత్,
యేనాఽక్షమాలావాగ్దేవ్యాధృత్రహస్తాద్యత స్తతః. 397
సందంశోభారతేర్జాతో ఋషిర్విశ్వావసుః స్మృతః,
విద్యాధరాన్వయోగౌరః వాల్మీకిరధిదేవతా. 398

తా. హంసాస్యహస్తమందలి నడిమివ్రేలు చాచిపట్టినయెడ సందంశ హస్తమగును. సరస్వతీదేవి అక్షమాలధరింపఁగా నామెవలన ఈ సందంశ హస్తముపుట్టెను. ఇది విద్యాధరజాతి. దీనికి ఋషి విశ్వావసుఁడు. వర్ణము గౌరము. అధిదేవత వాల్మీకి.

వినియోగము:—

రదనేసూక్ష్మముకుళేసజ్జీ తేలాస్యవ ర్తనే,
టీకాయాంజ్ఞానముద్రాయాం తులాయాంరదనవ్రణే 399
యజ్ఞోపవీతే రేఖాయాంశోధనే చిత్రలేఖనే,
సత్యేనాస్తీతివచనే కిఞ్చిదర్థేక్షణేశ్రుతౌ. 400
నికషేకనకాదీనాంశితేల త్త్యేనఖేఽఙ్కురే,

గుఞ్జాయామష్టసంఖ్యాయామింద్రగోపేవిషేతృణే. 401
పిపీలికాయాం మశకే గ్రహణే మౌక్తికస్రజామ్,
మత్కుణే మక్షికే మాల్యే రోమావళ్యాంచ సూచనే.
విజనే స్పర్శనే వేదే తుహినే భాషణేచ్యుతే,
క్షతే నఖక్షతే రత్నే యాచకే తిలకేఽంజనే. 403
విద్యాధరాన్వయే గౌరేమందే సందంశ ఈరితః,

తా. పల్లు, సన్నని మొగ్గ, పాట, లాస్యము, టీక (పదములయొక్క అర్థము వివరణము) జ్ఞానముద్ర, త్రాసుపట్టుట, దంతక్షతము, జందెము, గీర, శోధించుట, చిత్రమువ్రాయుట, నిజము, లేదనుట, ఇంచుకయనుట, క్షణకాలమనుట, వినుట, బంగారు మొదలైనవానిని ఒరయుట, గురి, గోరు, మొలక, గురిగింజ, ఎనిమిదింటిలెక్క, పట్టుపురుగు, విషము, గడ్డిపోచ, చీమ, దోమ, ముత్యాలపేరు కెత్తుట, నల్లి, ఈగ, పూలదండ, నూగారు, జాడ, ఏకాంతము, తాకుట, వేదము, మంచు, మాటలాడుట, జారుట, గాయము, నఖక్షతము, రత్నము, యాచకుడు, బొట్టు, కాటుక, విద్యాధరవంశము, గౌరవర్ణము, మెల్లనిది వీనియందు ఈహస్తము ఉపయోగించును.

౨౬. ముకుళహస్తలక్షణమ్.



అంగులీ పఞ్చకంచైవ
మిళిత్వాఽగ్రే ప్రదర్శనే.
ముకుళాభిధహస్తోఽయం
కీర్తితో భరతాగమే, 404

తా. అయిదువ్రేళ్ళనుచేర్చి పట్టఁబడునది ముకుళహస్త మనఁబడును.

వినియోగము:—

కుముదే భోజనే పఞ్చబాణే ముద్రాదిధారణే. 405
నాభౌచ కదలీ పుష్పే యుజ్యతే ముకుళఃకరః,

తా. కలువపువ్వు, భోజనము చేయుట, మన్మథుఁడు, ముద్రలు ధరించుట, బొడ్డు, అరఁటిపువ్వు వీనియందు ఈహస్తము వినియోగించును.

గ్రంథాంతరస్థ ముకుళహస్తలక్షణమ్.

శ్లిష్టాంగుళిః పద్మకోశో యదిస్యాన్ముకుళఃకరః. 406
భానుం ప్రగృహ్ణాతః పూర్వం బిమ్బమే వేతిశఙ్కయా,
మారుతేర్ముకుళో జాతః ఋషిస్తస్యవిశాఖిలః. 407
సఙ్కీర్ణజాతిఃకపిలవర్ణశ్చంద్రోఽధిదేవతా,

తా. పద్మకోశ హస్తముయొక్క వ్రేళ్ళను చేర్చిపట్టినయెడ ముకుళ హస్తమవును. పూర్వము ఆంజనేయుఁడు దొండపండనెడి శంకచేత సూర్యుని పట్టఁబోయినపుడు ఆతనివలన ఈముకుళహస్తము పుట్టెను. ఇది సంకీర్ణజాతి. దీనికి విశాఖిలుఁడు ఋషి. కపిలవర్ణము. చంద్రుఁడు అధిదేవత.

వినియోగము:—

దానే జపే దీనవాక్యే భోజనే పద్మకోశకే. 408
ఆత్మనిప్రాణనిర్దేశే పఞ్చసఙ్ఖ్యానిరూపణే,
కాముకోచ్చరితే బాలచుమ్బనే దేవపూజనే. 409
ఛత్రాదీనాంచ ముకుళే ఫలగ్రహనిరూపణే,
సఙ్కీర్ణజాత్యాం కపిలే ముకుళఃకరఈరితః. 410

తా. దానము, జపము, దీనవాక్యము, భోజనము, తామరమొగ్గ, ఆత్మ, ప్రాణములను నిర్దేశించుట, అయిదనుట, కాముకునిమాట, బిడ్డలను ముద్దుపెట్టుకొనుట, దేవపూజ, గొడుగు మొదలగువానియొక్క మడుగు, ఫలములను గ్రహించుట, సంకీర్ణజాతి, కపిలవర్ణము వీనియందు ఈహస్తము వినియోగించును.

### ౨౭. తామ్రచూడహస్తలక్షణమ్.



ముకుళే తామ్రచూడస్స్యా
త్తర్జనీ వక్రితా యది,

తా. ముకుళ హస్తమునందలి తర్జనిని వంచిపట్టినయెడ తామ్రచూడ హస్తమగును.

వినియోగము:—

కుక్కుటాదౌ బకే కాకేఽప్యుష్ట్రే వత్సేచ లేఖనే.    411
తామ్రచూడకరాఖ్యోఽసౌ కీర్తితో భరతాగమే,

తా. కోడి మొదలైనది, కొంగ, కాకి, ఒంటె, దూడ, వ్రాయుట వీనియందు ఈహస్తము వినియోగించును.

### గ్రంథాంతరస్థ తామ్రచూడహస్తలక్షణమ్.

పతాకస్య కనిష్ఠాయాం యత్రాఽంగుష్ఠనిపీడనమ్.    412
తమేవ తామ్రచూడాఖ్యం వదంతి భరతాదయః,

తా. పతాకహస్తమునందలి చిటికెనవ్రేలిని బొట్టనవ్రేలు తాఁకినయెడ తామ్రచూడ హస్తమగును.

తేషాం మూర్తిత్రయీభావః ఋగ్యజుస్సామభిఃపురా.
యేన హస్తేనాఽభినీతో విధేరగ్రే యతస్తతః,
తామ్రచూడః త్రయీజాతః తస్యవజ్రాయుధో ఋషిః.
శఙ్ఖవర్ణో దేవజాతిరధిదేవో బృహస్పతిః,

తా. ఇది పూర్వము ఆకృతులను ధరించిన మూఁడువేదములు బ్రహ్మ యెదుట నిలిచి తమ యభిప్రాయమును తెలుపునపుడు వానివలనఁబుట్టెను. ఇది దేవజాతి. దీనికి దేవేంద్రుఁడు ఋషి. శంఖవర్ణము. బృహస్పతి అధిదేవత.

వినియోగము:—

లోకత్రయే త్రిశూలేచ త్రిసఙ్ఖ్యా గణనేఽపిచ. 415
అశ్రుసమ్మార్జనే వేదత్రయే బిల్వదళేఽపిచ,
దేవజాతౌ శుభ్రవర్ణే తామ్రచూడో నియుజ్యతే. 416

తా. మూఁడులోకములు, శూలాయుధము, మూఁడని లెక్కపెట్టుట, కన్నీరుతుడుచుట, మూఁడువేదములు, మారేడుపత్రి, దేవజాతి, తెల్లవన్నె వీనియందు ఈహస్తము వినియోగించును.

౨౮. త్రిశూలహస్తలక్షణమ్.



నికుఞ్చయిత్వాఽఙ్గుష్ఠంతు
కనిష్ఠఞ్చ త్రిశూలకః,

తా. బొటనవ్రేలిని చిటికెనవ్రేలిని వంచి తక్కిన వ్రేళ్లను చాఁచిపట్టినది త్రిశూల హస్తమనఁబడును.

వినియోగము:—

బిల్వపత్రే త్రిత్వయుక్తే త్రిశూలః కరఈరితః. 417

తా. మారేడుపత్రి, మూఁటికూడిక వీనియందు ఈహస్తము వినియోగించును.

ఇత్యష్టావింశతిః ప్రోక్తా అసంయుతకరాః క్రమాత్,
యావదర్థాః ప్రయోగాణాం తావద్భేదాః కరాః స్మృతాః.

తా. ఈచెప్పఁబడిన యిరువదియెనిమిదిహస్తములును అసంయుతహస్తము లనఁబడును. ఈహస్తముల ప్రయోగార్థములు ఎన్నికలవో అన్నిహస్తభేదములును గలవని చెప్పుదురు.

గ్రంథాంతరే ఊర్ణనాభహస్తలక్షణమ్.

పద్మకోశాఙ్గుళీనాంచ కుఞ్చనాదూర్ణనాభకః,
హస్తాభ్యాం కుర్వతః పూర్వం దైత్యవక్షో విదారణమ్.419
నృసింహాదూర్ణనాభశ్చ జాతశ్శార్దూలకోఋషిః,
క్షత్త్రాన్వయోరక్తకాంతిరాదికూర్మోఽధిదేవతా. 420

తా. పద్మకోశహస్తము వ్రేళ్ళను వంచిపట్టినయెడ ఊర్ణనాభహస్తమవును. ఇదిపూర్వము నృసింహస్వామి హిరణ్యాకశిపునిరొమ్మును నఖములచేత చీల్చునపుడు నృసింహస్వామివలనఁబుట్టెను. ఇది క్షత్త్రియజాతి. దీనికి శార్దూలకుఁడు ఋషి. రక్తవర్ణము. ఆదికూర్మము అధిదేవత.

వినియోగము:—

శిరః కండూయనే చౌర్యే నరసింహే మృగాననే,
హర్యక్షే వానరే కూర్మే కర్ణికారే కుచే భయే. 421

క్షత్త్రజాతౌ రక్తకాంతౌ పూర్ణనాభో నియుజ్యతే,

తా. తలగోకుకొనుట, దొంగతనము, నరసింహుఁడు, మృగముఖము, సింహము, కోఁతి, తాబేలు, కొండగోగు, స్తనము, భయము, క్షత్త్రియ జాతి, ఎఱ్ఱవన్నె వీనియందుఁ ఈహస్తము చెల్లును.

గ్రంథాంతరే బాణహస్తలక్షణమ్.

తర్జన్యాద్యా స్త్రయశ్శ్లిష్టాః కిఞ్చిదఙ్గుష్ఠ పీడితాః. 422
కనిష్ఠికాచ ప్రసృతా సబాణః కథితః కరః.
షట్సఙ్ఖ్యాయాం నాళనృత్యే బాణహస్తో నియుజ్యతే 423

తా. చూపుడువ్రేలు మొదలు మూఁడువ్రేళ్ళను బొటనవ్రేలితో చేర్చి చిటికెనవ్రేలిని చాఁచిపట్టినయెడ బాణహస్తము. ఇది ఆఱు అని లెక్క పెట్టుటయందును నాళనృత్యమునందును వినియోగించును.

గ్రంథాంతరే అర్ధసూచికహస్తలక్షణమ్.

కపిత్థ తర్జన్యాశ్చోర్ధ్వ సారణాదర్ధసూచికః,
అఙ్కురే పక్షిశాబాదౌ బృహత్కీటే నియుజ్యతే. 424

తా. కపిత్థహస్తపుచూపుడువ్రేలు పొడువుగా ఎత్తిపట్టఁబడినయెడ అర్ధసూచికహస్తమగును. ఇది మొలక, పక్షి పిల్ల మొదలగునది, పెద్దపురుగు వీనియందు వినియోగించును.

అథ చతుర్వింశతిసంయుతహస్తానిరూప్యంతే.

అంజలిశ్చ కపోతశ్చ కర్కటస్స్వస్తిక స్తథా,
డోలాహస్తః పుష్పపుటశ్చోత్సంగశ్శివలిఙ్గకః. 425

కటకావర్ధనశ్చైవ కర్తరీ స్వస్తికాభిధః,
శకటశ్శఙ్ఖచక్రౌచ సమ్పుటః పాశకీలకౌ. 426
మత్స్యకూర్మవరాహాశ్చ గరుడో నాగబన్ధకః,
ఖట్వా భేరుణ్డకాఖ్యశ్చ అవహిత్థస్తథైవచ. 427
చతుర్వింశతిసంఖ్యాకా స్సంయుతాః కథితాః కరాః,

తా. అంజలి, కపోతము, కర్కటము, స్వస్తికము, డోల, పుష్పపుటము, ఉత్సంగము, శివలింగము, కటకావర్ధనము, కర్తరీస్వస్తికము, శకటము, శంఖము, చక్రము, సంపుటము, పాశము, కీలకము, మత్స్యము, కూర్మము, వరాహము, గరుడము, నాగబంధము, ఖట్వ, భేరుండము, అవహిత్థము అనునీయిరువదినాలుగుహస్తములు సంయుతహస్తములు.

## గ్రంథాంతరే.

అసంయుతానాం సంయోగాత్సంయుతాఖ్యా భవంతి తే.
తేషాముత్పత్తిరేవైషా యోజనీయా మతా బుధైః,
తథాఽపి ద్వన్ద్వతా భేదాదధిదేవః పృథక్పృథక్. 429

తా. అసంయుతహస్తముల సంయోగమువలన సంయుతహస్తములవును. అసంయుతహస్తముల ఉత్పత్తియే సంయుతములకును కాని అధిదేవతలు వేరువేరు.

## ౧. అంజలిహస్తలక్షణమ్.

పతాకతలయోర్యోగా దంజలిః కరఈరితః,

తా. రెండుపతాకహస్తముల అరచేతులఁజేర్చిన నది యంజలిహస్తమనఁబడును.

వినియోగము:—

దేవతాగురువిప్రాణాం నమస్కారేఽప్యనుక్రమాత్. 430
కార్యశ్శిరోముఖోరస్సు వినియోజ్యోఽంజలిః కరః,

తా. దేవతలకును, గురువులకును, బ్రాహ్మణులకును, నమస్కారము చేయుటయందు ఈహస్తము చెల్లును. అందు దేవతలకు మ్రొక్కునపుడు శిరస్సునందును, గురువులకు మ్రొక్కునపుడు ముఖమునందును, బ్రాహ్మణులకు మ్రొక్కునపుడు రొమ్మునందును క్రమముగా నొప్పును.

గ్రంథాంతరస్థాంజలిహస్తలక్షణమ్.

పతాకహస్తతలయోస్సంశ్లేషో యత్ర జాయతే. 431
తమాహురంజలింహస్తం క్షేత్రపాలోఽధిదేవతా,

తా. రెండుపతాకహస్తముల అరచేతులు చేర్చిపట్టఁబడునెడ అంజలిహస్తమగును. దీనికి అధిదేవత క్షేత్రపాలుఁడు.

వినియోగము:—

ప్రణామే వినయే తాలఘాతే శమ్భునిరూపణే. 432
కిఙ్కరోమీతి వదనే ధ్యానే చాఽంజలిరుచ్యతే,

తా. నమస్కరించుట, వినయముతో వంగుట, తాళము వేయుట, శివస్వరూపమును నిరూపించుట, కింకరుఁడ ననుట, ధ్యానము చేయుట వీనియందు ఈహస్తము చెల్లును.

౨. కపోతహస్తలక్షణమ్.

కపోతస్సకరో జ్ఞేయ శ్శ్లిష్టమూలాగ్రపార్శ్వతః. 433

తా. ముందుచెప్పిన అంజలిహస్తము మొదలుతుదలు పార్శ్వభాగములు చేరియుండునట్లు పట్టఁబడినయెడ కపోతహస్తమగును.

వినియోగము:—

ప్రమాణ గురుసమ్భాషా వినయాఙ్గీకృతిష్వయమ్,

తా. ప్రమాణము, పెద్దలతోమాటలాడుట, వినయము ఒప్పుకొనుట వీనియందు ఈహస్తము వినియోగించును.

గ్రంథాంతరస్థకపోతహస్తలక్షణమ్.

అంజలేరంతరం యత్ర జాయతే విరళీకృతమ్. 434
స భవేత కపోతాఖ్యశ్చిత్రసేనోఽధిదేవతా,

తా. అంజలిహస్తముయొక్క అంతరము విరళముగా పట్టఁబడినయెడ కపోతహస్తమవును. దీనికి అధిదేవత చిత్రసేనుఁడు.

వినియోగము:—

అంగీకారే నారికేళ పూగహింతాళపాళిషు. 435
కదళీకుసుమే శీతే వినతే వస్తుసంగ్రహే,
నమ్పుటేమాతులుంగేచ కపోతో వినియుజ్యతే. 436

తా. అంగీకారము, టెంకాయ, పోక, హింతాళము, అరఁటిపూవు, చలి, వినయము, వస్తువులను సంగ్రహించుట, సంపుటము, మాదీఫలము వీనియందు ఈహస్తము వినియోగపడును.

3. కర్కటహస్తలక్షణమ్.

అన్యోన్యస్యాఽన్తరే త్రాఽఙ్గుళ్యోనిసృతహస్తయోః,
అంతర్బహిర్వావర్తంతే కర్కటస్సోఽభిధీయతే. 437

తా. ముందుచెప్పిన కపోతహస్తమందు వ్రేలివ్రేలిసందునను వ్రేళ్లుచొప్పించి వెలికిఁగాని లోపలికిఁగాని చాఁచిపట్టఁబడునెడల కర్కటహస్తమగును.

వినియోగము:—

సమూహ దర్శనే తుంద దర్శనే శఙ్ఖపూరణే,
అఙ్గానాం మోటనే శాఖోన్నమనే చ నియుజ్యతే. 438

తా. గుంపునుచూపుట, లావైనదానినిచూపుట, శంఖనాదముచేయుట, ఒడలువిరచుట, చెట్టుకొమ్మనువంచుట వీనియందు ఈహస్తముపయోగించును.

గ్రంథాంతరస్థ కర్కటహస్తలక్షణమ్.

ఊర్ణనాభాంగులీరంధ్రసంశ్లేషే కర్కటో భవేత్,
అస్యాఽధిదైవతం విష్ణుమాది దేవం విదుర్బుధాః. 439

తా. ఊర్ణనాభహస్తముయొక్క వ్రేళ్లసందులందు రెండవచేతి వ్రేళ్లను చొప్పించిపట్టినయెడ కర్కటహస్తమగును. దీనికి విష్ణువు అధిదేవత.

వినియోగము:—

విలాపే జృమ్భణే ఘాతే కర్కటే శంఖపూరణే,
అంగులీమోటనే స్త్రీణాం కర్కటో వినియుజ్యతే. 440

తా. దుఃఖము, ఆవులింత, కొట్టుట, ఎండ్రకాయ, శంఖమును ఊదుట, స్త్రీలు మెటికలువిరుచుట వీనియందు ఈహస్తము వినియోగించును.

౮. స్వస్తిక హస్తలక్షణమ్.

పతాకయోః స్సన్నియుక్త కరయోర్మణిబన్ధయోః,
సంయోగేన స్వస్తికాఖ్యో మకరార్థే నియుజ్యతే. 441

భయవాదే వివాదేచ కీర్తనే స్వస్తికోభవేత్,

తా. రెండుపతాకహస్తములందలి మణికట్టులను జేర్చిపట్టినయెడ స్వస్తికహస్తమగును. ఇది మొసలిని దెలుపుట, భయములో మాటలాడుట, వాదాడుట, పొగడుట వీనియందు ఉపయోగించును.

౫. డోలాహస్తలక్షణమ్.

పతాకావూరుదేశస్థౌ డోలాహస్తోఽయముచ్యతే. 442
నాట్యారమ్భే ప్రయోక్తవ్య ఇతినాట్య విదోవిదుః,

తా. రెండుపతాకహస్తములను తొడమీఁదికి వ్రేలునట్లు పట్టినయెడ డోలాహస్తమగును. ఇది నాట్యారంభమందు వినియోగింపఁదగినది.

గ్రంథాంతరస్థ డోలాహస్తలక్షణమ్.

పతాకౌ పార్శ్వగౌ డోలా భారతీతస్య దేవతా. 443
మోహామూర్ఛా మదాలస్య విలాసాదిషుకీర్తితః,

తా. పతాకహస్తములు ఇరుపార్శ్వములందు వ్రేలునట్లుపట్టఁబడిన యెడ డోలాహస్తమగును. దీనికి దేవతసరస్వతి. ఇది మోహము, మూర్ఛ, మదము, ఆలస్యము, విలాసము మొదలగువానియందు వినియోగించును.

౬. పుష్పపుటహస్తలక్షణమ్.

సంశ్లిష్టౌ సర్పశీర్షౌ చేద్భవేత్పుష్పపుటఃకరః. 444

తా. రెండుసర్పశీర్షహస్తములను మనికట్టు మొదటిచిటికెనవ్రేలివరకుగల అరచేతి అంచులయందుఁ జేర్చినపట్టినయెడ పుష్పపుటహస్తమగును.

వినియోగము:—

నీరాజనవిధౌ బాలఫలాదిగ్రహణే తథా,

సంధ్యాయామర్ఘ్యదానే చ మంత్రపుష్పే నియోజయేత్.

తా. కర్పూరహారతి, బిడ్డలుపండ్లు మొదలైనవానిని దీసికొనుట, సంధ్యాకాలమందు అర్ఘ్యప్రదానము చేయుట, మంత్రపుష్పమిచ్చుట వీనియందు ఈహస్తముపయోగించును.

గ్రంథాంతరస్థ పుష్పపుటహస్తలక్షణమ్.

సర్పశీర్షస్య పార్శ్వేతు అపరఃసర్పశీర్షకః,
ధృతః పుష్పపుటాఖ్యస్స్యా దధీశః కిన్నరేశ్వరః. 446

తా. సర్పశీర్షహస్తముయొక్క పార్శ్వమందు మరియొకసర్పశీర్షమును జేర్చిపట్టినయెడ పుష్పపుటహస్తమవును. దీనికి కిన్నరేశ్వరుఁడు అధిదేవత.

వినియోగము:—

సుమధాన్యఫలాదీనా మర్పణే గ్రహణే తథా,
అర్ఘ్యదానే పుష్పపుటః కీర్తితో భావకోవిదైః. 447

తా. పువ్వులు ధాన్యము పండ్లు మొదలయినవానిని ఇచ్చుట, పుచ్చుకొనుట, అర్ఘ్యప్రదానము వీనియందు ఈహస్తము వినియోగించును.

2. ఉత్సంగహస్తలక్షణమ్.

అన్యోన్యబాహుమూలస్థౌ మృగశీర్షకరౌ యది.
ఉత్సఙ్గనామాహస్తోఽయం కీర్తితో భరతాగమే. 448

తా. రెండు మృగశీర్షహస్తములను పరస్పరము మూపులను సోకునట్లు పట్టునెడ ఉత్సంగహస్తమగును.

వినియోగము:—

ఆలిఙ్గనే చ లజ్జాయా మఙ్గదాదిప్రదర్శనే,

బాలానాం శిక్షణేచాఽయముత్సంగో యుజ్యతేకరః 449

తా. కౌఁగిలింత, సిగ్గు, భుజకీర్తులు మొదలగువానిని జూపుట, బాలురను శిక్షించుట వీనియందు ఈహస్త ముపయోగించును.

గ్రంథాంతరస్థోత్సఙ్గహస్తలక్షణమ్.

అరాళౌస్వస్తికస్కంధా వుత్సఙ్గస్తదధీశ్వరః,
గౌతమో వినియోగస్తు లజ్జాయాం పరిరమ్భణే. 450
అఙ్గీకారే చ శీతే చ సాధ్వర్థే కుచగోపనే,
ఏవమాదిషుయుజ్యంతే ఉత్సంగకరభావనా. 451

తా. అరాళహస్తములను స్వస్తికాకారముగాఁ జేర్చి పట్టునెడ ఉత్సంగ హస్తమగును. దీనికి అధిదేవత గౌతముఁడు. ఇది సిగ్గు. కౌఁగిలింత, అంగీకారము, చలి, మేలనుట, చన్నులను కప్పుకొనుట మొదలగు వాని యందు వినియోగించును.

౮. శివలింగహస్తలక్షణమ్.

వామేఽర్ధచంద్రే విన్యస్తః శిఖరశ్శివలింగకః,
వినియోగస్తుతస్యైవ శివలింగప్రదర్శనే. 452

తా. ఎడమచేతి యర్ధచంద్రహస్తమందు శిఖరహస్తముంచఁబడెనేని శివలింగహస్తమగును. ఇది శివలింగమును జూపుటయందు వినియోగించును.

౯. కటకావర్ధనహస్తలక్షణమ్.

కటకాముఖయోః పాణ్యోస్స్వస్తికా న్మణిబంధయోః,
కటకా వర్ధనాఖ్యస్స్యాదితినాట్య విదోవిదుః, 453

తా. కటకాముఖహస్తములయొక్క మనికట్లు స్వస్తికముగాఁ జేర్చి పట్టఁబడునేని కటకావర్ధన హస్తమగును.

వినియోగము:—

పట్టాభిషేకే పూజాయాం వివాహేఽపియుజ్యతే,

తా. పట్టాభిషేకము, పూజ, పెండ్లిదీవన వీనియందు ఈహస్తము వినియోగించును.

గ్రన్థాంతరస్థ కటకావర్ధనహస్తలక్షణమ్.

కటకా వర్ధనాఖ్యస్స్యా త్స్వస్తికౌ కటకాముఖౌ. 454
తస్య దేవో యక్షరాజో భావజ్ఞైశ్చ నిరూపితః,

తా. కటకాముఖహస్తములను స్వస్తికములుగఁబట్టినయెడల కటకావర్ధన హస్తమగును. దాని కధిదేవత యక్షరాజు.

వినియోగము:—

వినియోగో విచారేచ శృఙ్గారే కోపసాంత్వనే. 455
జక్కిణీనటనే దండలాస్యేభవతి నిశ్చయే,

తా. విచారము, శృంగారము, కోపశాంతి, జక్కిణి అను ఆట, కోలాటము, నిశ్చయము వీనియందు ఈహస్తము వినియోగించును.

౧౦. కర్తరీస్వస్తిక హస్తలక్షణమ్.

కర్తరీ స్వస్తికాకారః కర్తరీ స్వస్తికోభవేత్. 456

తా. కర్తరీముఖహస్తములను స్వస్తికాకారముగఁ బట్టినయెడ కర్తరీస్వస్తిక హస్తమగును.

వినియోగము:—

శాఖాసు చాఽద్రిశిఖరే వృక్షేషుచ నియుజ్యతే,

తా. చెట్టుకొమ్మలు, పర్వతశిఖరము, వృక్షములు వీనియందు ఈ హస్తము ఉపయోగించును.

## ౧౧. శకటహస్తలక్షణమ్.

భ్రమరౌ మధ్యమాఙ్గుష్ఠ ప్రసారాచ్ఛకటోభవేత్. 457
రాక్షసాభినయేచాఽయం నియోజ్యో భరతాదిభిః,

తా. రెండుభ్రమరహస్తములే బొటనవ్రేలిని నడిమివ్రేలిని చాఁచిన యెడ శకట హస్తమగును. ఇది రాక్షసులు మొదలయిన వారల యభినయమునందు చెల్లును.

## ౧౨. శంఖహస్తలక్షణమ్.

శిఖరాన్తర్గతాఙ్గుష్ఠ ఇతరాఙ్గుష్ఠసంగతః, 458
తర్జన్యాద్యాస్తతః శ్లిష్టాశ్శంఖహస్తఃప్రకీర్తితః,
శంఖాదిషు నియోజ్యోఽయమిత్యేవం భరతాదయః. 459

తా. శిఖరహస్తమునందలి యంగుష్ఠముతో రెండవచేతి యంగుష్ఠమును జేర్చి తక్కినవ్రేళ్ళను ఆ శిఖరహస్తము పైకి చేర్చినయెడ శంఖహస్తమగును. ఇది శంఖము మొదలైనవానియందు వినియోగించును.

## ౧౩. చక్రహస్తలక్షణమ్.

యత్రాఽర్ధచంద్రౌతిర్యఞ్చౌ వన్యోన్యతలసంస్పృశౌ,
చక్రహస్తస్స విజ్ఞేయశ్చక్రార్థే వినియుజ్యతే. 460

తా. అర్ధచంద్రహస్తములను అడ్డముగా రెండు అరచేతులను జేర్చి పట్టినయెడ చక్రహస్తమగును. ఇది చక్రమందు చెల్లును.

### ౧౮. సమ్పుటహస్తలక్షణమ్.

కుఞ్చితాఙ్గుళయశ్చక్రే సమ్పుటస్స కరఈరితః,

తా. ముందుచెప్పిన చక్రహస్తమువ్రేళ్ళను ముడిచిపట్టినయెడ సంపుటహస్త మగును.

వినియోగము:—

వస్త్వాచ్ఛాదే సమ్పుటేచ సమ్పుటస్స కరఈరితః. 461

తా. వస్తువులను దాఁచుటయందును,సంపుటమందును హస్తము చెల్లును.

### ౧౯. పాశహస్తలక్షణమ్.

సూచ్యానికుఞ్చితే శ్లిష్టే తర్జన్యౌపాశ ఈరితః,

తా. సూచీహస్తముల చూపుడువ్రేళ్ళను వంచిచేర్చిపట్టినయెడ పాశహస్తమగును.

వినియోగము:—

అన్యోన్య కలహేపాశే శృంఖలాయాం నియుజ్యతే. 462

తా. పరస్పరకలహామునందును, త్రాటియందును, సంకెలయందును ఈహస్తము చెల్లును.

### ౨౦. కీలకహస్తలక్షణమ్.

కనిష్ఠే కుఞ్చితే శ్లిష్టే మృగశీర్షే తు కీలకః,

తా. మృగశీర్షహస్తముల చిటికెనవ్రేళ్ళనువంచి చేర్చిపట్టినయెడ కీలకహస్తమగును.

వినియోగము:—

స్నేహే చనర్త్యాలాపేచ వినియోగోఽస్య సమ్మతః. 463

తా. స్నేహమునందును, ప్రియవచనమునందును ఈహస్తముచెల్లును.

## ౧౭. మత్స్యహస్తలక్షణమ్.

కరపృష్ఠోపరిన్యస్తో యత్ర హస్తః పతాకికః,
కిఞ్చిత్ప్రసారితాఙ్గుష్ఠకనిష్ఠో మత్స్యనామకః. 464
ఏతస్య వినియోగస్తు మత్స్యార్థే సమ్మతోభవేత్,

తా. పతాకహస్తములను ఒకటిమీఁదనొకటిచేర్చి చిటికెనవ్రేళ్లను బొటనవ్రేళ్లను కొంచెము చాఁచిపట్టినయెడ మత్స్యహస్తమగును. ఇది మత్స్యార్థమునందు చెల్లును.

## ౧౮. కూర్మహస్తలక్షణమ్.

కుఞ్చితాగ్రాంగుళిశ్చక్రేత్యక్తాంగుష్ఠకనిష్ఠకః. 465
కూర్మహస్తస్సవిజ్ఞేయః కూర్మార్థే వినియుజ్యతే,

తా. చక్రహస్తము మొనవ్రేళ్లనువంచి, చిటికెనవ్రేలిని బొటనవ్రేలిని జాఁచిపట్టినయెడ కూర్మహస్తమగును. ఇది తాఁబేటియందు ఉపయోగించును.

## ౧౯. వరాహహస్తలక్షణమ్.

మృగశీర్షేత్వన్యకరస్తేన శ్లిష్టస్థితో యది. 466
కనిష్ఠాంగుష్ఠయోరోర్యోగాద్వరాహఃకరఈరితః,
ఏతస్య వినియోగస్తు వరాహార్థేతు యుజ్యతే. 467

తా. మృగశీర్షహస్తమును ఒకటిమీఁదనొకటిచేర్చి చిటికెనబొటన

వ్రేళ్లనుకూడఁబట్టినయెడ వరాహహస్తమగును. ఇది పందియందు వినియోగించును.

### ౨౦. గరుడహస్తలక్షణమ్.

తిర్యక్కలస్థితావర్ధ చన్ద్రావంగుష్ఠ యోగతః,
గరుడో గరుడార్థేచ యుజ్యతే భరతాగమే. 468

తా. అర్ధచంద్రహస్తములు రెండును అడ్డముగా బొటనవ్రేళ్లు చేరికతో పట్టఁబడినయెడ గరుడహస్తమగును. ఇది గరుడునియందు ఉపయోగించును.

### ౨౧. నాగబన్ధహస్తలక్షణమ్.

సర్పశీర్షౌ స్వస్తికౌచే న్నాగబంధ ఇతీరితః,

తా. రెండుసర్పశీర్షహస్తములు స్వస్తికముగ పట్టఁబడినయెడ నాగబంధహస్తమగును.

వినియోగము:—

ఏతస్య వినియోగస్తు నాగబంధే నియుజ్యతే. 469
భుజంగదమ్పతీభావే నికుఞ్జానాంచ దర్శనే,
అథర్వణస్య మంత్రేషు యోజ్యో భరతకోవిదైః. 470

తా. పాముల పెనవంటి రతిబంధమందును, పాముల పెనయందును, పొదరిండ్ల జూపుటయందును, అథర్వణమంత్రమునందును ఈహస్తము చెల్లును.

### ౨౨. ఖట్వాహస్తలక్షణమ్.

చతురే చతురం న్యస్య తర్జన్యంగుష్ఠమోక్షతః,
ఖట్వాహస్తో భవేదేషః ఖట్వాదిషు నియుజ్యతే. 471

తా. చతురహస్తముపై చతురహస్తమునుంచి చూపుడువ్రేలిని బొటన వ్రేలిని చాఁచిపట్టినయెడ ఖట్వాహస్తమగును. ఇది మంచము మొదలైన వానియం దుపయోగించును.

౨౩. భేరుండహస్తలక్షణమ్.

మణిబన్ధకపిత్థాభ్యాం భేరుండకరఇష్యతే,
భేరుండపక్షిదమ్పత్యోర్భేరుండకరఈరితః. 472

తా. కపిత్థహస్తములు రెండును మనికట్టులతోఁ జేర్చిపట్టఁబడినయెడ భేరుండహస్తమగును. ఇది భేరుండపక్షిదంపతులయందు వినియోగించును.

౨౪. అవహిత్థహస్తలక్షణమ్.

సోలపద్మావక్షసిస్థావవహిత్థకరోమతః,

తా. రెండు సోలపద్మహస్తములు ఱొమ్మున కెదురుగాఁ బట్టఁబడిన యెడ అవహిత్థ హస్తమగును.

వినియోగము:—

శృఙ్గారనటనే చైవ లీలాకందుకధారణే. 473
కుచార్థేయుజ్యతేసోఽయమవహిత్థకరాభిధః,

తా. శృంగారనటనము, పుట్టచెండును పట్టుట, స్తనము వీనియందు ఈహస్తము వినియోగించును.

ఏవం సంయుతహస్తానాం నామలక్షణమీరితమ్. 474

తా. ఈవిధముగా సంయుతహస్తములయొక్క నామలక్షణములు చెప్పఁబడియెను.

### గ్రంథాంతరస్థ సంయుతహస్తాః.

#### ౧. అవహిత్థహస్తలక్షణమ్.

హృదయాభిముఖౌ యత్ర శుకతుణ్డావధోగతౌ,
సోఽవహిత్థో భవేదస్య మార్కణ్డేయోఽధిదేవతా. 475

తా. రెండుశుకతుండహస్తములు క్రిందుగ హృదయాభిముఖములుగఁ బట్టఁబడినయెడ అవహిత్థహస్తమగును. దీనికి అధిదేవత మార్కండేయుఁడు.

వినియోగము:—

దుర్బలత్వే దేహకార్శ్యే కౌతుకే చ కృశే మతః,

తా. బలహీనత, దేహము చిక్కియుండుట, సంతోషము, చిక్కినది వీనియందు ఈహస్తము చెల్లును.

#### ౨. జగదన్తహస్తలక్షణమ్.

బాహుమధ్యగతౌ సర్పశీర్షౌ స్వస్తికతామితౌ. 476
యదిస్యాద్గజదంతోఽయం పరమాత్మాఽధిదేవతా,

తా. సర్పశీర్షహస్తములు బాహుమధ్యమందు స్వస్తికముగఁ జేర్పఁబడినయెడ గజదంతహస్తమగును. దీనికి అధిదేవత పరమాత్మ.

వినియోగము:—

స్తమ్భగ్రహే శిలోత్పాటే భారగ్రాహే నియుజ్యతే.477

తా. స్తంభమును గ్రహించుటయందును, రాలిని పెల్లగించుటయందును, భారమును వహించుటయందును ఈహస్తముచెల్లును.

#### 3. చతురశ్రహస్తలక్షణమ్.

చతురశ్రస్మృతోవక్షః పురోగౌ కటకాముఖౌ,
తస్యాఽధిదైవం వారాహీ కీర్తితా భావకోవిదైః. 478

తా. రొమ్మునకెదురుగ కటకాముఖహస్తములను బట్టినయెడ చతురశ్ర హస్తమగును. దీనికి అధిదేవత వారాహి.

వినియోగము:—

నియోగో దధిమన్థానే జక్కిణీ నటనేఽపిచ,
ధారణే దోహనవిధౌ పటానామవకుంఠనే. 479
వహనే మౌక్తికాదీనాం రజ్జ్వాదీనాఞ్చకర్షణే,
నీవీబంధే చోళబంధే సుమాదీనాఞ్చధారణే. 480
వీజనే చామరాదీనాం చతురశ్రోనియుజ్యతే,

తా. పెరుగుచిలుకుట, జక్కిణియను ఆట, ధరించుట, పాలుపిదుకుట, వస్త్రములను కప్పుకొనుట, ముత్యములు మొదలగువానిని ధరించుట, త్రాడు మొదలగువానిని ఈడ్చుట, పోకముడి, రవికముడి, పువ్వులు మొదలగువానిని ధరించుట, వింజామరము మొదలగువానిని వీచుట వీనియందు ఈహస్తము వినియోగించును.

౮. తలముఖహస్తలక్షణమ్.

వక్షఃపురస్తాదుద్వృత్తౌ కరౌత్వభిముఖౌ యది. 481
నామ్నాతలముఖస్త్వస్య విఘ్నరాజోఽధిదేవతా,

తా. రొమ్మునకెదురుగ పతాకహస్తములను మీఁదికెత్తిపట్టినయెడ తలముఖహస్తమగును. దీనికి అధిదేవత విఘ్నేశ్వరుఁడు.

వినియోగము:—

ఆలిఙ్గనే స్థూలవస్తౌ మహాస్తమ్భాదిభావనే. 482
బుద్ధైరభిహితో మఞ్జుమర్దళే మధురస్వనే,

తా. ఆలింగనము, పెద్దవస్తువు, గొప్పస్తంభములనుజూపుట, మనో జ్ఞమయిన ధ్వనిగలమద్దెల వీనియందు ఈహస్తము చెల్లును.

౫. స్వస్తికాహస్తలక్షణమ్.

త్రిపతాకౌ వామభాగే యది స్వస్తికతాం గతౌ. 483
సభవేత్స్వస్తికాహస్తో గుహాస్తస్యాఽధిదేవతా,

తా. త్రిపతాకములు ఎడమతట్టు స్వస్తికాకారముగాఁ బట్టఁబడిన యెడ స్వస్తికహస్తమగును. వీనికి అధిదేవత గుహుఁడు.

వినియోగము:—

కల్పద్రుమేషు శైలేషు హస్తోఽయం వినియుజ్యతే. 484

తా. కల్పవృక్షములయందును పర్వతములయందును ఇది వినియోగించును.

౬. ఆవిద్ధవక్రహస్తలక్షణమ్.

పతాకహస్తౌ వ్యావృత్తౌ సవిలాసం సకూర్పరమ్,
అసావావిద్ధవక్రస్స్యాత్తుమ్బురుస్త్వధిదేవతా. 485

తా. రెండుపతాకహస్తముల మోచేతులను విలాసముతోఁగూడు కొనునట్లు విరివిగాఁబట్టినయెడ ఆవిద్ధవక్రహస్తమగును. దీనికి అధిదేవత తుంబురుఁడు.

వినియోగము:—

మేఖలావహనే భేదే మధ్యకార్శ్యనిరూపణే,
దేశీయనాట్యనటనే వినియోగం తయోర్విదుః. 486

తా. మొలనూలు ధరియించుట, భేదము, నడుముయొక్క సన్నదనమును తెలుపుట, దేశీయనాట్యము వీనియందు ఈహస్తము చెల్లును.

## ౭. రేచితహస్తలక్షణమ్.

హంసపక్షౌ కృతోత్తాన తలావగ్రధృతౌయది,
రేచితస్సకరోజ్ఞేయో యక్షరాడధిదేవతా. 487

తా. రెండుహంసపక్షహస్తములను అరచేయిమీఁదు చేసిపట్టినయెడ రేచితహస్తమగును.

వినియోగము:—

శిశూనాం ధారణే చిత్రఫలకస్య నిరూపణే,
వినియోగో రేచితస్య ఏవమాదిషుయుజ్యతే. 488

తా. బిడ్డలనుఎత్తుకొనుట, చిత్తరువుపలకనుచూపుట మొదలగువాని యందు ఈహస్తము చెల్లును.

## ౮. నితమ్బహస్తలక్షణమ్.

ఉత్తానితావధోవక్త్రౌ పతాకా వంసదేశతః,
నితమ్బస్థౌ నితమ్బాఖ్యో అగస్త్యస్తస్యదేవతా. 489

తా. రెండుపతాకహస్తములను మూపులు మొదలుకొని క్రిందుమొగముగా పిరుఁదులు తాఁకునట్టు పట్టినయెడ నితంబహస్తమగును. దీనికి అధిదేవత అగస్త్యుఁడు.

వినియోగము:—

శ్రమేఽవతరణేచైవ విస్మయే వివశాయితే,
ఏవమాదిషు యుజ్యేత నితమ్బాఖ్యకరస్స్మృతః. 490

తా. బడలిక, దిగుట, ఆశ్చర్యము, పరవశత్వము మొదలగువాని యందు ఈహస్తము చెల్లును.

### ౯. లతాహస్తలక్షణమ్.

పతాకౌడోలికాకారౌలతాఖ్యశ్శక్తిదేవతః,

తా. రెండుపతాకహస్తములను డోలాకారముగఁ బట్టినయెడల లతాహస్తమవును. దీనికి అధిదేవత శక్తి.

వినియోగము:—

ఏతస్య వినియోగశ్చ నిశ్చేష్టాయాం మదాలసే. 491
స్వభావనటనారమ్భే రేఖాయాం యోగభావనే,
ఏవమాదిషు యుజ్యేత లతాహస్త విభావనా. 492

తా. చేష్టలులేకయుండుట, మదాలస్యము, స్వభావనటనము, రేఖ, యోగభావనము మొదలయినవానియందు ఈహస్తముచెల్లును.

### ౧౦. పక్షవఞ్చితహస్తలక్షణమ్.

వినస్యాఽగ్రే కటీశీర్షే త్రిపతాకకరౌ యది,
పక్షవఞ్చితనామానౌ అనయోర్దేవతాఽర్జునః. 493

తా. రెండుత్రిపతాకహస్తములను ముందుగానడుముమీఁదికి ఎగఁ బట్టినయెడ పక్షవంచితహస్తమగును. దీనికి అధిదేవత అర్జునుఁడు.

వినియోగము:—

ఊర్వోరభినయేభేదే వినియోగో నియుజ్యతే,

తా. తొడలయభినయమందును భేదమందును ఈహస్తము చెల్లును.

### ౧౧. పక్షప్రద్యోతహస్తలక్షణమ్.

ఉత్తానితావిమౌ పక్షప్రద్యోతః సిద్ధదేవతః. 494

తా. ఈపక్షవంచితహస్తము మరికొంచెము ఎగఁబట్టఁబడినయెడ ప్రద్యోతహస్తమగును. దీనికి సిద్ధుఁడు అధిదేవత.

వినియోగము:—

నిరుత్సాహే బుద్ధిజాడ్యే విపరీతనిరూపణే,
మాయావరాహే కుండాభినయాదిషు భవేదసౌ. 495

తా. ఉత్సాహములేమి, బుద్ధిమాంద్యము, విపరీతమును నిరూపించుట, మాయావరాహము, కుండాభినయము మొదలగువానియందు ఈ హస్తము చెల్లును.

౧౨. గరుడపక్షహస్తలక్షణమ్.

అర్ధచంద్రౌ కటీపార్శ్వే న్యస్యోర్ధ్వం సారితౌ యది,
స్యాతాం గరుడపక్షాఖ్యౌ తయోరీశస్సనన్దనః. 496

తా. రెండు అర్ధచంద్రహస్తములునడుముప్రక్కలను ఎగఁబట్టఁబడిన యెడ గరుడపక్షహస్తమగును. దీనికి అధిదేవత సనందనుఁడు.

వినియోగము:—

కటిసూత్రే౽ధికేచైవ ఏవమాదిషుయుజ్యతే,

తా. మొలనూలు, అధికము మొదలైనవానియందు ఈహస్తము చెల్లును.

౧౩. నిషేధహస్తలక్షణమ్.

కపిత్థాఖ్యేన హస్తేన వేష్టితో ముకుళో యది. 497
నిషేధోనామచభవేత్తుమ్బురుస్త్వధిదేవతా,

తా. కపిత్థహస్తముచేత ముకుళహస్తము చుట్టఁబడినయెడ నిషేధహస్తమగును. దీనికి అధిదేవత తుంబురుఁడు.

వినియోగము:—

సిద్ధాన్తస్థాపనే సత్యే నూనమిత్యభిభాషణే. 498
చూచుకగ్రహణే లిఙ్గపూజాయాం వినియుజ్యతే,

తా. సిద్ధాంతస్థాపనము, నిజము, నిశ్చయముచేయుట, చను మొనలనుఅంటుట, లింగపూజ వీనియందు ఇది వినియోగించును.

౧౮. మకరహస్తలక్షణమ్.

యత్రాఽన్యోన్యం పరిగతావర్ధచంద్రావధోముఖౌ. 499
చలాఙ్గుష్ఠేనమకరో మహేంద్రస్తస్య దేవతా,

తా. రెండు అర్ధచంద్రహస్తములను జేర్చి దిగుమొగముగా బొటనవ్రేళ్లను కదలించిపట్టినయెడ మకరహస్తమవును. దీనికి అధిదేవత ఇంద్రుఁడు.

వినియోగము:—

కూలంకషే నదీపూరే సింహే దైత్యే మృగాననే. 500
కల్యాణే నిబిడే మఞ్చే నక్రేచాఽయం నియుజ్యతే,

తా. గట్టునొరయుం, ఏటివెల్లువ, సింహము, అసురుఁడు, మృగముయొక్క మొగము, బంగారు లేక పెండ్లి, నిండినది, మంచె, మొసలి వీనియందు ఈహస్తము వినియోగించును.

౧౯. వర్ధమానహస్తలక్షణమ్.

అధోముఖౌ హంసపక్షౌ యస్మిన్నన్యోన్యమున్ముఖౌ. 501
సవర్ధమానో భవతి వాసుకిస్తస్య దేవతా,
అసౌనృసింహే తద్దీప్తౌరక్షో వక్షోవిదారణే. 502

తా. అధోముఖములయిన హంసపక్షహస్తములను పరస్పరమభిముఖ

ములుగాఁబట్టిన యెడ వర్ధమానహస్తమవును. దీనికి అధిదేవత వాసుకి. ఇది నృసింహస్వామి. అతని తేజస్సు, హిరణ్యకశిపుని రొమ్మును చీల్చుట వీని యందు చెల్లును.

## ౧౬. ఉద్వృత్తహస్తలక్షణమ్.

అధరోత్తరయో రేక సమయే హంసపక్షయోః,
ఉద్వృత్త ఇతివిఖ్యాతో వాసిష్ఠోఽస్యాఽధిదేవతా. 503

తా. ఒకేసమయమందు క్రిందుమీఁదులుగ హంసపక్షహస్తములు పట్టఁబడినయెడ ఉద్వృత్తహస్తమవును. దీనికి అధిదేవత వాసిష్ఠమహర్షి.

వినియోగము:—

లజ్జాయాముపమార్థేచ సంతాపే కంటకాదిషు,
భేదే భయే విచారేచ ఉద్వృత్తకర ఈరితః. 504

తా. సిగ్గు, సాదృశ్యము, సంతాపము, ముల్లుమొదలయినది, భేదము, భయము, చింత వీనియందు ఈహస్తము వినియోగించును.

## ౧౭. విప్రకీర్ణహస్తలక్షణమ్.

స్వస్తికః శీఘ్రవిశ్లేషాత్ విప్రకీర్ణస్స ఉచ్యతే,
దక్షిణామూర్తి రేతస్య అధి దేవః ప్రకీర్తితః. 505
చేలాఞ్చలస్యవిస్రంసే సయుజ్యేత విధూననే,

తా. ముందు చెప్పినస్వస్తిహస్తమును వడిగా వదలినచో విప్రకీర్ణహస్తమవును. దీనికి అధిదేవత దక్షిణామూర్తి. ఇది కొంగుతొలఁగించుట యందును, వదలించుటయందును చెల్లును.

## ౧౮. అరాళకటకాముఖహస్తలక్షణమ్.

అరాళకటకౌ హస్తౌ అరాళ కటకాముఖః. 506
ప్రాపితౌ చేత్ స్వస్తికతామధిదేవోఽస్య వామనః,

తా. అరాళహస్త కటకాముఖహస్తములను స్వస్తికాకారముగఁబట్టిన యెడ అరాళకటకాముఖ హస్తమవును. దీనికి అధిదేవత వామనుఁడు.

తాంబూలదళ ఖండానాం దానే చింతావిషాదయోః.507
వినియోజ్యఇతిప్రోక్తః అరాళకటకాముఖః,

తా. ఆకుమడుపులు వక్కపలుకులు నిచ్చుట, చింత, విషాదము వీని యందు ఈహస్తము చెల్లును.

## ౧౯. సూచ్యాస్యహస్తలక్షణమ్.

సూచీముఖౌ పురోదేశాద్యుగపత్పార్శ్వగామినౌ. 508
సూచ్యాస్య ఇతివిజ్ఞేయః అధిదేవోఽస్యనారదః,

తా. సూచీహస్తములను ఎదుటనుండి పార్శ్వములకు ఒకటిగా చేరఁ బట్టినయెడ సూచ్యాస్య హస్తమగును. దీనికి అధిదేవత నారదుఁడు.

వినియోగము: —

కింకరోమీతి వచనే విరహే సకలార్థకే. 509
విలోకయేతి వాక్యేచ సూచ్యాస్యాభినయంవిదుః,

తా. ఏమిచేయుదుననుట, విరహము, సమస్తమనుట, చూడుమనుట వీనియందు ఈహస్తము చెల్లును.

## ౨౦. అర్ధరేచితహస్తలక్షణమ్.

ఏకంత్వధోముఖం ధృత్వా తౌ హస్తావథ రేచితే. 510

అర్ధరేచితనామానౌ నందికేశోఽధిదేవతా,

తా. రేచితహస్తమందలి యొక హంసపక్ష హస్తమును అధోముఖముగఁ బట్టినయెడ అర్ధరేచిత హస్తమవును. దీనికి అధిదేవత నందికేశుఁడు.

వినియోగము:—

ఆవాహేచోపచాదీనాం కార్యగుప్తౌ విమతౌ మతౌ. 511

తా. ఆవాహనము కానుక మొదలగునవి, కార్యమును మరుగు చేయుట వీనియందు ఈహస్తము చెల్లును.

## ౨౧. కేశబన్ధహస్తలక్షణమ్.

పతాకౌస్యాత్కేశబంధః తస్యదుర్గాఽధిదేవతా,
రత్నస్తమ్భే కేశబంధే కపోలాదిషుయుజ్యతే. 512

తా. రెండు పతాకహస్తములు కేశబంధ హస్తమగును. దీనికి అధిదేవత దుర్గ. ఇది రత్నస్తంభము, కొప్పు, చెక్కిళ్లు మొదలయిన వానియందు వినియోగించును.

## ౨౨. ముష్టిస్వస్తికహస్తలక్షణమ్.

ముష్టిహస్తౌ స్వస్తికతాం కుక్షిస్థానే గతౌ యది,
ముష్టిస్వస్తిక హస్తస్స్యాత్ దేవః కింపురుషస్స్మృతః 513

తా. కడుపుమీఁదుగా ముష్టిహస్తములను స్వస్తికములుగఁ బట్టినయెడ ముష్టిస్వస్తిక హస్తమగును. దీనికి అధిదేవత కింపురుషుఁడు.

వినియోగము:—

క్రీడాకందుకసంధానే ద్వంద్వయుద్ధనిరూపణే,
క్రీడాభరే నీవిబంధే వినియోగోఽస్యసంమతః. 514

తా. చెండాడుట, ద్వంద్వయుద్ధము, మిక్కిలి సిగ్గు, పోకముడి వీని యందు ఈహస్తము వినియోగించును.

౨౩. నళినీపద్మకోశహస్తలక్షణమ్.

వ్యావర్తితౌ పద్మకోశౌ యది స్వస్తికతాం గతౌ,
నళినీపద్మకోశాఖ్యో భవేత్ శేషోఽధిదేవతా. 515

తా. పద్మకోశ హస్తములను వెనుకకు త్రిప్పి స్వస్తికములుగఁ బట్టిన యెడ నళినీ పద్మకోశ హస్తమగును. దీనికి అధిదేవత ఆదిశేషుఁడు.

వినియోగము:—

నాగబంధే చ ముకుళే సమయోర్దానకర్మణి,
స్తబకేదశసంఖ్యాయాం గణ్డభేరుణ్డకేమతః. 516

తా. నాగబంధము, మొగ్గ, సమముగనిచ్చుట, పూవుగుత్తి, పది యనుట, గండభేరుండపక్షి వీనియందు ఈహస్తము వినియోగించును.

౨౪. ఉద్వేష్టితాలపద్మహస్తలక్షణమ్.

ఉద్వేష్టిత క్రియావంతౌ వక్షసోఽగ్రేఽలపల్లవౌ,
ఉద్వేష్టితాల పద్మాఖ్యశ్శక్తిరస్యాఽధిదేవతా. 517

తా. అలపల్లవహస్తములను చుట్టుకోఁబడినవి అగునట్లు రొమ్మున కెదురుగాఁ బట్టినయెడ ఉద్వేష్టితాల పద్మహస్తమగును. దీనికి అధిదేవత శక్తి.

వినియోగము:—

ప్రాణేశే దీనవచనే స్తనయోర్వికచాంబుజే,
మోహినాఽస్మీతి వాక్యేచ ప్రలాపస్య నిరూపణే. 518

కామితార్థ ప్రకరణే ఏతేషు వినియుజ్యతే,

**తా.** ప్రాణనాథుఁడు, దీనవచనము, స్తనములు, వికసించినకమలము, మోహితురాలనైతిననుట, ప్రలాపమును నిరూపించుట, కోరినను తెలియఁ జేయుట మొదలైనవానియందు ఈహస్తము వినియోగించును.

### ౨౫. ఉల్బణహస్తలక్షణమ్.

తౌ నేత్రదేశగావుల్బణాఖ్యో విఘ్నేశదేవతః. 519
స్తబకేషు విశాలేషు నేత్రేషు చ నిరూపితః,

**తా.** ఆయలపద్మహస్తములే కంటికెదురుగఁబట్టఁబడినయెడ ఉల్బణహస్తమౌను. దీనికి అధిదేవత విఘ్నేశుఁడు. ఇది పూగుత్తులయందును, విశాలములైన కన్నులందును వినియోగించును.

### ౨౬. లాలితహస్తలక్షణమ్.

స్వస్తికాకరణావేతౌ శిరోదేశేఽలపల్లవౌ. 520
లాలితో గదితావేతౌ దేవతా వైష్ణవీ మతా,
ఏతస్య వినియోగస్తు సాలే దుర్గే మహీధరే. 521

**తా.** అలపల్లవహస్తములను తలమీఁద స్వస్తికాకారముగపట్టినయెడ లాలితహస్తమౌను. దీనికి అధిదేవత వైష్ణవి. ఇది మద్దిమ్రాను, శత్రువులకు చొరగానికోట, కొండ వీనియందు వినియోగించును.

### గ్రంథాంతరే

### ౧. విప్రకీర్ణహస్తలక్షణమ్.

హస్తౌ తు త్రిపతాకాఖ్యౌ తిర్యక్కూర్పరసంయుతౌ,
కథ్యతే విప్రకీర్ణోఽయం హస్తోనాట్యవిశారదైః. 522

తా. రెండు త్రిపతాకహస్తముల మోచేతులను అడ్డముగాఁగూడఁ బట్టినయెడ విప్రకీర్ణహస్తమగును.

వినియోగము:—

కవచే చకరన్యాసే మంత్రావాహేక్షమాగుణే,
విచారేచ ప్రయోక్తవ్యో విప్రకీర్ణ ఇతీరితః. 523

తా. కవచము, కరన్యాసము, మంత్రావాహనము, క్షమాగుణము, విచారము వీనియందు ఈహస్తము వినియోగించును.

౨. గజదంతహస్తలక్షణమ్.

కరాభ్యాం శిఖరౌ ధృత్వా కనిష్ఠే ప్రసృతే యది,
గజదంతకరః ఖ్యాతః కరో భరతవేదిభిః. 524

తా. రెండుశిఖరహస్తములను చిటికెనవ్రేళ్లు చాఁచిపట్టఁబడినయెడ గజదంతహస్తమగును.

వినియోగము:—

జలావగాహే ద్విరదదంతయోర్భూమిమానయోః,
శఙ్కుస్థాపనభావేషు గజదంతో నియుజ్యతే. 525

తా. నీళ్లయందుమునుఁగుట, ఏనుఁగుకొమ్ములు, భూమిమానము, శంకుస్థాపనము చేయుట వీనియందు ఈహస్తము వినియోగించును.

3. తాలముఖహస్తలక్షణమ్.

కరౌ పతాకనామానౌ అన్యోన్యాభిముఖీకృతౌ,
చలితౌ చేత్తాలముఖః ప్రోక్తో భరతవేదిభిః. 526

తా. రెండుపతాకహస్తములను ఎదురెదురుగాఁబట్టి చలింపఁజేయుంసెడ తాలముఖహస్తమగును.

వినియోగము:—

భుజఙ్గసూక్ష్మనాట్యేచ ముఖనాట్యేచ మేళనే,
గ్రహే స్థూలపదార్థేచ తాలవక్త్రోఽభిధీయతే. 527

తా. భుజంగనాట్యము, ముఖనాట్యము, కూడిక, గ్రహించుట, లావైనపదార్థము వీనియందు ఈహస్తము చెల్లును.

౪. సూచీవిద్ధహస్తలక్షణమ్.

అన్యోన్యమభిసంస్పృష్టౌ సూచీ వక్త్రాభిధౌ కరౌ,
సూచీ విద్ధకరస్సోఽయం నృత్తహస్తానుసారిభిః. 528

తా. రెండు సూచీముఖహస్తములు ఎదురెదురుగ జేరఁబట్టఁబడు నెడ సూచీవిద్ధహస్తమగును.

వినియోగము:—

హాళీసలీనాభినయే లగ్నార్థే మేళనేద్రుఢే,
శాఖాద్వయస్య సంయోగే సూచీ విద్ధకరోభవేత్. 529

తా. కోలాటమునందలికలగలుపు, చేరిక, గట్టిది, రెండుకొమ్మలచేరిక వీనియందు ఈహస్తముచెల్లును.

౫. పల్లవహస్తలక్షణమ్.

పతాకౌ మణిబంధేతు చలితౌ చేదధోముఖౌ,
కరఃపల్లవనామాఽయం యుజ్యతే నాట్యవేదిభిః. 530

తా. పతాకహస్తములు క్రిందుమొగముగ మనికట్లు కదలునట్లు పట్టఁబడినయెడ పల్లవహస్తమగును.

వినియోగము:—

ఫలపుష్పాతిభారేణ నమ్రశాఖానులమ్బనే,
నమ్రతార్థే నియోక్తవ్యః పల్లవస్సోఽభిధీయతే. 531

తా. పుష్పఫలాదులచే వంగినకొమ్మల వ్రేలాడుట,వంగుట వీనియందు ఈహస్తము చెల్లును.

## ౬. నితమ్బహస్తలక్షణమ్.

అంసదేశం సమారభ్య నితమ్బానధిచాలితౌ,
పార్శ్వయోస్తు పతాకౌ ద్వౌ నితమ్బకరఉచ్యతే. 532

తా. రెండు పతాకహస్తములు మూపులు మొదలుకొని పిరుఁదుల దాఁక ప్రక్కలలో కదలుచుండునట్లు బట్టఁబడినయెడ నితంబహస్తమగును.

వినియోగము:—

పరివేషేచ సూర్యేన్ద్వో రజ్ఞ లావణ్యాదర్శనే,
ప్రాకారాదేవతానాంచ నైపథ్యే భ్రమణేఽపిచ. 533
పార్శ్వసౌందర్యభావేచ నితమ్బాఖ్య కరోభవేత్,

తా. సూర్యచంద్రుల పరివేషము, చక్కదనము, ప్రాకారము, దేవతాదులవేషము, భ్రమించుట, ప్రక్కల చక్కదనము వీనియందు ఈ హస్తము చెల్లును.

## ౭. కేశబంధహస్తలక్షణమ్.

ఏతావేవ నితమ్బాది కేశపర్యంతచాలితౌ. 534
యదిస్యాత్కేశబంధాఖ్య కరస్సమ్యఙ్నిరూప్యతే,

తా. ముందుచెప్పిన పతాకహస్తములే పిరుఁదులు మొదలు తల

వెండ్రుకలదాఁక చలింపఁజేయుచు పట్టఁబడినయెడ కేశబంధహస్తమగును.

వినియోగము:—

వృక్షద్వయేఽధికే మేరౌ రక్తేబహుళ విభావనే. 535
ఉత్తిష్ఠేతివచోభావే యుజ్యతే కేశబంధకః,

తా. రెండువృక్షములు, అధికము, మేరుపర్వతము, చాలా అనుట, లెమ్ము అనుట వీనియందు ఈహస్తము చెల్లును.

౮. లతాహస్తలక్షణమ్.

అలపద్మావగ్రభాగ ప్రశ్రితౌ చలితౌ యది. 536
లతాహస్తస్సవిజ్ఞేయః ప్రోక్తో నాట్యవిశారదైః,

తా. రెండు అలపద్మహస్తములు ఎదురెదురుగ చలించునట్లు పట్టఁబడినయెడ లతాహస్తమౌను.

వినియోగము:—

భ్రమరాభిధనాట్యేచ వాయోశ్చలితకోరకే. 537
లతాయాం పుష్పితాయాంచ స్తబకాచలనేఽపిచ,
లీలాకందుకభావేచ లతాహస్తో నియుజ్యతే. 538

తా. భ్రమరనాట్యము, గాలిచేఁగదలెడిమొగ్గ, పూదీఁగ, పూగుత్తుల కదలిక, చెండు వీనియందు ఈహస్తము చెల్లును.

౯. ద్విరదహస్తలక్షణమ్.

పతాకనామ్నా హస్తేన స్కంధదేశే నివేశ్యచ,
పద్మకోశమధోవక్త్రం దక్షిణే హస్తకే యది. 539
సమౌ ధృతౌ చేద్ద్విరద హస్తోఽయం పరికీర్తితః,

తా. ఎడమచేత పతాక హస్తమును, కుడిచేత అధోముఖముగ పద్మకోశ హస్తమును సమముగఁ బట్టఁబడినయెడ ద్విరదహస్తమవును.

వినియోగము:—

గజస్య శుండాభినయే గజవక్త్ర ప్రదర్శనే. 540
యుజ్యతే కరిహస్తోఽసౌ నరహస్తానుసారతః,

తా. ఏనుఁగుతొండమునందును, విఘ్నేశ్వరుని జూపుటయందును, ఈహస్తము చెల్లును.

### ౧౦. ఉద్ధృతహస్తలక్షణమ్.

ఊరసోగ్రే హంసపక్షావన్యోన్యాభిముఖీకృతౌ. 541
భవేదుద్ధృతహస్తోఽయం వినియోగోఽస్యకథ్యతే,

తా. రొమ్మునకెదురుగ హంసపక్ష హస్తములను ఎదురెదురుగఁ జేర్చి పట్టినయెడ ఉద్ధృత హస్తమవును.

వినియోగము:—

ఆవర్తేత్వవ్యథాత్యర్థే భావనాయాం స్వరూపకే. 542
స్థిరోభవేతి వచనే డోలాయాం స్థూలకేఽపిచ,
గృహేఽప్యుద్ధృతహస్తోఽయం ప్రకృతార్థే నియుజ్యతే.

తా. నీటిసుడి, అధికము, తలఁపు, స్వరూపము, స్థిరుఁడవు అగు మనుట, ఉయ్యాల, పెద్దది, ఇల్లు, ప్రకృతార్థము వీనియందు ఈహస్తము చెల్లును.

### ౧౧. సంయమహస్తలక్షణమ్.

తర్జనీ మధ్యమా హస్త తలేనమ్రీకృతౌ యది. 544
ఇతరౌ ప్రసృతౌసోఽయం కరస్సంయమనామకః,

తా. చూపుడువ్రేలిని నడిమివ్రేలిని అరచేతితట్టువంచి తక్కిన వ్రేళ్ళను చాఁచిపట్టినయెడ సంయమహస్తమవును.

వినియోగము:—

ప్రాణాయామే మహాయోగే యుజ్యతేచాఽర్యభావనే.

తా. ప్రాణాయామము, యోగాభ్యాసము, పూజ్యులుఅనుట వీని యందు హస్తము చెల్లును.

## ౧౨. ముద్రాహస్తలక్షణమ్.

కరయోర్మధ్యమాఙ్గుష్ఠే యోగాన్ముద్రా కరోభవేత్,

తా. రెండుచేతుల నడిమివ్రేళ్ళను బొటనవ్రేళ్ళను జేర్చిపట్టినయెడ ముద్రాహస్తమవును.

వినియోగము:—

అణౌ తృణే గోముఖేచ త్రోటీపుట నిదర్శనే. 546
ముద్రాహస్తోయుజ్యతేఽసౌ భరతాగమకోవిదైః,

తా. అణువు, గడ్డిపోఁచ, ఆవుమోర, పక్షిముక్కు వీనిని జూపుట యందు ఈహస్తము చెల్లును.

## ౧3. అజాముఖహస్తలక్షణమ్.

సింహాననాభిధకరే తర్జనీచ కనిష్ఠికా. 547
మధ్యమానామికాపృష్ఠే యోగాదూ్భయాదజాముఖః,

తా. సింహముఖహస్తముయొక్క చూపుడు చిటికెనవ్రేళ్ళను, నడిమి వ్రేళ్ళను ఉంగరపువ్రేళ్ళను మీఁదుగాఁ జేర్చిపట్టినయెడ అజాముఖ హస్తమగును.

వినియోగము.—

అజాదికానాం వక్త్రేషు నిర్విషాణ ముఖేషుచ. 548
గజకుంభే మల్లయుద్ధే అజావక్త్రోనియుజ్యతే,

తా. మేఁక మొదలైన జంతువుల మోరలందును, కొమ్ములులేని జంతువుల ముఖములందును, ఏనుఁగు కుంభస్థలమునందును, జెట్టిపోట్లాట యందును ఈహస్తము చెల్లును.

## ౧౮. అర్ధముకుళహస్తలక్షణమ్.

లాఙ్గూలాఖ్యకరే సమ్యక్కనిష్ఠా వక్రితా యది. 549
ప్రోక్తోఽర్ధ ముకుళాఖ్యోఽసౌ భరతాగమవేదిభిః,

తా. లాంగూలహస్తపుచిటికెనవ్రేలు బాగుగ వంపఁబడినయెడ అర్ధముకుళహస్తమగును.

వినియోగము.—

లికుచేశీలభావేచా ఽప్యుచితేఽపి కుచేఽపిచ. 550
లోభే ముకుళపద్మే చ కరణే వినియుజ్యతే,

తా. గజనిమ్మపండు, మంచిస్వభావము, ఉచితము, కుచము, లోభము, తామరమొగ్గ, ఉపకరణము వీనియందు ఈహస్తము వినియోగించును.

## ౧౯. రేచితహస్తలక్షణమ్.

అలపద్మకరా యత్ర శ్లిష్టా పార్శ్వ ప్రసారితా. 551
తత్తత్ప్రయోగకుశలైః రేచితోఽయం నిరూప్యతే,

తా. అలపద్మహస్తములను చేర్చి, పార్శ్వమందు చాఁచిపట్టినయెడ రేచితహస్తమగును.

వినియోగము.—

చారీయే పార్శ్వనటనే నారికేళే ప్రలాపకే. 552
సర్వనాట్యేషు వేళాయాం యుజ్యతే రేచితఃకరః,

తా. చారీనాట్యమునందును, పార్శ్వనాట్యమునందును, టెంకాయయందును, ప్రలాపమునందును, ఎల్లనాట్యసమయములయందును ఈ హస్తము చెల్లును.

౧౬. కుళలహస్తలక్షణమ్.

అన్యోన్యాభిముఖావర్ధచంద్రౌ కుళలసంజ్ఞకః. 553
భూచారే నయనే పూర్ణవస్తునిర్దేశభావనే,
జలావగాహే పద్మేచ యుజ్యతే కుళలఃకరః. 554

తా. అర్ధచంద్రహస్తములను ఎదురెదురుగపట్టినయెడ కుళలహస్తమౌను. ఇది భూసంచారము, నేత్రము, పూర్ణవస్తువుల నిర్దేశించుట, నీటిలోమునుఁగుట, తామరపూవు వీనియందు చెల్లును.

౧౭. పతాకవఞ్చితహస్తలక్షణమ్.

కటిదేశగతావేతౌ పతాకవఞ్చితకో భవేత్,
పక్షిణాం పక్షభావేతు రశనాయాం నితమ్బకే. 555
పతాకవఞ్చితహస్తోఽయం యుజ్యతేఽత్రపురాతనైః,

తా. ఈ కుళలహస్తమునందలి అర్ధచంద్రహస్తములను కటిప్రదేశమున నుంచినయెడ పతాకవంచిత హస్తమవును. ఇది పక్షులరెక్కలు, మొలనూలు, కటిపశ్చాద్భాగము వీనియం దుపయోగించును.

### ౧౮. తిలకహస్తలక్షణమ్.

త్రిపతాకాభిధౌహస్తౌ లలాటే హృదయే స్థితౌ. 556
తిలకాభిధహస్తోఽయం కీర్తితో భావవేదిభిః,
దేవపుష్పాంజలౌగన్ధవస్త్వాది తిలకేషుచ. 557
తిలకాభిధహస్తోఽయం కీర్తితో భావవేదిభిః,

తా. త్రిపతాక హస్తములను నొసటను రొమ్మునందును నుంచినయెడ తిలకహస్తమౌను. ఇది దేవపుష్పాంజలి, వాసనగలవస్తువు మొదలైనవి, తిలక భేదములు వీనియందు వినియోగించును.

### ౧౯. ఉత్థానవఞ్చితహస్తలక్షణమ్.

త్రిపతాకావంసదేశే గతా వుత్థానవఞ్చితః. 558
విష్ణోరభినయే స్తమ్భభావనాయాం బుధోదితః,
ఉత్థానవఞ్చితాభిఖ్య స్సర్వనాట్యేషుకీర్తితః. 559

తా. త్రిపతాకహస్తములను భుజమూలములకు సమీపమునఁజేర్చి పట్టినయెడ ఉత్థానవంచిత హస్తమౌను. ఇది మహావిష్ణువును అభినయించుట, స్తంభములను జూపుట వీనియందు చెల్లును.

### ౨౦. వర్ధమానహస్తలక్షణమ్.

ఊర్ధ్వభాగోన్ముఖౌహస్తౌ శిఖరౌ వర్ధమానకః,
సర్వదేతి వచోభావే దత్తమిత్యర్థకేఽపిచ. 560
కింకిమిత్యుక్తి సమయే కదాచి దితిభాషణే,
వర్ధమానకరః ప్రోక్తః భరతాగమవేదిభిః. 561

తా. శిఖరహస్తములను మీఁదికెత్తిపట్టినయెడ వర్ధమానహస్తమౌను. ఇది ఎల్లప్పుడని చెప్పుట, ఇయ్యఁబడినదియనుట, ఏమియేమియనెడి సమయము, ఒకానొకప్పుడనుట వీనియందు చెల్లును.

### ౨౧. జ్ఞానహస్తలక్షణమ్.

ఆదౌపతాకౌ ధృత్వాతు అంసాదూర్ధ్వ ముఖౌవహేత్,
భవేజ్జ్ఞానాభిధకరః కథితం నృత్తకోవిదైః. 562
గ్రహేచ హృదయే ధ్యానే జ్ఞానహస్తో విధీయతే,

తా. మొదటపతాకహస్తములనుబట్టి భుజమూలముల కెదురుగ నిక్కించినయెడ జ్ఞానహస్తమౌను. ఇది గ్రహము, హృదయము, ధ్యానము వీనియందు వినియోగించును.

### ౨౨. రేఖాహస్తలక్షణమ్.

అఙ్గుష్ఠఃకుఞ్చితో భూయాన్మధ్యమాఽనామికాతథా. 563
కుఞ్చితా స్యాత్కనిష్ఠా చ తర్జనీ ప్రసృతాయది,
రేఖాభిధకరస్సోఽయం ముద్రాయాం సమ్ప్రయుజ్యతే.

తా. అంగుష్ఠము మధ్యమ అనామికకనిష్ఠలనువంచి చూఁపుడు వ్రేలిని చాఁచినయెడ రేఖాహస్తమౌను. ఇది ముద్రయందు దుపయోగింపఁబడును.

### ౨౩. వైష్ణవహస్తలక్షణమ్.

ఊర్ధ్వగౌ త్రిపతాకౌచే ద్వైష్ణవః కరఈరితః,
విష్ణోరభినయేయోజ్య ఇతిభావవిదోవిదుః. 565

తా. త్రిపతాకహస్తములను ఎగుమొగములుగఁబట్టినయెడ వైష్ణవహస్తమౌను. ఇది మహావిష్ణువునందు చెల్లును.

### ౨౪. బ్రహ్మోక్తశుకతుణ్డహస్తలక్షణమ్.

కపిత్థేఙ్గుష్ఠతర్జన్యౌ సమానాగ్రౌ ధృతౌ యది,
బ్రహ్మోక్తశుకతుణ్డస్స్యాద్గరుడార్థే నియుజ్యతే. 566

తా. కపిత్థహస్తముయొక్క బొటనవ్రేలును చూపుడు వ్రేలును సమాగ్రములుగఁ బట్టఁబడినయెడ బ్రహ్మోక్తమాను. ఇది గరుత్మంతునియందు చెల్లును.

### ౨౫. ఖణ్డచతురహస్తలక్షణమ్.

చతురే తర్జనీం త్యక్త్వా కనిష్ఠా మిశ్రితా యది,
నామ్నాఽయం ఖణ్డచతురః కీర్తితో భరతాగమే. 567

తా. చతురహస్తమునందు చూపుడువ్రేలినివిడిచి చిటికెనవ్రేలిని జేర్చిపట్టినయెడ ఖండచతురహస్తమవును.

వినియోగము.—

రుధిరాదిద్రవేచాఽపి కర్ణామృతమితీరితే,
ఖణ్డాదిషు ప్రయోక్తవ్యః ఖణ్డాఖ్యచతురః కరః. 568

తా. రక్తము మొదలైనద్రవవస్తువులయందు ఈహస్తముచెల్లును.

### ౨౬. అర్ధచతురహస్తలక్షణమ్.

అస్మిన్కనిష్ఠికే త్యక్త్వా యద్యర్ధచతురో భవేత్,
మధురాది రసాస్వాదే వినియోగోఽస్యకీర్తితః. 569

తా. ఈఖండచతురహస్తమందు చిటికెనవ్రేళ్ళు విడిచినయెడ అర్ధచతురహస్తమాను. ఇది మధురాదిరసములను ఆస్వాదించుటయందు చెల్లును.

## ౨౭. లీనముద్రాహస్తలక్షణమ్.

ముద్రాఖ్యే తర్జనీనమ్రా లీనముద్రాకరోభవేత్,

తా. ముద్రాహస్తమందు చూపుడువ్రేలిని వంచిపట్టినయెడ లీనముద్రాహస్తమవును.

అథైకాదశబాన్ధవ్యాస్తేషాం లక్షణముచ్యతే. 370

తా. ఇంక పదునొకండు బాంధవ్యహస్తములయొక్క లక్షణములు చెప్పఁబడును.

## ౧. దమ్పతీహస్తలక్షణమ్.

వామేతు శిఖరం ధృత్వా దక్షిణే మృగశీర్షకమ్,
ధృతస్త్రీపుంసయోర్హస్తః ఖ్యాతో భరతకోవిదైః. 571

తా. ఎడమచేత శిఖరహస్తమును, కుడిచేత మృగశీర్షహస్తమును పట్టఁబడినయెడ దంపతీహస్తమగును. ఇది భార్యాభర్తలయం దుపయోగించును.

## ౨. మాతృహస్తలక్షణమ్.

హస్తేవామేఽర్ధచంద్రశ్చ సందంశో దక్షిణేకరే,
ఆవర్తయిత్వా జఠరే వామహస్తే తతఃపరమ్. 572
స్త్రీయఃకరో ధృతో మాతృహస్తఇత్యుచ్యతే బుధైః,
జనన్యాంచ కుమార్యాంచ మాతృహస్తో నియుజ్యతే. 573

తా. ఎడమచేత అర్ధచంద్రహస్తమును, కుడిచేత సందంశహస్తమును పట్టి పిమ్మట వామహస్తమును నాభికెదురుగాపట్టి స్త్రీహస్తమును బట్టినయెడ మాతృహస్తమగును. ఇది తల్లియందును, కొమార్తెయందును చెల్లును.

### ౩. పితృహస్తలక్షణమ్.

ఏతస్మిన్ మాతృహస్తేతు శిఖరో దక్షిణే న తు,
ధృతశ్చేన్నాట్యశాస్త్రజ్ఞైః పితృహస్తో ఽయముచ్యతే. 574
అయం హస్తస్తు జనకే జామాతరి నియుజ్యతే,

తా. ముందుచెప్పిన మాతృహస్తము కుడిచేయి శిఖరహస్తముగాఁ బట్టఁబడినయెడ పితృహస్తమగును. ఇది తండ్రియందును, అల్లునియందును వినియోగించును.

### ౪. శ్వశ్రూహస్తలక్షణమ్.

విన్యస్యకణ్ఠేహంసాస్యం సందంశం దక్షిణేకరే. 575
ఉదరేచ పరావృత్య వామహస్తే తతఃపరమ్,
స్త్రీయఃకరో ధృతఃశ్వశ్రూ హస్తస్తస్యాం నియుజ్యతే. 576

తా. కంఠమందు హంసాస్యహస్తమునుంచి కుడిచేతఁ బట్టఁబడిన సందంశహస్తమును నాభికెదురుగాఁ ద్రిప్పి ఎడమచేత స్త్రీహస్తమును పట్టినయెడ శ్వశ్రూహస్తమగును. ఇది అత్తయం దుపయోగించును.

### ౫. శ్వశురహస్తలక్షణమ్.

ఏతస్యాఽన్తే తు హస్తస్య శిఖరో దక్షిణే యది,
ధృతశ్శ్వశురహస్తస్స్యా త్తస్మిన్నేవనియుజ్యతే. 577

తా. ముందుచెప్పఁబడిన శ్వశ్రూహస్తము కుడితట్టు శిఖరహస్తమును పట్టినయెడ శ్వశురహస్తమగును. ఇది మామయందు చెల్లును.

### ౬. భర్తృభ్రాతృహస్తలక్షణమ్.

వామేతు శిఖరం ధృత్వా పార్శ్వయోః కర్తరీముఖమ్,

ధృతో దక్షిణహస్తేన భర్తృభ్రాతృకరస్స్మృతః. 578

తా. ఎడమచేత శిఖరహస్తమునుబట్టి రెండుపార్శ్వములయందును కుడిచేత కర్తరీముఖహస్తమునుపట్టిన భర్తృభ్రాతృహస్త మగును. ఇది పెనిమిటి తోడఁబుట్టినవారియందు వినియోగించును.

౭. ననాంద్రుహస్తలక్షణమ్.

భర్తృభ్రాతృకరస్యాఽంతే స్త్రీ హస్తో దక్షిణేకరే,
ధృతోననాంద్రుహస్తస్స్యాత్తస్యామేవనియుజ్యతే. 579

తా. ముందుచెప్పఁబడిన భర్తృభ్రాతృహస్తమును పట్టినపిదప స్త్రీ హస్తము దక్షిణహస్తమందు పట్టఁబడెనేని ననాంద్రుహస్త మగును. ఇది ఆఁడుబిడ్డయందు ఉపయోగించును.

౮. జ్యేష్ఠకనిష్ఠభ్రాతృహస్తలక్షణమ్.

మయూరహస్తః పురతః పశ్చాద్భాగేచ దర్శితః,
జ్యేష్ఠభ్రాతుః కనిష్ఠస్యాఽప్యయంహస్తః ప్రకీర్తితః. 580

తా. మయూరహస్తము ముందుప్రక్కను వెనుకప్రక్కను పట్టఁబడినయెడ జ్యేష్ఠభ్రాతృ కనిష్ఠభ్రాతృహస్తమగును. ఇది అన్నదమ్ములయందు ఉపయోగించును.

౯. స్నుషాహస్తలక్షణమ్.

ఏతస్యాఽంతే దక్షిణే తు స్త్రీహస్తశ్చ ధృతో యది,
స్నుషాహస్త ఇతిఖ్యాతః భరతాగమవేదిభిః. 581

తా. ముందుచెప్పిన జ్యేష్ఠకనిష్ఠ భ్రాతృహస్తమునుపట్టి పిమ్మట కుడి

చేత స్త్రీహస్తమును పట్టినయెడ స్నుషాహస్తమగును. ఇది కోడలియం దుపయోగించును.

౧౦. భర్తృహస్తలక్షణమ్.

విన్యస్య కంఠే హంసాస్యౌ శిఖరో దక్షిణేకరే,
భర్తృహస్త ఇతిఖ్యాత స్తస్మిన్నేవ నియుజ్యతే. 582

తా. కంఠమందు హంసాస్యహస్తములనుంచి కుడిచేత శిఖరహస్తమును పట్టినయెడ భర్తృహస్తమగును. ఇది మగనియం దుపయోగించును.

౧౧. సపత్నీహస్తలక్షణమ్.

దర్శయిత్వా పాశహస్తం కరాభ్యాం స్త్రీకరావుభౌ,
ధృతౌసపత్న్యా హస్తస్స్యా త్తస్యామేవ నియుజ్యతే. 583

తా. పాశహస్తమునుచూపి రెండుచేతులయందును స్త్రీహస్తములను పట్టినయెడ సపత్నీహస్తమగును. ఇది సవతియం దుపయోగించును.

ఇత్యేకాదశ బాంధవ్య హస్తాస్సందర్శితాః క్రమాత్,
అనుక్తానాంతు బంధూనాం జ్ఞేయాః కర్మానుసారతః. 584

తా. ఈరీతిగా పదునొకండు బాంధవ్యహస్తములు చెప్పఁబడినవి. ఇందు చెప్పఁబడనిబంధువులకు వారివారికి క్రియలను అనుసరించి హస్తములను తెలిసికోవలయును.

అథ బ్రహ్మాదిదేవానాం భావనాభినయక్రమాత్,
మూర్తిభేదేనయే హస్తాస్తేషాం లక్షణముచ్యతే. 585

తా. ఇఁక బ్రహ్మమొదలగు దేవతలయొక్క మూర్తిభేదముల ననుసరించి హస్తములకు లక్షణములు చెప్పఁబడును.

### ౧. బ్రహ్మహస్తలక్షణమ్.

బ్రహ్మణశ్చతురో వామే హంసాస్యో దక్షిణేకరే,

తా. ఎడమచేత చతురహస్తమును, కుడిచేత హంసాస్యహస్తమును బట్టఁబడునెడ బ్రహ్మహస్త మగును.

### ౨. శమ్భుహస్తలక్షణమ్.

శమ్భోర్వామే మృగశిర స్త్రిపతాకశ్చ దక్షిణే. 586

తా. ఎడమచేత మృగశీర్షహస్తమును, కుడిచేత త్రిపతాకహస్తమును పట్టఁబడినయెడ శంభుహస్త మగును.

### 3. విష్ణుహస్తలక్షణమ్.

హస్తాభ్యాం త్రిపతాకాభ్యాం విష్ణుహస్తః ప్రకీర్తితః,

తా. రెండుచేతులను త్రిపతాకహస్తములు పట్టఁబడినయెడ విష్ణుహస్త మగును.

### ४. సరస్వతీహస్తలక్షణమ్.

సూచీకృతే దక్షిణే ఽర్ధచంద్రే వామకరే తథా. 587
సరస్వత్యాః కరః ప్రోక్తః భరతాగమవేదిభిః,

తా. కుడిచేత సూచీహస్తమును, ఎడమచేత అర్ధచంద్రహస్తమును పట్టఁబడినయెడ సరస్వతీహస్త మగును.

### ౫. పార్వతీహస్తలక్షణమ్.

ఊర్ధ్వాధః ప్రసృతావర్ధ చంద్రాఖ్యౌ వామదక్షిణే. 588
అభయో వరదశ్చైవ పార్వత్యాః కరఈరితః,

తా. కుడియెడమచేతులకు క్రిందుమీఁదుచేసి అర్ధచంద్రహస్తములుగా పట్టినయెడ అభయవరదహస్తములగును. అవియే పార్వతీహస్తములు.

### ౬. లక్ష్మీహస్తలక్షణమ్.

అంసోపకంఠే హస్తాభ్యాం కపిత్థాభ్యాం శ్రియఃకరః. 589

తా. బాహుమూలమందు రెండు కపిత్థహస్తములు పట్టఁబడినయెడ లక్ష్మీహస్తమగును.

### ౭. విఘ్నేశ్వరహస్తలక్షణమ్.

పురోగాభ్యాం కపిత్థాభ్యాం కరాభ్యాం విఘ్నరాట్కరః,

తా. ఎదురుగా రెండు కపిత్థహస్తములు పట్టఁబడినయెడ విఘ్నేశ్వరహస్తమగును.

### ౮. షణ్ముఖహస్తలక్షణమ్.

వామేకరే త్రిశూలంచ శిఖరం దక్షిణేకరే. 590
ఊర్ధ్వంగతే షణ్ముఖస్య కరఇత్యుచ్యతే బుధైః,

తా. ఎడమచేతియందు త్రిశూలహస్తమును కుడిచేతియందు శిఖరహస్తమును ఎత్తుగా పట్టఁబడినయెడ షణ్ముఖహస్తమగును.

### ౯. మన్మథహస్తలక్షణమ్.

వామేకరేతు శిఖరం దక్షిణే కటకాముఖః. 591
మన్మథస్య కరఃప్రోక్తో నాట్యశాస్త్రవిశారదైః,

తా. ఎడమచేతియందు శిఖరహస్తమును కుడిచేతియందు కటకాముఖహస్తమును పట్టఁబడినయెడ మన్మథహస్తమగును.

### ౧౦. ఇంద్రహస్తలక్షణమ్.

త్రిపతాకౌ స్వస్తికౌచే దింద్రహస్తః ప్రకీర్తితః. 592

తా. రెండు త్రిపతాకహస్తముల మణికట్టులను చేర్చిపట్టునెడ ఇంద్రహస్తమగును.

### ౧౧. అగ్నిహస్తలక్షణమ్.

త్రిపతాకో దక్షిణే తు వామే లాంగూలహస్తకః,
అగ్నిహస్తస్సవిజ్ఞేయో నాట్యశాస్త్ర విశారదైః. 593

తా. కుడిచేతియందు త్రిపతాకహస్తమును, ఎడమచేతియందు లాంగూలహస్తమును పట్టఁబడినయెడ అగ్నిహస్తమగును.

### ౧౨. యమహస్తలక్షణమ్.

వామే పాశః దక్షిణే తు సూచీయమకరస్స్మృతః,

తా. ఎడమచేతియందు పాశహస్తమును, కుడిచేతియందు సూచీహస్తమును పట్టఁబడినయెడ యమహస్తమగును.

### ౧3. నైర్ఋతిహస్తలక్షణమ్.

ఖట్వాచ శకటశ్చైవ కీర్తితో నైర్ఋతేః కరః. 594

తా. ఖట్వాహస్తమును శకటహస్తము బట్టినయెడ నైర్ఋతిహస్తమగును.

### ౧౪. వరుణహస్తలక్షణమ్.

పతాకో దక్షిణే వామే శిఖరం వారుణః కరః,

తా. కుడిచేతియందు పతాకహస్తమును, ఎడమచేతియందు శిఖరహస్తమును పట్టఁబడినయెడ వరుణహస్తమగును.

౧౫. వాయుహస్తలక్షణమ్.

అరాళో దక్షిణే వామే హస్తేచార్ధపతాకకః. 595
ధృతౌ చే ద్వాయుదేవస్య హస్తఇత్యభిధీయతే,

తా. కుడిచేతియందు అరాళహస్తమును, ఎడమచేతియందు అర్ధపతాకహస్తమును పట్టఁబడినయెడ వాయుహస్తమగును.

౧౬. కుబేరహస్తలక్షణమ్.

వామే పద్మం దక్షిణేతు గదా యక్షపతేర్గకరః. 596

తా. ఎడమచేతియందు పద్మహస్తమును, కుడిచేతియందు గదాహస్తమును పట్టఁబడినయెడ కుబేరహస్తమగును.

అథ నవగ్రహహస్తా నిరూప్యంతే.

౧. సూర్యహస్తలక్షణమ్.

అంసోపకణ్ఠే హస్తాభ్యాం సోలపద్మ కపిత్థకౌ,
ధృతౌ యది భవేదేష దివాకరకరస్స్మృతః. 597

తా. భుజశిరస్సులసమీపములందు రెండుచేతులచే సోలపద్మకపిత్థహస్తములు పట్టఁబడినయెడ సూర్యహస్తమగును.

౨. చంద్రహస్తలక్షణమ్.

సోలపద్మం వామకరే దక్షిణేచ పతాకకః,
నిశాకరకరఃప్రోక్తో భరతాగమకోవిదైః. 593

తా. ఎడమచేతియందు సోలపద్మహస్తమును, కుడిచేతియందు పతాకహస్తమును పట్టఁబడినయెడ చంద్రహస్తమగును.

### 3. అఙ్గారకహస్తలక్షణమ్.

వామే కరేతు సూచీస్యాద్దక్షిణే ముష్టిహస్తకః,
కృతశ్చేన్నాట్యశాస్త్రజ్ఞై రఙ్గారకకరస్స్మృతః. 599

తా. ఎడమచేత సూచీహస్తమును, కుడిచేత ముష్టిహస్తమును పట్టఁబడినయెడ అంగారకహస్తమగును.

### ४. బుధహస్తలక్షణమ్.

తిర్యగ్వామే ముష్టిహస్తః దక్షిణేచ పతాకకః,
బుధగ్రహకరః ప్రోక్తో భరతాగమవేదిభిః. 600

తా. ఎడమచేత నడ్డముగా ముష్టిహస్తమును, కుడిచేత పతాకహస్తమును పట్టఁబడినయెడ బుధహస్తమగును.

### ౫. బృహస్పతిహస్తలక్షణమ్.

హస్తాభ్యాం శిఖరం ధృత్వా యజ్ఞసూత్ర ప్రదర్శనే,
ఋషిబ్రాహ్మణ హస్తోఽయం గురోశ్చ పరికీర్తితః. 601

తా. రెండుహస్తములచే శిఖరహస్తమును, యజ్ఞసూత్రప్రదర్శనమందువలె పట్టినయెడ బృహస్పతిహస్తమగును. ఇది ఋషులయందును, బ్రాహ్మణులయందును చెల్లును.

### ౬. శుక్రహస్తలక్షణమ్.

వామోర్ధ్వభాగే ముష్టిస్స్యా దధస్తా ద్దక్షిణేన చ,
శుక్రగ్రహకరః ప్రోక్తో భరతాగమవేదిభిః. 602

తా. ఎడమప్రక్కమీఁదుగాను, కుడిప్రక్క క్రిందుగాను ముష్టిహస్తము పట్టఁబడినయెడ శుక్రునిహస్తమగును.

### ౭. శనైశ్చరహస్తలక్షణమ్.

వామేకరేతు శిఖరం త్రిశూలం దక్షిణేకరే,
శనైశ్చరకరః ప్రోక్తో భరతాగమవేదిభిః. 603

తా. ఎడమచేత శిఖరహస్తమును, కుడిచేత త్రిశూలహస్తమును పట్టఁబడినయెడ శనైశ్చర హస్తమగును.

### ౮. రాహుహస్తలక్షణమ్.

సర్పశీర్షం వామకరే సూచీస్యాద్దక్షిణేకరే,
రాహుగ్రహకరః ప్రోక్తో భరతాగమవేదిభిః. 604

తా. ఎడమచేత సర్పశీర్షహస్తమును, కుడిచేత సూచీహస్తమును పట్టఁబడినయెడ రాహుహస్తమగును.

### ౯. కేతుహస్తలక్షణమ్.

వామే కరేతు సూచీస్యా ద్దక్షిణేఽర్ధ పతాకకః,
కేతుగ్రహకరః ప్రోక్తో భరతాగమవేదిభిః. 605

తా. ఎడమచేత సూచీహస్తమును, కుడిచేత అర్ధపతాకహస్తమును పట్టఁబడినయెడ కేతుహస్తమగును.

## అథ దశావతారహస్తానిరూప్యంతే.

### ౧. మత్స్యావతారహస్తలక్షణమ్.

మత్స్యహస్తం దర్శయిత్వా తతస్స్కంధ సమౌ కరౌ,
త్రిపతాకౌ యది ధృతౌ యుజ్యతే మత్స్యజన్మని. 606
ధృతౌ మత్స్యావతారస్య హస్తఇత్యుచ్యతే బుధైః,

తా. మత్స్యహస్తమును జూపి రెండు త్రిపతాకహస్తములను భుజశిరస్సులకు సమముగాఁబట్టినయెడ మత్స్యావతారహస్తమగును. ఇది మత్స్యావతారమం దుపయోగించును.

## ౨. కూర్మావతారహస్తలక్షణమ్.

కూర్మహస్తం దర్శయిత్వా తతస్స్కంధసమౌ కరౌ. 607
త్రిపతాకౌ యది ధృతౌ యుజ్యతే కూర్మజన్మని,
ధృతౌ కూర్మావతారస్య హస్తఇత్యుచ్యతేబుధైః. 608

తా. కూర్మహస్తమునుజూపి భుజశిరస్సులకు సమముగా త్రిపతాకహస్తములుపట్టినయెడ కూర్మావతారహస్తమగును. ఇది కూర్మావతారమందు చెల్లును.

## 3. వరాహావతారహస్తలక్షణమ్.

దర్శయిత్వా వరాహం తు కటిపార్శ్వే సమౌ కరౌ,
ధృతౌ వరాహదేవస్య హస్త ఇత్యభిధీయతే. 609

తా. వరాహహస్తమును జూపి పిరుదులయందు హస్తములనుంచు నెడ వరాహావతారహస్తమగును.

## ౪. నృసింహావతారహస్తలక్షణమ్.

వామే సింహముఖం ధృత్వా దక్షిణే త్రిపతాకకః,
నరసింహావతారస్య హస్త ఇత్యభిధీయతే. 610

తా. ఎడమచేత సింహముఖహస్తమును, కుడిచేత త్రిపతాకహస్తమును బట్టినయెడ నృసింహావతారహస్తమగును.

### ౫. వామనావతారహస్తలక్షణమ్.

ఊర్ధ్వాధో ధృతముష్టిభ్యాం సవ్యాన్యాభ్యాం యదిస్థితః,
సవామనావతారస్య హస్త ఇత్యభిధీయతే. 611

తా. మీఁదుగాను క్రిందుగాను ఎడమకుడిచేతులచే రెండుముష్టిహస్తములు పట్టఁబడినయెడ వామనావతారహస్తమగును.

### ౬. పరశురామావతారహస్తలక్షణమ్.

వామం కటితటే న్యస్య దక్షిణేఽర్ధపతాకకః,
ధృతః పరశురామస్య హస్త ఇత్యభిధీయతే. 612

తా. ఎడమచేతిని నడుమునందుంచి కుడిచేత అర్ధపతాకహస్తమును బట్టునెడ పరశురామావతారహస్తమగును.

### ౭. రఘురామావతారహస్తలక్షణమ్.

కపిత్థం దక్షిణే హస్తే వామే తు శిఖరఃకరః,
అధరోత్తరభాగేతు రామచంద్రకరఃస్మృతః. 613

తా. కుడిచేత కపిత్థహస్తమును, ఎడమచేత శిఖరహస్తమును క్రిందుమీఁదులుగా పట్టఁబడినయెడ రామచంద్రావతారహస్తమగును.

### ౮. బలరామావతారహస్తలక్షణమ్.

పతాకో దక్షిణే హస్తే ముష్టిర్వామకరే తథా,
బలరామావతారస్య హస్త ఇత్యభిధీయతే. 614

తా. కుడిచేత పతాకహస్తమును, ఎడమచేత ముష్టిహస్తమును పట్టఁబడినయెడ బలరామావతారహస్తమగును.

౯. కృష్ణావతారహస్తలక్షణమ్.

మృగశీర్షేతు హస్తాభ్యా మన్యోన్యాభిముఖీకృతే,
అంసోపకంఠే కృష్ణస్య హస్త ఇత్యభిధీయతే. 615

తా. రెండుమృగశీర్షహస్తములు భుజశిరస్సులసమీపమున ఎదురెదురుగాపట్టఁబడినయెడ కృష్ణావతారహస్తమగును.

౧౦. కల్క్యవతారహస్తలక్షణమ్.

పతాకో దక్షిణే వామే త్రిపతాక కరో ధృతః,
హస్తః కల్క్యవతారస్య ఇతినాట్యవిదోవిదుః. 616

తా. కుడిచేత పతాకహస్తమును ఎడమచేత త్రిపతాకహస్తమును పట్టఁబడినయెడ కల్క్యవతారహస్తమగును.

౧౧. రాక్షసహస్తలక్షణమ్.

ముఖేకరాభ్యాం శకటో రాక్షసానాం కరస్స్మృతః,

తా. రెండుచేతులచే ముఖమునందు శకటహస్తము పట్టఁబడెనేని రాక్షసహస్తమగును.

అథ చతుర్వర్ణహస్తానిరూప్యంతే.

బ్రాహ్మణహస్తలక్షణమ్.

కరాభ్యాం శిఖరం ధృత్వా యజ్ఞసూత్ర ప్రదర్శనే. 617
దక్షిణేన కృతే తిర్యగ్బ్రాహ్మణానాం కరస్స్మృతః,

తా. రెండు శిఖరహస్తములనుబట్టి కుడిచేత అడ్డముగా జన్నిదమును జూపునెడ బ్రాహ్మణహస్తమగును.

### క్షత్రియహస్తలక్షణమ్.

వామేన శిఖరం తిర్యగ్ధృత్వాఽన్యేనపతాకకః. 618
ధృతో యది క్షత్త్రియాణాం హస్త ఇత్యభిధీయతే,

తా. ఎడమచేత శిఖరహస్తమును అడ్డముగాఁబట్టి కుడిచేత పతాక హస్తమును పట్టునెడ క్షత్రియహస్తమగును.

### వైశ్యహస్తలక్షణమ్.

వామే కరే తు హంసాస్యదక్షిణే కటకాముఖః. 619
వైశ్యహస్తోఽయమాఖ్యాతో భరతాగమవేదిభిః,

తా. ఎడమచేత హంసాస్యహస్తమును, కుడిచేత కటకాముఖహస్తమును పట్టఁబడినయెడ వైశ్యహస్తమగును.

### శూద్రహస్తలక్షణమ్.

వామేతు శిఖరం సూచీ దక్షిణే శూద్రహస్తకః. 620

తా. ఎడమచేత శిఖరహస్తమును, కుడిచేత సూచీహస్తమును పట్టఁబడినయెడ శూద్రహస్తమగును.

అష్టాదశానాం జాతీనాం కర్మాధీనాః కరా స్మృతాః,

తా. పదునెనిమిదిజాతులకును వారివారి క్రియలకు తగినట్లు హస్తములు చెప్పఁబడును.

తత్తద్దేశజనానాంచ ఏవ మూహ్యం బుధోత్తమైః. 621

తా. ఆయాదేశముల జనులకును ఈరీతిగానే హస్తము లూహింపవలసినది.

యావదర్థాః ప్రయోగాణాం తావద్భేదాఃకరాస్స్మృతాః,
అర్థాత్ప్రకరణాల్లిఙ్గాదౌచిత్యాదర్థనిర్ణయః.    622

తా. ప్రయోగముల కెన్నివిధముల యర్థములుగలవో అన్నివిధముల హస్తములునుగలవు. అర్థము, ప్రకరణము, లింగము, ఔచిత్యము అను వీనివలన అర్థము నిర్ణయము చేయవలయును.

తత్తత్సమ్యక్సమాలోక్య సఙ్గ్రహోక్త మిదం మయా,
సమాలోచ్య ప్రయోక్తవ్యం భావజ్ఞైరిహశాస్త్రతః    623

తా. ఈవిషయమునంతయు బాగుగా విమర్శించి సంగ్రహముగా చెప్పితిని కనుక భావజ్ఞులీశాస్త్రరీతిని చక్కగా నాలోచించి తత్తద్విషయానుగుణముగ ప్రయోగములు చేయవలెను.

గ్రంథాంతరస్థప్రసిద్ధరాజహస్తానిరూప్యంతే.

శుకతుండో హరిశ్చంద్రే మయూరో నళభూపతౌ,
పురుకుత్సేఽల పద్మాఖ్యో ముష్టిహస్తః పురూరవే.    624

అలపద్మశ్శిరస్థాయీ సగరార్థే నియుజ్యతే,
దిలీపాఖ్యే పతాకస్స్యాదమ్బరీషేతు కర్తరీ.    625

శిబిరాజ్ఞికపిత్థస్స్యాత్పురోభాగే ప్రచాలితః,
ఉభౌ పతాకౌ భుజయో రంతే దేవవిభావనే.    627

కథితౌ కార్తవీర్యేతు విరళాఙ్గుష్ఠరంధ్రకౌ.
ఏతావహోత్సంఖితౌ చేద్రావణార్థే ప్రకీర్తితౌ.    627

భుజదేశే ప్రచలితః సూచిస్స్యాద్ధర్మరాజకే,
త్రిపతాకః పురోభాగే చాలితశ్చపునఃపునః.    628

అర్జునార్థే నాట్యభేదే యుజ్యతే నాట్యవేదిభిః,
భీమే ముష్టిః పురోభాగే చలితో యది కల్ప్యతే. 629

ఉక్తః శైబ్యే సూచిరేవ కిఞ్చిదుద్వేష్టితాఙ్గుళిః,
కటకో నకులార్థేచ శిఖర స్సహదేవకే. 630

నహుషే చలహస్తస్స్యాద్యయాతౌ తామ్రచూడకః,
అర్ధచంద్రకరస్సోఽయం త్రిపతాకాకృతిర్భవేత్. 631

భగీరథార్థే యోజ్యస్స్యాద్రాహుగ్రస్తేన్దుమణ్డలే,

తా. శుకతుండహస్తము హరిశ్చంద్రునియందును, మయూరహస్తము నలునియందును, అలపద్మహస్తము పురుకుత్సునియందును, ముష్టిహస్తము పురూరవునియందును, శిరస్సునందు జేర్చిన యలపద్మహస్తము సగరునియందును, పతాకహస్తము దిలీపునియందును, కర్తరీముఖహస్తము అంబరీషునియందును, ఎదురుగా చలింపఁజేయఁబడిన కపిత్థహస్తము శిబియందును, ఎదముగాఁ జేయఁబడి భుజములకొనలయందు దేవభావనగా పట్టఁబడిన రెండు పతాకహస్తములు కార్తవీర్యునియందును, ఆపతాకహస్తములే ముందు వెనుకలుగా గూర్చి పట్టినయెడ రావణునియందును, భుజప్రదేశమందు చలింపఁజేయఁబడిన సూచీహస్తము ధర్మరాజునందును, త్రిపతాకహస్తము ఎదురుగ మాటిమాటికి చలింపఁజేయఁబడెనేని అర్జునునియందును, ముష్టిహస్తము ఎదురుగ చలింపఁజేయఁబడెనేని భీమసేనునియందును, ఉద్వేష్టితాంగుళమగు సూచీహస్తము శైబ్యునియందును, కటకాముఖహస్తము నకులునియందును, శిఖరహస్తము సహదేవునియందును, చలపతాకహస్తము నహుషునియందును, తామ్రచూడహస్తము యయాతియందును, అర్ధచంద్రహస్తమును త్రిపతాకాకృతిగఁ బట్టినయెడ భగీరథునియందును, రాహుగ్రస్తమైన చంద్రమండలమందును చెల్లును.

మాంధాతాగ్రిమభూపాలే మరుత్వానితిభూభుజి. 632
నిరూపణార్థే ముకుళ సూచీముష్టికరోఽపిచ,
కరోఽప్యర్ధపతాకస్స్యాదుద్వేష్టిత తనుమ్భుజః. 633
ఏతే చతుర్విధాహస్తాః ప్రయోజ్యంతే యథాక్రమాత్,
రఘూవజ మహీపాలే దక్షిణేతరభాగతః. 634
క్రమేణ పరియోజ్యేతే పూర్వోక్తార్ధపతాకకౌ,
అలపద్మస్స్వస్తికశ్చేద్యోజ్యో దశరథే నృపే. 635
రామే శిఖరహస్తోఽసౌ విశేషాచ్చాపపాణిషు,
యోజ్యః శాస్త్రప్రయోగేషు పూర్వధర్మవిశారదైః. 636
శిఖరోఽయం దక్షిణాంసగామీచేద్భరతే భవేత్,
అయంవా మాంసగామీచే ల్లక్ష్మణార్థే నియుజ్యతే. 637
అయం లలాటగామీచే చ్ఛత్రుఘ్నార్థే నియుజ్యతే,
సోమవంశేజనిజుషామేతే వామాంసయోజనాత్. 638
కల్పితా నాట్యకుశలైః యుక్తధర్మ ప్రయోగతః,

తా. మాంధాతయనెడి రాజశ్రేష్ఠునియందును, మరుత్తు అనెడి మహారాజునందును, ముకుళహస్తము సూచీహస్తము ముష్టిహస్తము ఉద్వేష్టితార్ధపతాకహస్తము ఈనాలుగుహస్తములును క్రమముగ చెల్లును. రఘుమహారాజు, అజమహారాజు వీరియందు అర్ధపతాకహస్తములు కుడియెడమలుగా చెల్లును. దశరథమహారాజునందు, స్వస్తికాలపద్మహస్తము చెల్లును. శిఖరహస్తము రామునియందును, చాపపాణులైన రాజులయందును చెల్లును. శిఖరహస్తము కుడిమూపునందుఁజేర్చి పట్టఁబడినయెడ భరతునియందును, ఎడమమూపునందుఁ జేర్చిపట్టినయెడ లక్ష్మణునియందును, నొసటికి సరిగా

పట్టఁబడినయెడ శత్రుఘ్నునియందును చెల్లును. ఇట్లు ఈహస్తములు క్రమముగా సూర్యవంశపురాజుల విషయమందు చెప్పఁబడెను. ఈహస్తములే యెడమప్రక్కగా పట్టఁబడునెడ చంద్రవంశపురాజుల విషయమునందు వినియోగించునని నాట్యశాస్త్రజ్ఞులచేత జెప్పఁబడుచున్నది.

### సప్తసముద్రహస్తానిరూప్యంతే.

లవణేక్షు సురా సర్పిర్దధిక్షీరజలార్ణవాః. 639
ఏతేషాం హస్తకలనా విశేషాత్ప్రతిపాద్యతే,

తా. లవణము, ఇక్షువు, సుర, సర్పి, దధి, క్షీరము, జలము అని సముద్రములు ఏడు. వీనియందు హస్తసందర్భములు విశేషముగాఁ జెప్పఁబడును.

### ౧. లవణసముద్రహస్తలక్షణమ్.

ముకుళాఖ్యాకరౌచైవ వ్యావృత్తౌచాఽపవేష్టితౌ. 640
ప్రయోజ్యౌ లవణాంబోధౌ ధిషణస్య మతాంతరే,

తా. విరివిగా త్రిప్పఁబడినముకుళహస్తములను అధోముఖములుగఁ బట్టినయెడల లవణసముద్రమందు చెల్లును అని బృహస్పతిమతము.

### ౨. ఇక్షుసముద్రహస్తలక్షణమ్.

అలపద్మస్తథాభూత ఇక్ష్వబ్ధౌ సమ్ప్రయుజ్యతే. 641

తా. అలపద్మహస్తమును క్రిందచెప్పినప్రకారమే పట్టినయెడ ఇక్షుసముద్రమందు చెల్లును.

### 3. సురాసముద్రహస్తలక్షణమ్.

సజేర్ణాఖ్య పతాకౌచ తథైవ గుణమాశ్రితౌ,
సురాంబుధౌ ప్రయోక్తవ్యౌ శుక్రాచార్య మతాంతరే.

తా. సంకీర్తి పతాకములను ఆదేరీతిని విరివిగా త్రిప్పి దిగుమొగ ములంగాఁ బట్టినయెడ సురాసముద్రమందు చెల్లును. అని శుక్రాచార్యుల మతము.

౪. సర్పిస్సముద్రహస్తలక్షణమ్.

సర్పిరబ్ధేస్తు చతురో వాయుసూనుమతాంతరే,

తా. సర్పి (నేతి) స్సముద్రమందు చతురహస్తము చెల్లును. అని హనుమంతుని మతము.

౫. దధిసముద్రహస్తలక్షణమ్.

త్రిపతాకాభిధౌహస్తౌ పూర్వవద్గుణమాశ్రితౌ. 643
దధ్యర్ణవేప్రయోక్తవ్యౌ దత్తిలాచార్యసమ్మతౌ,

తా. త్రిపతాకహస్తములను ముందుచెప్పినరీతినబట్టినయెడ దధిసముద్రమందు చెల్లును. అని దత్తిలాచార్యమతము.

౬. క్షీరసముద్రహస్తలక్షణమ్.

సర్పశీర్షాహ్వయౌ హస్తౌ యథాపూర్వగుణాశ్రయౌ.644
క్షీరసాగరరూపార్థే నారదాభిమతౌస్మృతౌ,

తా. సర్పశీర్షహస్తములను మునుపటివలెనేపట్టినయెడ క్షీరసముద్రమందు చెల్లును. అని నారదమహాముని మతము.

౭. శుద్ధోదకసముద్రహస్తలక్షణమ్.

పతాక గుణసంయుక్తౌ పూర్వవన్మిళితౌకృతౌ. 645
జలార్ణవే ప్రయోక్తవ్యౌ కోహళాచార్యసమ్మతౌ,

తా. పతాకహస్తములను మునుపటివలెనే విరివిగాఁద్రిప్పి క్రిందు

ముఖముగఁబట్టినయెడ శుద్ధోదకసముద్రమందు చెల్లును. అని కోహలాచార్యమతము.

### ప్రసిద్ధనదీనాం హస్తానిరూప్యంతే.

గంగాదీనాం నిర్ణయేతు వ్యావృత్తశ్చోఽపవేష్టితః. 646
నదీనామపి సర్వాసాం పతాకస్సముదాహృతః,
గంగాదీనాం విశేషేణ తద్గుణాద్యనువర్ణనాత్. 647
హస్తానాం భేదకలనా గురుణా పూర్వమీరితా,
తత్స్వరూపం ప్రవక్ష్యామి నాట్యాభినయయోగతః. 648

తా. గంగ మొదలైననదులను నిర్ణయించుటయందు ముందరికిచాఁచి క్రిందుగాఁబట్టఁబడిన పతాకహస్తము వినియోగించును. ఆగంగాదినదులకు వానివానివిశేషగుణాదులనుబట్టి వర్ణించుటవలన నాట్యాభినయమునందు కొన్ని హస్తములు వినియోగింపఁబడును గనుక వాని స్వరూపము లిచ్చట చెప్పఁబడుచున్నవి.

### గంగాదినదీహస్తలక్షణాని.

గంగాయాం తామ్రచూడస్స్యాత్సూర్యజాయాస్తు రేఖికః
కృష్ణవేణ్యాం సింహముఖః కావేర్యాం చతురఃకరః. 649
పతాకచతురౌహస్తౌ సరస్వత్యాం ప్రకీర్తితౌ,
నర్మదాయాం విధేయస్స్యాత్కరోహ్యర్ధపతాకికః. 650
హంసాస్యస్తుఙ్గభద్రాయాం శరావత్యాంతు బాణకః,
సూచీహస్తో వేత్రవత్యాం చంద్రభాగార్ధకేచలః. 651
సరయ్వామలపద్మాఖ్యో భీమరథ్యామురాళకః,
సువర్ణముఖనద్యాంచ కరోఽర్ధచతురోమతః. 652

శుకతుణ్డః పాపనాశ్యాం యుజ్యతే భావవేదిభిః,
అనుక్తానాం నదీనాంచ పతాకస్సమ్ప్రయుజ్యతే. 653

తా. తామ్రచూడహస్తము గంగానదియందును, రేఖాహస్తము యమునానదియందును, సింహముఖహస్తము కృష్ణవేణీనదియందును, చతురహస్తము కావేరినదియందును. పతాకచతురహస్తములు సరస్వతీనదియందును, అర్ధపతాకహస్తము నర్మదానదియందును, హంసాస్యహస్తము తుంగభద్రానదియందును, బాణహస్తము శరావతీనదియందును, వేత్రవతియందు సూచీహస్తమును, చంద్రభాగయందు చలపతాకహస్తమును, అలపద్మహస్తము సరయూనదియందును, అరాళహస్తము భీమరథీనదియందును, అర్ధచతురహస్తము స్వర్ణముఖినదియందును, శుకతుండహస్తము పాపనాశనీనదియందును చెల్లును. ఇవిగాక తక్కిననదులయందు పతాకహస్తము చెల్లును.

### ౧. ఊర్ధ్వలోకహస్తలక్షణమ్.

భూలోకశ్చ భువర్లోక స్స్వర్గలోక స్తతః పరః,
జనోలోక స్తపోలోక స్సత్యలోకాభిధ స్తతః. 654
మహర్లోకశ్చ సప్తైతే లోకాశ్చోర్ధ్వం సమాశ్రితాః,
ఉద్వేష్టితఃపతాకస్తు ఏతేషు వినియుజ్యతే. 655

తా. భూలోకము, భువర్లోకము, స్వర్గలోకము, జనోలోకము, తపోలోకము, సత్యలోకము, మహర్లోకము ఇవి యేడు మీదిలోకములు వీనియందు ఉద్వేష్టితపతాకహస్తము వినియోగించును.

### ౨. అధోలోకహస్తలక్షణమ్.

అతలో వితలశ్చైవ సుతలశ్చ తలాతలః,
మహాతల ఇతిఖ్యాతో రసాతల ఇతీరితః. 656

పాతాళశ్చైవ సప్తైతే హ్యధోలోకాః ప్రకీర్తితాః,
అధోలోకేషు యుజ్యేత పతాకశ్చాపవేష్టితః. 657

తా. అతలము, వితలము, సుతలము, తలాతలము, మహాతలము,రసాతలము, పాతాళము ఈయేడు క్రిందిలోకములు వీనియందు అపవేష్టిత పతాకహస్తము వినియోగించును.

అథ వృక్షభేదానాం హస్తానిరూప్యంతే.

అశ్వత్థవృక్షహస్తః.

అలపద్మౌ రేచితౌ చే దశ్వత్థే సమ్ప్రయుజ్యతే,

తా. రెండు అలపద్మహస్తములను చలింపఁజేసినయెడ అశ్వత్థవృక్షమందు చెల్లును.

కదళీవృక్షహస్తః.

కదళ్యాం శ్లిష్టముకుళో రేచితో ద్వేష్టితోభవేత్. 658

తా. శ్లిష్టముకుళహస్తమును పొడువుగ కదలించి పట్టినయెడ కదళీవృక్షమందు చెల్లును.

నారఙ్గలికుచవృక్షహస్తౌ.

నారఙ్గే పద్మకోశస్స్యా ద్భ్రమరోలికుచే భవేత్,

తా. నారింజచెట్టునందు పద్మకోశహస్తమును, గజనిమ్మచెట్టునందు భ్రమరహస్తమును చెల్లును.

పనసబిల్వవృక్షహస్తౌ.

పనసే చతురః ప్రోక్తో బిల్వార్థే చతురోభవేత్. 659

తా. పనసబిల్వవృక్షములయందు చతురహస్తము చెల్లును.

పునాగవృక్షహస్తః.

పతాక చతురౌ ప్రోక్తౌ పున్నాగతరునిర్ణయే,

తా. పతాకచతురహస్తములు పొన్నమ్రానియందు చెల్లును.

మందారవకుళవృక్షహస్తౌ.

మందారే ఖండచతురః సందంశో వకుళే భవేత్. 660

తా. ఖండచతురహస్తము మందారవృక్షమందును, సందంశహస్తము వకుళవృక్షమందును చెల్లును.

వటార్జునవృక్షహస్తౌ.

పతాకో వటవృక్షే స్యా దర్జునే సింహవక్త్రకః,

తా. మఱ్ఱిమ్రానియందు పతాకహస్తమును, ఏరుమద్దిమ్రానియందు సింహముఖహస్తమును చెల్లును.

పాటలీహింతాలవృక్షహస్తౌ.

పాటల్యాం శుకతుండస్స్యాత్ హింతాలే కర్తరీముఖః.

తా. పాదిరిచెట్టునందు శుకతుండహస్తమును, ఈదాటిచెట్టునందు కర్తరీ ముఖహస్తమును చెల్లును.

పూగవృక్షహస్తః.

పద్మకోశౌ స్వస్తికౌ స్తః పూగవృక్షనిరూపణే,

తా. రెండు పద్మకోశహస్తములు స్వస్తికములుగఁ బట్టఁబడినయెడ పోకమ్రానియందు చెల్లును.

చమ్పకవృక్షహస్తః.

చమ్పకే పూర్వశాస్త్రజ్ఞై రధోలాంగూలమిష్యతే. 662

తా. సంవెగమూర్తినియందు అధోలాంగూల హస్తమును వినియోగింపవలెనని పూర్వశాస్త్రజ్ఞులచే చెప్పఁబడెను.

ఖదిరవృక్షహస్తః.

అధోనతస్తామ్రచూడః కరః ఖదిరవర్ణనే,

తా. తామ్రచూడహస్తమును మిక్కిలి క్రిందుమొగముగ వంచి పట్టునెడ నల్లతుమ్మచెట్టునందు చెల్లును.

శమీవృక్షహస్తః.

శమీవృక్షే సమాఖ్యాతః కరోఽయ శ్లిష్టకర్తరీ. 663

తా. శ్లిష్టకర్తరీహస్తము జమ్మిచెట్టునందు చెల్లును.

అశోకవృక్షహస్తః.

పతాకౌ మణిబంధస్థౌ సమ్యక్తిర్యక్కృతౌ యది,
పతాకస్వస్తికోహస్తః కథితో భరతాదిభిః. 664
పతాకస్వస్తికోహస్తః అశోకాభినయేస్మృతః,

తా. పతాకహస్తములు మనికట్టులందుఁ జేర్చి యడ్డముగాఁ బట్టఁబడిన యెడ పతాకస్వస్తిక హస్తమగును. ఇది అశోకవృక్షమునందు చెల్లును.

సిందువారవృక్షహస్తః.

సిందువారతరౌ యోజ్యః కరశ్లిష్టమయూరకః. 665

తా. వావిలిచెట్టునందు శ్లిష్టమయూరహస్తము చెల్లును.

ఆమలకవృక్షహస్తః.

తర్జనీ మధ్యమా హస్తతలే సమ్మిశ్రితే యది,
ఇతరే ప్రసృతాస్సోఽయం కరః సంయమనామకః. 666
సంయమాభిధహస్తోఽయం భవేదామలకేద్రుమే,

తా. తర్జనీమధ్యమలను అరచేతిలోఁ జేర్చి తక్కినవ్రేళ్ళనుచాఁచిపట్టిన నది సంయమహస్తమగును. ఈహస్తము ఉసిరికచెట్టునందుచెల్లును.

కురవకవృక్షహస్తః.

కర్తరీత్రిపతాకౌచ జ్ఞేయాకురవకద్రుమే. 667

తా. కర్తరీత్రిపతాకహస్తములు ఎఱ్ఱపువ్వుల గోరంటచెట్టునందు చెల్లును.

కపిత్థవృక్షహస్తః.

అలపద్మా స్వస్తికౌచేత్కపిత్థార్థేనియుజ్యతే,

తా. అలపద్మహస్తములను స్వస్తికములుగఁబట్టినయెడ వెలగమ్రాని యందు చెల్లును.

కేతకీవృక్షహస్తః.

పతాక చతురాభిఖ్యౌ స్వస్తికౌ మణిబన్ధయోః. 668
కేతకీ వృక్షభేదేఽపి యుజ్యేతే దేవమంత్రిణి,

తా. పతాకచతురహస్తములను మణిబంధములందు స్వస్తికములుగఁబట్టినయెడ పచ్చమొగలిచెట్టునందును దేవమంత్రియందును చెల్లును.

శింశపావృక్షహస్తః.

అర్థచంద్రౌస్వస్తికౌచేత్ప్రయోజ్యౌ శింశపాతరౌ. 669

తా. అర్థచంద్రహస్తములను స్వస్తికములుగఁబట్టిన ఇరుగుడుమ్రాని యందుచెల్లును.

నిమ్బసాలవృక్షహస్తౌ.

శుకతుండౌ స్వస్తికౌచే న్నిమ్బేసాలేనిరూపితౌ,

తా. శుకతుణ్డహస్తములను స్వస్తికములుగఁ బట్టినయెడ వేపమ్రాని యందును, సాలవృక్షమందును చెల్లును.

పారిజాతవృక్షహస్తః.

వామే పతాకకోహస్త స్తత్రసవ్యేపతాకికః. 670

ఉద్వేష్టితకృతోహస్తః త్రిజ్ఞానః పరికీర్తితః,

త్రిజ్ఞానః పారిజాతస్య క్రోడే యది ధృతఃకరః. 671

తా. ఎడమచేతను కుడిచేతను పతాకహస్తమును పైకి త్రిప్పి పట్టిన యెడ త్రిజ్ఞాన హస్తమౌను. ఈహస్తము రొమ్మునకెదురుగఁ బట్టినయెడ పారిజాతవృక్షమందు చెల్లును.

తింత్రిణీజమ్బూవృక్షహస్తౌ.

తింత్రిణ్యామపిలాఙ్గూలో జమ్బ్వామర్ధపతాకకః,

తా. చింతచెట్టునందు లాంగూలహస్తమును, నేరేడుచెట్టునందు అర్ధపతాకహస్తమును చెల్లును.

పాలాశరసాలవృక్షహస్తౌ.

పాలాశేచార్ధచన్ద్రశ్చ రసాలే త్రిపతాకికః. 672

తా. మోదుగుచెట్టునందు అర్ధచంద్రహస్తమును, తియ్యమామిడిచెట్టునందు త్రిపతాకహస్తమును చెల్లును.

అథ సింహాదిమృగాణాం హస్తానిరూప్యన్తే.

౧. సింహహస్తలక్షణమ్.

దక్షిణే సింహవక్త్రస్స్యాత్తత్పృష్ఠేవామహస్తతః,

పతాకహస్తమాశ్రిత్యచలత్ప్రవిరళాఙ్గుళిమ్. 673

శ్లిష్టసింహముఖస్సోయం సింహేర్థేవినియుజ్యతే,

తా. కుడిచేత సింహముఖహస్తమునుబట్టి దాని వెనుకతట్టు పతాకహస్తమును ఎడమైన వ్రేళ్లుగలుఁగఁబట్టినది శ్లిష్టసింహముఖ హస్తమనఁబడును. ఈహస్తము సింహమునందు చెల్లును.

౨. వ్యాఘ్రహస్తలక్షణమ్.

అర్ధచంద్రోఽధోముఖశ్చేద్వ్యాఘ్రాఖ్యో వ్యాఘ్రేసమ్ప్రయుజ్యతే.

తా. అర్ధచంద్రహస్తమును అధోముఖముగఁ బట్టినయెడ పెద్దపులియందు చెల్లును.

3. సూకరహస్తలక్షణమ్.

పూర్వోక్తమత్స్యహస్తేతు దక్షిణః కుఞ్చితశ్చలః,
అస్యాఽంగుళ్యః ప్రవిరళాః పఞ్చసఙ్ఖ్యాయథాక్రమమ్.
యుజ్యతేస్తబ్ధరోమాగ్రే సఙ్కీర్ణమకరః కరః,

తా. ముందుచెప్పిన మత్స్యహస్తమందు దక్షిణహస్తమును వంచి కదలించుచు వ్రేళ్ల నైదింటిని విరళముగఁబట్టిన నది సంకీర్ణ మకరహస్త మనఁబడును. ఈహస్తము పందియందు వినియోగించును.

౪. కపిహస్తలక్షణమ్.

పూర్వోక్తముష్టిహస్తస్తు మధ్యమాంగుష్ఠయోగతః. 676
నామ్నాఽధోముష్టిముకుళః కపేరర్థేనిరూప్యతే,

తా. ముందుచెప్పిన ముష్టిహస్తము మధ్యమాంగుష్ఠముల చేరికవలన అధోముష్టి ముకుళహస్తమనఁబడును. ఈహస్తము కోఁతియందు వినియోగించును.

౫. భల్లూకహస్తలక్షణమ్.

వామహస్తేపద్మకోశోఽధోముఖత్వముపాశ్రితః. 677
దక్షిణేతు పతాకాఖ్యస్తస్యపృష్ఠతలశ్రితః,
భల్లూకార్థేప్రయోజ్యస్స్యాత్పద్మకోశపతాకకః. 678

తా. ఎడమచేత దిగుమొగముగా పద్మకోశహస్తమునుబట్టి కుడిచేత

పట్టఁబడిన పతాకహస్తమును దానిపై నుంచినయెడ పద్మకోశపతాకహస్తమగును. ఇది ఎలుగుగొడ్డునందు వినియోగించును.

### ౬. మార్జారహస్తలక్షణమ్.

పూర్వోక్తముష్టిహస్తస్యాఽనామికాఙ్గుష్ఠయోగతః,
నామ్నాఽయమర్ధముకుళో మార్జారే సమ్ప్రయుజ్యతే.

తా. ముందుచెప్పఁబడిన ముష్టిహస్తముయొక్క అనామికాంగుష్ఠములను జేర్చిపట్టినది అర్ధముకుళహస్తమగును. ఈహస్తము పిల్లియందు చెల్లును.

### ౭. చమరీమృగహస్తలక్షణమ్.

వామేముష్టిర్దక్షిణే వా మణిబంధేన మిశ్రితా,
ముద్రికాఽధోముఖా ముష్టిముద్రా హస్తోఽయమీరితః.
ముష్టిముద్రాకరశ్చాపి చమర్యాం సమ్ప్రయుజ్యతే,

తా. ఎడమచేత ముష్టిహస్తమును కుడిచేత ముద్రాహస్తమును మనికట్టులోఁజేర్చి క్రిందుమొగముగాఁబట్టినయెడ ముష్టిముద్రాహస్తమగును. ఇది చమరీమృగమునందు వినియోగించును.

### ౮. గోధాహస్తలక్షణమ్.

ఊర్ధ్వేకనిష్ఠికాఙ్గుష్ఠౌ పతాకేకిఞ్చిదీరితౌ. 681
నామ్నా తలపతాకోఽయం గోధాయాం పుష్టితో భవేత్,

తా. పతాకహస్తమందు కనిష్ఠికాంగుష్ఠములను కొంచెముమీఁదికి ఎత్తిపట్టినయెడ తలపతాకహస్తమగును. ఈహస్తము ఉడుమునందు చెల్లును.

### ౯. శల్యమృగహస్తలక్షణమ్.

పూర్వోక్తమృగశీర్షస్య తర్జన్యార్ధప్రసారితా. 682
నామ్నా చంద్రమృగో హస్త శ్శల్యార్థే సమ్ప్రయుజ్యతే,

తా. మునుపుచెప్పిన మృగశీర్షహస్తమందు చూపుడువ్రేలు పైకెత్తఁబడినయెడ చంద్రమృగహస్తమగును. ఇదిశల్యమృగమందు వినియోగించును.

### ౧౦. కురంగహస్తలక్షణమ్.

కురఙ్గేచ ప్రయోక్తవ్యో మృగశీర్షకనామకః. 683

తా. మృగశీర్షహస్తము జింకయందుచెల్లును.

### ౧౧. కృష్ణసారహస్తలక్షణమ్.

పూర్వోక్తముష్టిహస్తేతు కనిష్ఠాంగుష్ఠసారణాత్,
నామ్నా మృష్టిమృగోహస్తః కృష్ణసారే ప్రయుజ్యతే. 684

తా. మునుపుచెప్పిన ముష్టిహస్తమందు కనిష్ఠాంగుష్ఠములనుచాఁచిపట్టినయెడ ముష్టి మృగహస్తమౌను. ఇది నల్లజింకయందు చెల్లును.

### ౧౨. గోకర్ణహస్తలక్షణమ్.

ధేనుకర్ణేనాగబంధౌ రేచితౌ యదియోజితౌ,

తా. నాగబంధహస్తములను మీఁదికి చలింపఁజేయుచు పట్టినయెడ గోకర్ణమృగమునందు చెల్లును.

### ౧౩. మూషికహస్తలక్షణమ్.

పూర్వోక్తముకుళేహస్తే తర్జనీ సంప్రసారితా. 685
నామ్నా౽యంఖణ్డముకుళో మూషికార్థే నియుజ్యతే,

తా. మునుపుచెప్పిన ముకుళహస్తమందు చూపుడువ్రేలిని బాగుగ చాఁచిపట్టినయెడల ఖండముకుళహస్తమగును. ఈహస్తము ఎలుకయందు చెల్లును.

### ౧౪. గిరికాహస్తలక్షణమ్.

పూర్వోక్తముకుళే భూయస్తర్జనీ కుఞ్చితా యది. 686

తిర్యక్ప్రసారితః ఖడ్గముకుళో గిరికార్థకే,

తా. మునుపుచెప్పిన ముకుళహస్తమందు చూపుడు వ్రేలినివంచి అడ్డముగచాఁచిపట్టినయెడ ఖడ్గముకుళహస్తమౌను. ఇది చిట్టెలుకయందుచెల్లును.

౧౫. శశహస్తలక్షణమ్.

హస్తస్తలపతాకాఖ్యశ్శశకేతిర్యగాశ్రయః. 687

తా. తలపతాకహస్తము అడ్డముగ త్రిప్పఁబడినయెడ కుందేటియందు చెల్లును.

౧౬. వృశ్చికహస్తలక్షణమ్.

అధోముఖో రేచితశ్చేత్కర్కటో వృశ్చికేభవేత్,

తా. కర్కటహస్తమును అధోముఖముగ చలింపఁజేయుచు పట్టినయెడ తేలునందు చెల్లును.

౧౭. శునకహస్తలక్షణమ్.

పతాకాభిధహస్తేతు కుఞ్చితాచేత్కనిష్ఠికా. 688

నామ్నా మధ్యపతాకోఽయం శునకార్థే ప్రయుజ్యతే,

తా. పతాకహస్తమందు చిటికెనవ్రేలు ముడువఁబడెనేని మధ్యపతాకహస్తమౌను. ఇది కుక్కయందుచెల్లును.

౧౮. ఉష్ట్రహస్తలక్షణమ్.

పూర్వోదితాంజలికరేచాఽఙ్గుష్ఠౌ కుఞ్చితౌయుతౌ. 689

ప్రసారితావూర్ధ్వభాగే చలితౌ చాప్యధోముఖౌ,

నామ్నా ఖణ్డాంజలిరయం ఉష్ట్రార్థే సమ్ప్రయుజ్యతే. 690

తా. మునుపుచెప్పిన అంజలిహస్తమందు అంగుష్ఠములను వంచిచేర్చి పొడుగుగఁజాఁచి అధోముఖముగ చలింపఁజేయుచు పట్టినయెడ ఖండాంజలిహస్తమగును. ఇది ఒంటెయందు చెల్లును.

### ౧౯. అజహస్తలక్షణమ్.

శిఖరాశ్లిష్టవదనౌ మేషార్థే సమ్ప్రయుజ్యతే,

తా. శిఖరహస్తములను ముఖభాగము చేరఁబట్టినయెడ మేఁకయందు వినియోగించును.

### ౨౦. గార్దభహస్తలక్షణమ్.

పూర్వఖణ్డాఞ్జలౌమిశ్రే కుఞ్చితే తర్జనీద్వయే. 691
భిన్నాంజలిరయంనామ్నా గార్దభార్థేనియుజ్యతే,

తా. మునుపుచెప్పిన ఖండాంజలిహస్తమందు తర్జనీద్వయమును జేర్చి వంచిపట్టినయెడ భిన్నాంజలి హస్తమవును. ఇది గాడిదయందు చెల్లును.

### ౨౧. వృషభహస్తలక్షణమ్.

మధ్యమానామికేకిఞ్చిత్కుఞ్చితే తలమాశ్రితే. 692
అంగుష్ఠేనో పరియుతే శేషే ద్వేచ ప్రసారితే,
తలసింహాకరస్సోఽయ మృషభార్థేనియుజ్యతే. 693

తా. మధ్యమానామికలను కొంచెము అరచేతితట్టునకువంచి వాని మీఁద అంగుష్ఠమునుజేర్చి తక్కిన రెండువ్రేళ్లను చాఁచిపట్టినయెడ తల సింహహస్తమౌను. ఇది వృషభార్థమందు వినియోగించును.

### ౨౨. ధేనుహస్తలక్షణమ్.

మధ్యమావక్రితాయత్ర శేషాస్సర్వేప్రసారితాః,
ధేనౌయోజ్యోయన్త్రభేదే భవేత్సఙ్కీర్ణముద్రకః. 694

తా. నడిమి వ్రేలిని వంచి తక్కిన వ్రేళ్ళను చాఁచిపట్టినయెడ సంకీర్ణ ముద్రహస్తమౌను. ఇది ఆవునందును, యంత్రభేదమునందును చెల్లును.

### అథ పక్షిహస్తానిరూప్యంతే.

#### ౧. పారావతహస్తలక్షణమ్.

పారావతే కపోతాఖ్యకరస్స్యాత్పుఙ్ఖితాకృతిః,

తా. కపోతహస్తమును పుంఖితాకారముగఁ బట్టినయెడ పావురాయియందు వినియోగించును.

#### ౨. కపోతహస్తలక్షణమ్.

కపోతస్తిర్యగాకారః కపోతే వినియుజ్యతే. 695

తా. కపోతహస్తమును అడ్డముగాఁ బట్టినయెడ అడవిపావురాయియందు వినియోగించును.

#### 3. శశాదనహస్తలక్షణమ్.

భ్రష్టోక్తశుకతుండస్స్యాచ్ఛశాదననిరూపణే,

తా. భ్రష్టోక్తశుకతుండహస్తము డేగయందు వినియోగించును.

#### ౪. ఉలూకహస్తలక్షణమ్.

గజదంతౌశ్లిష్టముఖౌ సఙ్కీర్ణగజదన్తకః. 696

సఙ్కీర్ణగజదన్తోఽయములూకార్థేనియుజ్యతే,

తా. గజదంతహస్తముల మొనలను జేర్చిపట్టినయెడ సంకీర్ణ గజదంత హస్తమవును. ఇది గుడ్లగూబయందు చెల్లును.

#### ౫. గండభేరుండహస్తలక్షణమ్.

మణిబంధేసమాశ్లిష్టావర్ధచన్ద్రావధోముఖౌ. 697

సర్వాఙ్గుళ్యస్తువిరళానామ్నా స్వస్తికచన్ద్రకః,

గండభేరుండకాఖ్యేఽస్యవినియోగః ప్రకీర్తితః. 698

తా. అర్ధచంద్రహస్తములను అధోముఖములుగ మనికట్లు చేరఁబట్టి వ్రేళ్లను విరళములుగాఁ జేసినయెడ స్వస్తిక చంద్రహస్తమగును. ఇది గండభేరుండపక్షియందు వినియోగింపఁబడును.

### ౬. చాతకహస్తలక్షణమ్.

లాఙ్గూలశ్చాతకేభూయాత్పుఙ్ఖితత్వముపాశ్రితః,

తా. లాంగూలహస్తమును పుంఖితముగఁ బట్టినయెడ చాతకపక్షియందు చెల్లును.

### ౭. కుక్కుటహస్తలక్షణమ్.

పూర్వోక్తభ్రమరోభూయాత్తామ్రచూడనిరూపణే. 699

తా. మునుపు చెప్పఁబడిన భ్రమ హస్తమే కోడియందు వినియోగించును.

### ౮. చాతకహస్తలక్షణమ్.

అరాళఃపుఙ్ఖితాకారః కోకిలార్థేనియుజ్యతే,

తా. అరాళహస్తమును పుంఖితముగఁ బట్టినయెడ కోకిలయందు చెల్లును.

### ౯. వాయసహస్తలక్షణమ్.

భరతార్ణవసంప్రోక్తభ్రమరాంగుష్ఠక స్తథా. 700
అగ్రభాగేన తర్జన్యాః మిళితో యది పుఙ్ఖితః,
సందంశముకుళోభూయాద్వాయసార్థే నియుజ్యతే. 701

తా. భరతార్ణవమందు చెప్పఁబడియుండెడి భ్రమరహస్తాంగుష్ఠమును చూపుడువ్రేలి కొనతోఁ జేర్చి పుంఖితముగఁబట్టఁబడినయెడ సందంశముకుళహస్తమగును. ఇది కాకియందు వినియోగించును.

### ౧౦. కురరహస్తలక్షణమ్.

కురరాఖ్యేఽపవిద్ధాఖ్యే సూచిరేవ ప్రయుజ్యతే,

తా. సూచిహస్తము అపవిద్ధముగఁ బట్టఁబడినయెడ కురరపక్షియందు చెల్లును.

### ౧౧. శుకహస్తలక్షణమ్.

శుకతుండః ప్రయోక్తవ్యః శుకార్థే పుఙ్ఖితాకృతిః. 702

తా. శుకతుండహస్తమును పుంఖితాకారముగఁ బట్టినయెడ చిలుకయందు వినియోగించును.

### ౧౨. సారసహస్తలక్షణమ్.

ముకులేతు కనిష్ఠాపి కిఞ్చిద్వక్రితభావతః,

నామ్నా ప్రదేశముకులో యోజ్యోఽయం సారసార్థకే.

తా. ముకుళహస్తమునందలి చిటికెనవ్రేలు కొంచెము వంకరగాపట్టబడినయెడ ప్రదేశముకుళహస్తమగును. ఇది సారసపక్షియందు వినియోగించును.

### ౧౩. బకహస్తలక్షణమ్.

తర్జన్యంగుష్ఠ సంయోగే మధ్యమాఽనామికాపిచ,

ప్రసారితే కనిష్ఠాచేద్వక్రితాతలమాశ్రితా. 704

నామ్నా సఙ్కీర్ణహంసోఽయం శుక్రాచార్యమతోదితః,

బకార్థే మంత్రభేదేషు యోజ్యస్సఙ్కీర్ణహంసకః. 705

తా. తర్జన్యంగుష్ఠములను జేర్చి మధ్యమానామికలనుచాఁచి కనిష్ఠను అరచేతిలో మడిచిపట్టినయెడ సంకీర్ణహంసహస్తమగును. ఇది శుక్రాచార్యుని మతము. ఈహస్తము కొంగయందును మంత్రభేదమునందును చెల్లును.

### ౧౪. క్రౌఞ్చపక్షిహస్తలక్షణమ్.

పూర్వాలపద్మహస్తేతు కనిష్ఠాతలకుఞ్చితా,

లీనాలపద్మహస్తోఽయం క్రౌఞ్చార్థే సమ్ప్రయుజ్యతే. 706

తా. ముందుచెప్పిన అలపద్మహస్తమందు చిటికెనవ్రేలు అరచేతిలో వంచఁబడినయెడ లీనాలపద్మహస్తమగును. ఇది క్రౌంచపక్షి (గుడ్డికొంగ) యందు వినియోగించును.

౧౫. ఖద్యోతహస్తలక్షణమ్.

అంగుష్ఠో మధ్యమాయాస్స్యాదగ్రపర్వనిపీడితః,
ముఖహంస కరస్సోఽయం ఖద్యోతార్థే పవిద్ధకః. 707

తా. బొటనవ్రేలిచే నడిమివ్రేలికొనగనుపు ఒరయునట్లు అపవిద్ధముగఁబట్టినయెడ ముఖహంసహస్తమవును. ఇది మిడుగురుపురుగునందు వినియోగించును.

౧౬. భ్రమరహస్తలక్షణమ్.

ప్రయోజ్యో భ్రమరోహస్తో భృంగార్థే యది పుంఖితః,

తా. భ్రమరహస్తమును పుంఖితముగఁబట్టినయెడ తుమ్మెదయందు వినియోగించును.

౧౭. మయూరహస్తలక్షణమ్.

మయూరార్థే ప్రయోజ్యస్స్యాన్మయూరోపుంఖితోయది.

తా. మయూరహస్తమును పుంఖితాకారముగఁబట్టినయెడ నెమలియందు వినియోగించును.

౧౮. హంసహస్తలక్షణమ్.

హంసాస్యోఽపి ప్రయోజ్యస్స్యాత్ హంసార్థేనృత్తకోవిదైః.

తా. మునుపుచెప్పిన హంసాస్యహస్తము హంసపక్షియందు వినియోగించును.

౧౯. చక్రవాకహస్తలక్షణమ్.

అలపద్మా పుఙ్ఖితౌ చేచ్చక్రవాకే నియుజ్యతే. 709

తా. అలపద్మహస్తములను పుంఖితములుగఁబట్టిన యెడ చక్రవాక పక్షియందు వినియోగించును.

౨౦. కోయష్టికహస్తలక్షణమ్.

అరాళో దక్షిణే వామే పతాకేనవిమిశ్రితః,
నామ్నా౽రాళపతాకో౽యం కోయష్టికనిరూపణే. 710

తా. కుడిచేతి అరాళహస్తమును ఎడమచేతిపతాకహస్తముతో జేర్చి పట్టినయెడ అరాళపతాకహస్తమగును. ఇది కోయష్టికమనెడి పక్షియందు వినియోగించును.

౨౧. వ్యాళీహస్తలక్షణమ్.

తర్జనీమధ్యమేచాగ్రే చాపవద్వక్రితేయుతే,
అనామికా౽ఙ్గుష్ఠసంధౌ వక్రితాసు ప్రతిష్ఠితా. 711
కనిష్ఠావక్రితాచా౽యం వ్యాళీవ్యాళ్యాం నియుజ్యతే,

తా. తర్జనీమధ్యమలను జేర్చి ధనుస్సువలె వంచి అనామికను అంగుష్ఠ సంధియందుంచి కనిష్ఠను వంచిపట్టిన నది వ్యాళీహస్తమనఁబడును. ఇది వ్యాళి యనెడి పక్షియందు వినియోగించును.

అథ జలజన్తుహస్తానిరూప్యంతే.

౧. భేకహస్తలక్షణమ్.

చక్రాఙ్గుష్ఠౌచ తర్జన్యౌ హస్తయోరంతరఙ్గతౌ, 712
మధ్యమేమిశ్రితేదీర్ఘేకుఞ్చితేచా౽ప్యనామికే,
ప్రసారితేకనిష్ఠేచశ్లిష్టచక్రో౽యమిష్యతే. 713
ఏతస్యవినియోగస్తుభేకార్థేసమ్ప్రయుజ్యతే.

తా. చక్రహస్తములయొక్క అంగుష్ఠతర్జనులను చేతిలోపలికి మడిచి మధ్యమలను జేర్చి అనామికలను వంచి కనిష్ఠలను చాఁచిపట్టిన నది శ్లిష్టచక్ర హస్తమనఁబడును. ఈహస్తము భేకార్థమందు చెల్లును.

౨. కుళీరహస్తలక్షణమ్.

దక్షిణః కర్కటోభూయాదపవేష్టితరూపకః. 714
వామహస్తోపరిస్థాయీశ్లిష్టశ్చాఽస్యాంగులిః క్రమాత్,
లీనకర్కటకస్సోఽయంకులీ రేసమ్ప్రయుజ్యతే. 715

తా. కుడికర్కట హస్తమును అపవేష్టితముగ ఎడమచేతిమీఁదికి చాఁచి పట్టి వ్రేళ్లనుజేర్చిన నది లీనకర్కటహస్తమౌను. ఇది కుళీరార్థమందు వినియోగించును.

3. రక్తపాయిహస్తలక్షణమ్.

రక్తపాయినిసూచీస్యాద్రేచితాతిర్యగేవచ,

తా. సూచీహస్తమును కదలించుచు అడ్డముగఁబట్టిన జలగయందు చెల్లును.

౪. నక్రహస్తలక్షణమ్.

పతాక స్వస్తికోహస్తోమిళిత శ్చ విసర్జితః. 716
నక్రార్థే పేటికార్థేచ యోజితఃపూర్వసూరిభిః,

తా. పతాకహస్తమును స్వస్తికముగఁబట్టి విడిచిన నది మొసలి యందును, పెట్టెయందును వినియోగించును.

౫. డుణ్డుభహస్తలక్షణమ్.

దక్షిణః కర్తరీభూతః కరస్యోర్ధ్వముఖో యది. 717
అన్యప్రకోష్ఠే వామస్యాత్కటకాముఖరూపతః,
కర్తరీదండహస్తోఽయం డుణ్డుభార్థేప్రయుజ్యతే. 718

తా. కుడిచేతియందు కర్తరీముఖ హస్తమును ఊర్ధ్వముఖముగాఁబట్టి అన్యప్రకోష్ఠమందు కటకాముఖ హస్తమునుబట్టిన నది కర్తరీదండహస్తమౌను. ఇది యిరుదలలపామునందు వినియోగించును.



సరసాభినయాదీనా మాపాదన సుధీ జుషా,
వేంకటాచార్యవర్యేణ నీడామంగలవాసినా,
భరతాగమగ్రంథాది భావశాస్త్రేష్వనేకశః,
సంగృహ్యవిషయాన్సమ్యక్పూర్వైకైస్సముదాహృతాౘ,
గ్రథితోఽయం సమాలోచ్య నితరాం విదుషాంముదే,
ఏవమాలోక్యసుధియ స్తుష్యేయురితిసాదరమ్,
దర్పణాఖ్యేనగ్రంథేనముద్రితోఽసౌయథామతి.

తా. సరసాభినయాదులను జెప్పుటయందు సమర్థుఁడైన నీడామంగలం తిరువేంకటాచార్యులచే భరతశాస్త్రాదులవలననుండి అనేకవిషయములు సంగ్రహింపఁబడి అభిజ్ఞుల సంతోషముకొఱకు అభినయదర్పణము అను గ్రంథములోఁజేర్చి అచ్చువేయింపఁబడెను.

ఇతి అభినయదర్పణాఖ్యోగ్రన్థః.
గ్రన్థాంతరస్థశిరోభేదాదిసహితః సమాప్తః.



చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్‌సన్సు వారిచే
శ్రీరామప్రెస్సున ముద్రితము.—1934—750.

# సంస్కృతగ్రంథములు.



| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| బాలరామాయణము, సటీక | ... | 0 | 2 |
| శ్రీమద్రామాయణము, సాధారణప్రతి | ... | 3 | 8 |
| ,, మేలుప్రతి, 2 వాల్యములు | ... | 6 | 0 |
| ,, సుందరకాండము, మూలము | ... | 1 | 0 |
| ,, ఉత్తరకాండము, మేలుప్రతి | ... | 1 | 4 |
| అధ్యాత్మరామాయణము, మూలము | ... | 1 | 0 |
| ,, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | ... | 8 | 0 |
| శ్రీమద్రామాయణము, సటీక, 15 సంపుటములు | ... | 70 | 0 |
| శ్రీమద్రామాయణము, వ్యాఖ్యానచతుష్టయవిశిష్టము, 2 వాల్యములు | | 15 | 0 |
| శ్రీమద్రామాయణము, ఉత్తరకాండసహా, ఆంధ్రతాత్పర్యసహితము 7 వాల్యములు | ... | 17 | 0 |
| బాలకాండము, ఆంధ్రతాత్పర్యము | ... | 2 | 0 |
| అయోధ్యాకాండము ,, | ... | 3 | 0 |
| అరణ్యకాండము ,, | ... | 2 | 0 |
| కిష్కింధాకాండము ,, | ... | 2 | 8 |
| సుందరకాండము ,, | ... | 2 | 0 |
| యుద్ధకాండము ,, | ... | 4 | 0 |
| ఉత్తరకాండము ,, | ... | 2 | 8 |
| కార్తికమాహాత్మ్యము ,, | ... | 0 | 12 |
| కాశీమాహాత్మ్యము, తెనుఁగువచనము | ... | 0 | 8 |
| గయామాహాత్మ్యము ,, | ... | 0 | 6 |
| సింహాచలక్షేత్రమాహాత్మ్యము ,, | ... | 0 | 8 |
| గరుడపురాణము, వ్యాఖ్యానాంధ్రతాత్పర్యసహితము | ... | 1 | 0 |
| జగన్నాథమాహాత్మ్యము, తెనుఁగు | ... | 0 | 2 |
| ధనుర్మాసమాహాత్మ్యము, ఆంధ్రతాత్పర్యము | ... | 0 | 2 |

| | రూ. | అ. |
|---|---|---|
| పద్మపురాణాంతర్గతమాఘపురాణము, ఆంధ్రతాత్పర్యసహితము | 2 | 0 |
| శ్రీమహాభారతము, గచ్ఛద్వ్యాఖ్యానసహితము, 3 సంపుటములు | 30 | 0 |
| శ్రీమద్భాగవతము, శ్రీధరీయవ్యాఖ్యానసహితము, 2 సంపుటములు | 10 | 0 |
| శ్రీమద్దేవీభాగవతము, సవ్యాఖ్యానము ... | 12 | 0 |
| అద్వైతసంగ్రహము, తెనుఁగువచనము ... | 0 | 2 |
| ఆత్మబోధము, సాంధ్రటీక ... | 0 | 4 |
| ఆనందలహరి, ఆంధ్రతాత్పర్యసహితము ... | 0 | 4 |
| అపరోక్షానుభూతి ,, ... | 0 | 4 |
| అద్వైతపంచరత్నములు ,, ... | 0 | 2 |
| అద్వైతోపదేశపంచరత్నములు ... | 0 | 2 |
| ఆత్మపూజ, ఆంధ్రతాత్పర్యసహితము ... | 0 | 1 |
| ఆత్మవిద్యావిలాసము ... | 0 | 6 |
| ఆత్మానాత్మవివేకము ... | 0 | 4 |
| అష్టోత్తరశతోపనిషత్తులు, మూలము ... | 6 | 0 |
| ఉత్తరగీతా, సటీక, చిన్నసైజు ... | 0 | 12 |
| అద్వైతవేదాంతపరిభాష, సవ్యాఖ్యానము ... | 1 | 4 |
| అద్వైతానుభూతి ,, ... | 0 | 2 |
| ఉపదేశసాహస్రి, ఆంధ్రతాత్పర్యసహితము ... | 2 | 8 |
| జ్ఞానవాసిష్ఠము ,, ... | 8 | 0 |
| విద్యారణ్యకృతజీవన్ముక్తిప్రకాశిక ,, ... | 2 | 0 |
| నైష్కర్మ్యసిద్ధి, శ్రీసురేశ్వరాచార్యకృతము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము ... | 3 | 8 |
| పంచీకరణము, ఆంధ్రతాత్పర్యము ... | 0 | 2 |
| ,, తెనుఁగువచనము ... | 0 | 2 |
| పంచదశీప్రకరణము ,, ... | 5 | 0 |
| బ్రహ్మసూత్రములు, మూలము ... | 0 | 3 |
| ,, తెనుఁగువచనము ... | 12 | 0 |
| భగవద్గీతాసారసంకీర్తనలు ... | 0 | 2 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| భగవద్గీతలు, మూలముమాత్రము | ... | 0 | 4 |
| ,, కాలికో బైండు | ... | 0 | 6 |
| ,, ఆంధ్ర తాత్పర్యసహితము | ... | 1 | 4 |
| ,, ,, చిన్న సైజు | ... | 0 | 8 |
| ,, ఆనిబిసెంటుగారి ఇంగ్లీషుతర్జుమా | ... | 0 | 8 |
| ,, శ్రీ రామచంద్ర సరస్వతీకృత ఆంధ్రటీకాతాత్పర్యసహితము | | 2 | 12 |
| భగవద్గీత, ద్వైతమతానుసారమైన వివరణము | ... | 1 | 0 |
| శంకరగీతాభాష్యము, మేలు ప్రతి | ... | 1 | 8 |
| వాసుదేవమననము, తెనుఁగువచనము | ... | 0 | 12 |
| వ్యవహారపంచకము, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 2 |
| వేదాంతస్తోత్రపంచకము ,, | ... | 0 | 4 |
| శివగీతా, సాంధ్ర తాత్పర్యము, చిన్న సైజు | ... | 0 | 12 |
| రామగీతా ,, | ... | 0 | 6 |

ఉపనిషత్తులు, ఆంధ్ర తాత్పర్యసహితము.

| | | | |
|---|---|---|---|
| అమృతబిందూపనిషత్తు, ఆంధ్ర తాత్పర్యసహితము | ... | 0 | 2 |
| అద్వయతారక ,, | ... | 0 | 2 |
| అథర్వశిఖ ,, | ... | 0 | 2 |
| అథర్వశిర ,, | ... | 0 | 5 |
| ఆత్మబోధ ,, | ... | 0 | 2 |
| ఆరుణేయ ,, | ... | 0 | 3 |
| ఈశావాస్య ,, | ... | 0 | 4 |
| ఐతరేయ ,, | ... | 0 | 8 |
| కేన ,, | ... | 0 | 4 |
| కైవల్య ,, | ... | 0 | 2 |
| కృష్ణ ,, | ... | 0 | 3 |
| కఠ ,, | ... | 1 | 0 |
| తైత్తిరీయ ,, | ... | 3 | 0 |
| సర్వసార ,, | ... | 0 | 2 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| పరమహంసోపనిషత్తు, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 4 |
| ప్రశ్న | ,, ... | 0 | 12 |
| బ్రహ్మ | ,, ... | 0 | 2 |
| ముక్తిక | ,, ... | 0 | 8 |
| ముండక | ,, ... | 0 | 12 |
| మండలబ్రాహ్మణ | ,, ... | 0 | 3 |
| మాండూక్య | ,, ... | 1 | 8 |
| యోగతత్త్వ | ,, ... | 0 | 3 |
| జాబాలి | ,, ... | 0 | 2 |
| వజ్రసూచిక | ,, ... | 0 | 2 |
| వాసుదేవ | ,, ... | 0 | 2 |
| శారీరక | ,, ... | 0 | 2 |
| గర్భ | ,, ... | 0 | 2 |
| నిరాలంబ | ,, ... | 0 | 2 |
| శ్వేతాశ్వతరోపనిషత్తు, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 1 | 12 |
| అథర్వవేదీయ ప్రాణాగ్నిహోత్రోపనిషత్తు | ... | 0 | 3 |
| ద్వాదశోపనిషత్తులు, తెనుఁగువచనము | ... | 3 | 0 |
| స్కందోపనిషత్తు, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 2 |
| గణపతి, దక్షిణామూర్తి, జాబాలి | ... | 0 | 3 |
| బృహదారణ్యకోపనిషద్భాష్యము | ... | 6 | 0 |
| శంకరవిజయము, సవ్యాఖ్యానము | ... | 2 | 0 |
| వివేకచూడామణి, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 12 |
| సౌందర్యలహరి, సాంధ్రటీకాతాత్పర్యము | ... | 0 | 4 |
| హఠయోగప్రదీపిక, సాంధ్రతాత్పర్యము | ... | 2 | 8 |
| శాంతివిలాసము | ,, ... | 0 | 6 |
| శుకాష్టకము | ,, ... | 0 | 2 |